

'ఏ . ఎ. యు పార్కులో "

ఫొటో. ఎస్. వి సత్యన్నారాయణ (సికింద్రాబాదు)


సొగసైన రూపము
"'హేజ్‌లైన్' స్నో" ప్రతి రోజూ వాడుచుండుటవల్ల
మీ చర్మము అతి మృదువుగాను, అతి నునుపుగాను అత్యంత
సొగసుగాను వుండును. చర్మరంధ్రములలోకి చొచ్చుకుపోయే
దీని శక్తి దీనిని చర్మసౌందర్యమును కలిగించుటకు దివ్యమైనట్టిదిగా
పౌడర్‌కు ఆధారమైనట్టిదిగా చేసినది. చోర-నిరోధక
ప్యాకింగ్ అసలైన సరుకును సమకూర్చుచున్నది.
For the Skin
"HAZELINE" SNOW
"'HAZELINE' SNOW"
"'హేజ్‌లైన్' స్నో"
ట్రేడ్ మార్కు

ఆంధ్రపత్రిక వారపత్రిక

## ఉత్తరాలు

### కార్టూనులు

29—3—61 పత్రికలో వేసిన "ఊమెన్" గారి "ఏమా కరువైతే ....?" 'కన్నబిడ్డకు దిక్కులేదు' వ్యంగ్య చిత్రాలు చాల బాగున్నవి. ఇటువంటి వ్యంగ్యచిత్రములకు ప్రతి పత్రికలో మరియొక పుట (పేజి) ను ఉపయోగించవలెనని కోరుచున్నాను.

ఎస్. ఫిలిప్ (హైదరాబాదు)

* * *

29—3—61 న తేదీ పత్రికలో ఒక సోదరి భర్తలచేత వంట వండించుకునే స్త్రీ లున్నారేమో గాని పూజలు చేయించుకునేందుకు శాసించే స్త్రీలుండబోరని వ్రాసినారు. వంట చేయించుకునేందుకు సిద్ధపడినవారు పూజలు చేయించుకునేందుకు మాత్రం వెనుదీస్తారా? బహుశః ఆమె యింటి ఆచారము భర్తలచేత వంట వండించుకోవడమేమో నని తోచుచున్నది.

చెరుకూరి సోమసుందరం (కోటిపల్లి)

* * *

29—3—61 తేది సంచికలో ఊమెన్‌గారు వేసిన కార్టూన్‌లలో కెల్ల "కన్నబిడ్డకు దిక్కులేదు, పరాయివాళ్ల గొడవ కూడానా?" అన్న కార్టూన్ ఎంతో బ్రహ్మాండముగా చిత్రీకరించారు. ఇటువంటి కార్టూన్‌లు యికముందు


# ప్రత్యేకత గల యంత్రము



**Rita**
**SEWING MACHINE**

## రీటా కుట్టు యంత్రము

చూపునకు, గుణములకు ప్రత్యేకత గలది. ఇది పటిష్టముగా, అందముగా, తేలికగా, నిశ్శబ్దముగా పని చేయునట్లున్ను, అన్ని విధములైన కుట్టు, ఎంబ్రాయిడరీ పనులు చేయుటకు వీలుగాను నిర్మింపబడినది.

Rita

రీటా మెకానికల్ వర్క్సు, లూధియానా (ఇండియ)

Newfields

కూడా వేసి సెలవులలో నవ్వులతో గడిపించ గల రని కోరుచున్నాము

బి. ఎం. గౌడ్ (నగునూర్)

*      *      *

22—3—61 తేదీ సంచికలో ఎగ్గోని శ్యామ సుందర్ చిత్రం ప్రస్తుత పరిస్థితులను చూచి చిత్రించినట్లుగా ఉన్నది. రైలును అలాగు పట్టుకుని ఉంటే అతడు క్రిందకు పడకుండా ఉండడం అది అద్భుతము ఈ చిత్రమును చూచి మేము నవ్వుకున్నాం. చిత్రకారునకు నా అభివందన ములు

బి. ఇ రాజామణిబాబు (గుత్తి)

*      *      *

29—3—61 వారపత్రికలో ప్రచురించిన "కన్నబిడ్డకు దిక్కులేదు. పరాయివాళ్ళ గొడవ కూడానా? ఇదేం అన్యాయం?" అనే వ్యంగ్య చిత్రం చూచాను. ఊరకనే ఏడుస్తున్న స్వంతబిడ్డను యెత్తుకుని ఓదార్చేకంటే ప్రమాదంలోఉన్న పరాయి బిడ్డను రక్షించడం ఎంతో న్యాయం ప్రపంచంలో మన దేశానికున్న గౌరవాన్ని ఈ విధంగా చిత్రించటం సమంజసంగాలేదని నా అభిప్రాయం.

కె. నారాయణరావు (కోడూరు)

*      *      *

## ఇటలీ యాత్ర

5—4—61 తేదీ సంచికలో 'ఇటలీలో ఒక వారం' శీర్షికలో (62 వ పేజీ) శ్రీ సి వెంకటసుబ్బయ్య గారు "మన దేశంలో వేరుసెనగకాయలో రెండు, మూడు పప్పుల కన్న ఎక్కువ ఉండవు ఇటలీలో నాలుగైదు పప్పులు గల వేరుసెనగకాయలున్నవి" అన్నారు ఇది పొరబాటు. రాయలసీమలో ఏడెని మిది పప్పులు గల కాయలు గూడా ఉన్నవి నాలు గైదు పప్పులు గల కాయలు విరివిగా ఉన్నవి

సి. చిరంజీవి (విజయవాడ)

---





దొంగలనుండి, క్రూరమృగముల నుండి మిమ్ము రక్షించుకోండి. వనభోజనములు, యాత్రలు, నాటకములకు చాలఉపయోగ మైనది ఆటోమేటిక్ ఆరు తూటాలు గలది, తేలికైనది. దీని పెద్ద శబ్దము, ప్రకాశమైనమంట మిమ్ము ఆపదలనుండి రక్షించును.

| ధర | నెం. | 333 | 444 | 555 |
|---|---|---|---|---|
| | రు. | 6 | 8 | 13 |

25తూటాలు ఉచితం: ఆపైన ప్రతి100 తూటాలు రు. 3. లెదరుకేసు రు 4. పోస్టేజిరు. 2. లైసెన్సు అనవసరం. ఒకే ప్యాకింగులో రెండు రివాల్వర్లు తెప్పించుకున్న పోస్టేజి,ప్యాకింగుఉచితం.

AMERICAN TRADING COMPANY,

# వసంతకుసుమాకరము.

మధుమేహము.(DIABETES)
అతిమూత్రము మొదలగు వ్యాధులను
పోగొట్టి బలము నిచ్చును

వేంకటేశ్వర ఆయుర్వేద నిలయము.

ఆలమూరు పోస్టు, చింతలూరు. తూర్పుగోదావరిజిల్లా.

ఏజెన్సీ:-2, రతన్ బజారు, మద్రాసు-3.

**PAKCO** పాక్కో స్లో-స్పీడ్, కోల్డు స్టార్టింగ్ క్రూడ్ ఆయిల్ ఇంజనులు

—: ప్రత్యేక లక్షణములు :—

* పనిచేయ ప్రారంభించుట తేలిక
* తక్కువ ఇంధన ఖర్చు
* క్రమమైన నడక
* దిటమైన నిర్మాణం
* ఎక్కువ మన్నిక
* అద్భుతంగా పనిచేయును
* బాష్ ఫ్యూయల్, ఇంజక్షన్ పరికరములు



మద్రాసు, ఆంధ్ర, కర్ణాటక, కేరళ రాష్ట్రములకు ఏజెంట్లు:

Grams: LAMP **K. S. SHIVJI & CO,** (Estd 1903)
Phone:3617 పోస్టుబాక్సు నెం. 5, 178-79 బ్రాడ్వే, మద్రాసు-1

## నేడేచూడండి!

పోటిలేని మేటిచిత్రరాజము!!
జీవితములోని సత్యాలను ప్రత్యక్షముగాచూపేచిత్రం!!!

అన్నపూర్ణా వారి

# వెలుగునీడలు

నాగేశ్వరరావు..
సావిత్రి..గిరిజ..
రంగారావు..జగ్గయ్య..
రేలంగి....సంధ్య..
& సూర్యకాంతం..
రచన: ఆత్రేయ..
దర్శకత్వం: ఆదుర్తి
సంగీతం: పెండ్యాల....
నిర్మాత: D.మధుసూదనరావు. B.A.
—నవయుగ



# ఉత్తరాలు

## ముఖచిత్రం

మీ వారపత్రికల ముఖచిత్రములు ఆకర్షణీయముగాను, ఆనందదాయకముగాను ఉన్నవనుటకు సందేహములేదు. అయితే దీనికితోడు రెండు వారముల కొకతూరి అయినా ఒక అవతార పురుషుని చిత్రమును కాని, భక్తాగ్రేసరుని చిత్రమును కానీ, ముద్రించినచో, భక్తలోకమును కూడా ఆనందింపచేసినవా రగుదురు. ముఖ చిత్రముల శోకడలు 'ఇహము — పరము' రెంటెని బోధించునవిగా ఉండవలయునని నా ఆశయము.

పి. కె. మూర్తిరావ్ (మహబూబ్ నగర్)

*   *   *

"రచయితలకూ, పాఠకులకూ మధ్య వంతెన వంటిది ఈ ఉత్తరాల శీర్షిక" అని సోదరు లన్నారు. కాని దురదృష్టవశాత్తు ఈ 'వంతెన' పై కేవలం కారుపయనాలే గాని, బండ్లు పోవుట చూచుటకు వీల్లేనట్లున్నది. కేవలం రచయితలను పొగుడ్తూ కథాసంవిధానములను స్తుతించుచూ ఉండే ఉత్తరాలే ఎక్కువగా కానుపించుచున్నవి. ఎలాటి రచయితకైనా పొరపాటు అంటూ లేకపోదు. ఆయా కథల్లో ఎన్నదగిన పొరపాట్లను సూచించు ఉత్తరముల గూడ ప్రచురింపవలయునని నా మనవి. దానివల్ల రచయిత తన పొరబాటును తెలిసికొని మరోసారి, అదే తప్పు (పొరబాటు) చేయకుండా ఉండగల లాభమే గాని నష్టమేమీ ఉండబోదు. అది రచయితలను కించపరచినట్లు కానేరదు. కనుక మీరు విమర్శలకు మంచిఅవకాశంయిచ్చెదరుగాక అని నమ్ముచున్నాను

ఈవూరు శ్రీనివాసులురెడ్డి (వాకాడు)

## కవిత

5—4—61 తేదీ సంచికలో "ఆమె వలపు" అనే కవిత చాలా బాగున్నది. దానిని చదువుచున్నంతసేపు నా మనస్సు ఉద్రూతలూగిపోయినది. రచయిత అనుభవము అందులో ఇట్టే వుట్టిపడుతోంది.

బత్తుల కృష్ణమనాయుడు ( తిరుత్తణి )

*   *   *

29—3—61 తేదీ ఆంధ్ర సచిత్ర వారపత్రికలో కవితాకింకిణి చాలా బాగుంది. బహు మానార్హంగావుంది. ప్రకృతిని మైమరపించేలా వర్ణించారు కవి. సర్వాంగసుందరంగా తయారవుతున్న పత్రికలో ఇటువంటి శీర్షిక వుండతగ్గది.

సిహెచ్ గోవర్ధనరావు ( మచిలీపట్నం )

*   *   *

## సందేహం

5—4—61 పత్రికలోని రాగోదయం కథకు బొమ్మవేసినది బాపూగారా? శేషుగారా? దయుంచి తెలపండి

నాగసముద్రం కృష్ణమూర్తి ( అనంతపురం )

* బొమ్మవేసింది "రేఖ"

## ఆంధ్రుల వాస్తు విశేషం

29-3-61 నాటి ఆంధ్రసచిత్రవారపత్రికలో ప్రాచీన ఆంధ్ర వాస్తు విశేషము గురించి రచయిత శ్రీ అమంచర్ల గోపాలరావు చాలా బాగా వ్రాశారు.

బి రాజన్న (నిజామాబాద్)

*   *   *

## పెద్ద ఆకారాలు....

శ్రీమతి భానుమతీ రామకృష్ణగారు వ్రాసిన పెద్ద ఆకారాలు, చిన్నవికారాలు ఎన్నిసార్లు చదివినా ఉత్సాహముగానే ఉంటున్నది. మనుష్యులలో గల భయసందేహాలను తమ అనుభవములతో చక్కగా వివరించారు.

కె. సర్వేశ్వరరావు ( ఆకివీడు )

*   *   *

భానుమతీ రామకృష్ణగారి "పెద్ద ఆకారాలూ —చిన్న వికారాలు" చదివి నవ్వలేక చచ్చాం. ఇది నిజంగా జరిగినది కాదనీ, కల్పించి వ్రాశారని నా అనుమానం

కుమారి ఆచంట కృష్ణవేణి ( పేరవరం )




వారు
నవ్వుతూ
వుండేందుకు
ఇవ్వండి
Nutrine
మిఠాయిలు

న్యూట్రియిన్ కన్ ఫెక్షనరీ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్,
చిత్తూరు, ఆంధ్రప్రదేశ్

NC-59

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

★

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితము
1908

★

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

★

సంపుటము 55
సంచిక 32

19-4-61
బుధవారం

ప్లవ సం॥ వైశాఖ శుద్ధ చవితి

★

విడిప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 13-0-0

★

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి,
మదరాసు 1.


# విషయానుక్రమణిక

ముఖచిత్రం: భరణీవారి
'బాటసారి'లో భానుమతి



## సరికొత్త శీర్షిక

"26-4-61 సంచికలో పెంపుడు జంతువులు" అనే సరికొత్త శీర్షిక ప్రారంభమవుతుంది. సాధారణంగా అందరూ పెంచే జంతువుల గురించి చిన్న వ్యాసాలు కొన్ని ప్రచురిస్తాము.

## వచ్చేవారం...

కలహాంతరిత, సంఘసేవ - కథలు

స్త్రీలూ - చిరునవ్వూ

—వనితాలోకం

## కార్టూనులు

ఇండియన్ ఇంకుతో వేసిన కార్టూనులు మాత్రమే స్వీకరిస్తాము. అన్ని చిత్రాలూ ప్రచురిస్తే ఏమాత్రం 'సైజు' వస్తాయో సుమారుగా అంత సైజువేస్తే బాగుంటుంది. సాధారణంగా 4"×2", 4"×4", లేక 6"×4" చిత్రాలు పత్రికలో పడుతూ ఉంటాయి.


హుష్! మాట్లాడకుండా
అక్కడే
కూర్చోండి
కేరళ
మంత్రివర్గం
అంతః
కలహాలు
ఆంధ్ర కాంగ్రెసు వాదులారా!
కళ్లు తెరచి చూడండి.
మీ తగాదాలు కాదుకాని,
విస్తరి పిల్లి పాలైంది
కేంద్రం నిరాదరణ
అభివృద్ధి కార్యక్రమాలలో
ఆంధ్రుల వాటా.



# తెలుగు వెలుగు

ఊహాబద్ధమయిన తెలుగు వెలుగునుగురించి ఏర్పరచిన పోటీకి తగినన్ని కాక అసలు బహుమతికి తగుమైన రచన కూడా రాలేదని తెలుపుటకు విచారిస్తున్నాము.

వచ్చిన రచనలు చూస్తే రచన స్వభావాన్నిగురించి మేము చేసిన సూచనను రచనలు పంపిన పాఠక మహాశయులు గమనించినట్లు లేదనుకోవలసివస్తున్నది.

రచన హాస్య, వ్యంగ్య బద్ధంగా ఉండాలని మేము సూచించాము: అంటే తెలుగు వెలుగైన వ్యక్తి హాస్యాస్పదంగా ఉండాలనీ,వ్యంగ్యం అంటే దూషణలనీ, మా ఉద్దేశం కాదు. మాకు వచ్చిన రచనలు చూస్తే వీటినే ప్రధాన లక్షణాలుగా గ్రహిస్తూ తెలుగు వెలుగును 'తెలుగు చీకటి'గా వ్యక్తీకరించడం జరిగిందా అనిపిస్తుంది. తెలుగుకు వెలుగు లేదన్న భావాన్ని కలుగజేశారు.

చంద్రునికి మచ్చ ఉన్నదనవచ్చు గాని, మచ్చమాత్రమే పెద్ద చేసి వర్ణిస్తే ఎలా ఉంటుంది?

చంద్రని కాంతిని, చంద్రుని మచ్చను సవ్యంగా వర్ణించాలి. అప్పుడే చంద్రునికి న్యాయం చేసినట్లవుతుంది.

అలాగే తెలుగు వెలుగును గురించి వ్రాసేటప్పుడు వెలుగును మాత్రము విస్మరించరాదు.

ఒక వ్యక్తి బలాన్నీ, బలహీనతనీ చూపెట్టినప్పుడే ఆవ్యక్తి నిజ స్వరూపాన్ని చిత్రించినట్లవుతుంది. ఆ వ్యక్తిత్వాన్ని నిరూపించినట్లవుతుంది.

నీడలేకుండా తెలుగునూ, వెలుగులేకుండా నీడనూ చూడలేము.

కాబట్టి పాఠకమహాశయులు ఈ విషయాన్ని గమనించి 76 'నంబరు' తెలుగు వెలుగును రచించాలని ప్రార్థిస్తూ పోటీ తేదీని పొడిగిస్తున్నాము. రచనలు మా కార్యాలయానికి 26-4-61 లోగా చేరాలి, కవరుపైన 'తెలుగు వెలుగు పోటీకి, అని స్పష్టంగా వ్రాయాలి. ★

ఒకపెద్ద సర్కస్ మానేజిక్ దగ్గరకొక మనిషి వచ్చి, "అయ్యా, మీ సర్కస్‌లో అందరిముందూ పైనుంచిదూకి ఆత్మహత్య చేసుకోవడానికి సిద్ధంగా ఉన్నాను. ఇటువంటి దెప్పుడూ ప్రజలు చూడలేరు! కాని నా భార్యా, పిల్లలపోషణ భారం మీది. ఏమంటారు?' అని అడిగాడు. ఆయన కొద్దిగా ఆలోచించి ఇలా అన్నాడు, "అంతా బాగానే ఉందిగాని ప్రేక్షకులు 'వన్స్ మోర్' అంటే ఏంచేస్తావ్?"

# కెన్నెడీ ప్రభుత్వం

జాన్ ఫిట్జ్‌జరాల్డ్ కెన్నెడీ ప్రభుత్వంలో మేధావులకు ముఖ్యమైన స్థానాలు లభించాయి. అమెరికాలో మేధావులంటే ప్రజలకు అనుమాన మనడం లోకసామాన్యం. అందులోనూ ప్రతి ఉద్యోగి సెనేటర్ల ఆమోదం లేనిదే పదవిని స్వీకరించడం కష్టం. కెనెడీ 'కాబినెట్'ను పరిశీలిస్తే ఒక విషయం స్పష్ట మవుతుంది. మొదటిరకం ఉద్యోగా లన్నిటినీ ఎవరికి అభ్యంతరం ఉండటానికి వీలులేనివారి కిచ్చి వారి క్రింది స్థానాలనూ, ముఖ్యమైన పదవులను మేధా సంపత్తి కలవారికి వచ్చేట్లు చేశారు కెన్నెడీ.

సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఉద్యోగం అతి ముఖ్యమైనది. డల్లెస్ ఉన్నప్పుడు ప్రెసిడెంటుకన్నా అతనే అధికంగా అధికారం కలవాడా అనిపించేది.



హారిమన్

ఆ పదవిని ఇప్పుడు శ్రీ డీన్ రస్క్ ఆక్రమించారు. రస్క్ చాలా గట్టివారని పేరున్నా, అంత ర్జాతీయమైన కీర్తి కలవారు కాదు. రక్షణ శాఖకు సెక్రటరీ మెక్‌నమారా రిపబ్లికన్‌పార్టీ వైపు కొంచెం మొగ్గు ఉన్నవాడే. ట్రెజరీ సెక్రటరీ అసలైన రిపబ్లికన్. కాని వీ రందరూ కార్యసాధనలో కీర్తి గడించినవారు. కెన్నెడీ అధ్యక్షతలో ఐసెన్‌హొవర్ పరిపాలనలో జరిగినట్లు కేవలం ఉద్యోగులైనవారు విధానాలను నిశ్చయించబోరని అంటారు. కెన్నెడీ తన క్రిందివారు ఇచ్చిన 'సలహా' లను అనుశీలన చేసి తనకు నచ్చిన నిర్ణయాలు చేస్తారని అనుకుంటున్నారు.

రక్షణశాఖలో క్రొత్త విధానాలు వచ్చినా సాంకేతికమైనవిగా ఉంటాయి. ఈ శాఖలో నిపుణులతోబాటు పరిపాలనా దక్షత కలవారు చాలు. కాని విలక్షణమైన ప్రతిభ, నూతన దృక్పథం కావలసి వచ్చిన పదవులలో మాత్రం మేధావులనే కెన్నెడీ ఏరుకొన్నారు. ఐసెన్‌హొవర్ పరిపాలనలో ఏ శాఖవారు వారికి ఇష్టంవచ్చిన విధానాలను అనుసరించేవారని ప్రతీతి. కెన్నెడీ వైఖరిని బట్టి ఇకపైన ప్రెసిడెంట్ అన్నివిధాలా తమ అధికారాన్ని సద్వినియోగం చేసే సూచనలు కనుపిస్తున్నాయి.

అమెరికా ప్రపంచంలోకెల్లా సంపన్నమైన దేశం. స్విట్జర్లాండ్, స్కాండినేవియన్ దేశాలు తప్ప అసలు తక్కిన దేశా లేవీ పోలికకు కూడా సరిపోవు. నేటి ప్రచ్ఛన్నయుద్ధ సందర్భంలో ఇది చాలా చిక్కులను తీసుకువచ్చింది. అంతేకాక అంతరంగిక ఆర్థిక వ్యవహారాలలో కూడా అభివృద్ధి చాలడంలేదనే భావం కొన్ని వర్గాలలో ప్రబలంగా ఉన్నది. రూజ్‌వెల్ట్ ప్రెసిడెంటుగా ఎటువంటి మార్పులు తీసుకురాగలిగాడో అటువంటి మార్పులు కెన్నెడీ తీసుకురాగలరనే సూచనలు కొందరు చేశారు. యుద్ధానంతరం యూరోపును 'మార్షల్ ఎయిడ్' ద్వారా ఆర్థిక సహాయం చేసి శిథిలమయిపోయిన ఆర్థిక పరిస్థితులను కోలుకునేట్లు చేసింది, అమెరికా, ఐసెన్‌హొవర్ హయాములో విదేశాలకు సహాయం ఎంత చేసినా ఇది ఎక్కువ 'మిలిటరీ' సహాయంగా ఉండేదేమో. అందులోనూ తటస్థ విధానాల ననుసరించే దేశాలు అమెరికా ఆదరణను అంతగా పొందలే దనటానికి ఆస్కారం ఉన్నది. నేటి ప్రపంచ పరిస్థితినిబట్టి అమెరికా తన ఆంతరంగిక వ్యవహారాలను మార్చుకుంటేనే విదేశాంగవిధానాలలో కూడా మార్పు తీసుకురాగలదనే ఊహ ఉన్నట్లు తెలుస్తుంది. గాల్‌బ్రెయిత్, హెల్లర్ మొదలయిన ఆర్థిక నిపుణులను ముఖ్యమైన పదవులలో నియమించి కెన్నెడీ అమెరికాలో ఒకవిధమైన విప్లవం తీసుకువచ్చే సూచనలు కనబడుతున్నాయి. కీన్స్ మొదలయిన ఆర్థిక నిపుణుల సిద్ధాంతాల ప్రభావం వీరిపైన ఉన్నట్లు తోస్తుంది. ప్రభుత్వం కేవలం పరిపాలనకే గాక సమాజాభివృద్ధికి తోడ్పడాలనేవారిలో హెల్లర్ ఒకరు. పారిశ్రామికశాఖ సెక్రటరీకి

12-4-61 సంచికలో పడవలసిన ఈ వ్యాసం పొరపాటున తప్పిపోయింది; దానికి మేము చింతిస్తున్నామంటే పాఠకులు నమ్ముతారని ఆశిస్తున్నాము. ఈ వారం రావలసిన దక్షిణాఫ్రికా వ్యాసం వచ్చే సంచికలో ప్రచురిస్తాము.



చెస్టర్ బౌల్స్

గోల్డ్‌బర్గ్‌కు మొదటినుంచీ శ్రామికుల పక్షపాతం ఉన్నదని వ్యాపార వర్గాలవా రంటున్నారు

కెన్నెడీ అంతరంగికులలో ప్రముఖుడైన శ్రీ ష్లెసింగర్ రూజ్‌వెల్ట్ 'న్యూడీల్' సిద్ధాంతాలలో చాలా నమ్మకం గలవారిలో ఒకరు మొత్తానికి కెన్నెడీ ప్రభుత్వంలో మేధావుల సంఖ్య అధికంగా ఉందనే చెప్పాలి

మేధాసంపన్నులే కాక, కెన్నెడీ 'మంత్రులు' చాలామంది యువకులు కూడా వారి సగటు వయస్సు 40 ఏళ్ళ ప్రెసిడెంటుకు ప్రత్యేకసలహాదారులలో ఒకరైన సోరెన్‌సెన్ వయస్సు 32 ఏళ్ళ విదేశాంగవ్యవహారాలలోమాత్రం కెన్నెడీఅనుభవజ్ఞులనే ఏరుకున్నారు ఎవరెల్ హారిమాన్ చాలకాలంగా విదేశాంగ వ్యవహారాలలో ప్రముఖపాత్ర వహించిన వారిలో ఒకరు. సమితిలో ఎడ్లాయ్ స్టీవెన్‌సన్ అమెరికా ప్రతినిధి వారు ప్రపంచ నాయకుల



స్టీవెన్‌సన్

కోవకు చెందినవా రనడంలో సందేహంలేదు.

కెన్నెడీ ఎన్నిక అవటానికి "ముఖ్య కారణాలలో" ఆయన తమ్ముడు బాబ్ కెన్నెడీ ఒకరు. ఈయ నను ఎటార్నీ జనరల్‌గా నియమించటంవల్ల కొంత అసంతృప్తి కలిగిన మాట నిజం, కాని, బాబ్ కెన్నెడీ ప్రజ్ఞాశాలి కాకపోతే మరెవరూ కారు!

## కెన్నెడీ ప్రభుత్వం

(ఆర్థిక రంగంలో విప్లవాత్మకమైన దృక్పథాలు చూపించిన వాల్ట్ రిట్‌మాన్ రోస్టోవ్ (44 సం. వయస్సు) కెన్నెడీకి మరొక ప్రత్యేక సలహా దారుడు. ఆర్థికాభివృద్ధికి సంబంధించిన భావా లనే మార్చివేస్తున్న రోస్టోవ్ సిద్ధాంతాలు నేడు ప్రపంచంలో ఒకవిధమైన సంచలనం కలుగ జేస్తున్నాయి.) మొత్తంమీద కెన్నెడీ 'ప్రభుత్వం' చురుకైనదని పేరు గడించుకున్నదంటే అది కెన్నెడీ నాయకత్వానికి నిదర్శనం. ★




RP. 160-X52 TL.

# ధూమ్రపత్రిక

"ఖగపతి అమృతము తేగా
భుగభుగమని పొంగి చుక్క భూమిని పడియెన్
పొగచుట్టై జన్మించెను
పొగ త్రాగనివాడు దున్నపోతై పుట్టున్."

అని గిరీశం చెప్పినా పొగాకు—ధూమ్రపత్రిక అన వచ్చని శబ్దరత్నాకరంలో ఉంది—మన దేశానికి యూరోప్ నుంచే వచ్చింది. అసలు యూరోపియన్లే ఆకును అమెరికాలో చూశారు. 1492 లో క్రిస్టోఫర్ కొలంబస్ క్యూబా అనే ద్వీపానికి తన సహచరులను పంపించాడు. అక్కడ ప్రజలు పొగాకును కాల్చడం వారు గమనించారు. ముక్కుపొడి—నశ్యం—అమెరికాలో విరివిగా వాడేవారు. మొట్టమొదట రామొన్‌పాన్ అనే ఫాదరీ కొలంబస్‌తో వెళ్లినప్పుడు నశ్యం వాడకాన్ని 'కనిపెట్టాడు'. కాని పొగాకును నమలడం మాత్రం దక్షిణ—అమెరికాకు 1592 లో వెళ్లేవరకూ తెలియలేదు. స్పెయిన్ దేశంవారు దక్షిణాఫ్రికాకు చేరిన వారిలో మొదటివారు కనుక దానిని యూరోపియన్లలో మొదట కనిపెట్టినవారు వీరే ననవచ్చు.

పొగాకును ఇంగ్లీషులో టొబాకో అంటారని వేరే చెప్పనక్కరలేదు కాని ఆ పేరు ఈ ఆకు కెలా వచ్చిందీ ఇప్పటికీ సరిగా తెలియదు. హిస్పానియోలా అనేచోట 'Y' ఆకారములోఉన్న గొట్టం ద్వారా పొగాకు కాల్చేవారు ఈ గొట్టాన్ని 'టబాకో అనేవారు. అందువల్ల 'టబాకో' అనే పదం వాడుకలోకి వచ్చిఉండవచ్చు. కాని, మెక్సికోలో ప్రజలు పొగాకునే 'టబాకో' అనేవారని బెంజోనీ అనే ఆయన వ్రాశాడు. ఏది ఎట్లా ఉన్నా యూరోపుకు ఈ ఆకును తీసుకువచ్చినవాడు ఫ్రాన్సిస్కో ఫెర్నాండెస్ అనే ఒక వైద్యుడు—ఫిలిప్ II స్పెయిన్ పరిపాలిస్తున్న కాలంలో అతనికి ఆస్థాన వైద్యుడుగా పనిచేశాడు. 1558లో అమెరికా నుంచి తిరిగి వచ్చినపుడు 'టొబాకో' ను పట్టుకువచ్చాడు. అయినా పొగాకు పేరు మాత్రం 'నికోటినా' అని స్థిరపడిపోయింది. దీనికి కారణం, పోర్చుగల్‌లో ఫ్రెంచి రాయబారిగా ఉన్న జాన్ నికో (Jean-Nico) కాథరిన్ రాణికి పొగాకు విత్తనాలు బహూకరించారు. ఆవిడకు నశ్యం అలవాటుచేసి తలనొప్పి తగ్గించాడు. బాగా తుమ్మితే కొన్ని తలనొప్పులు తగ్గుతాయట.

అప్పటి కాలంలో ఈ ఆకు వైద్యానికి పనికివస్తుందనుకునేవారు. ప్రఖ్యాత ఆంగ్ల కవి స్పెన్సర్ 'డివైన్ టొబాకో' అన్నాడు. విలియం లిల్లీ 'హోలి హెర్బ్ నికోటిన్' (పవిత్రమైన మూలిక నికోటిన్) అన్నాడు. ఈరోజు సిగరెట్లు కాలిస్తే కాన్సర్ వస్తుందని శాస్త్రజ్ఞులు చెప్తున్నారు. ఒక్క గుక్క పొగ త్రాగితే ఆయుర్దాయంలో కొన్ని గంటలు క్షీణ మవుతాయని శ్రీ వైనస్ పాలింగ్ ఇటీవలే అన్నారు.

పొగ త్రాగే అలవాటు యూరోప్‌లో ప్రవేశ పెట్టిన వారిలో ప్రథములు రాల్ఫ్‌లేన్, సర్ ఫ్రాన్సిస్ డ్రేక్. సర్ వాల్టర్ రేలేకి పొగాకు అంటే చాలా యిష్టం ఆయన తల కొట్టేసే ముందు ఒక పైప్' పొగాకు కాల్చాడని చరిత్రలో వ్రాసి వుంది. 17 వ శతాబ్దంలో పొగాకు వాడుక యూరోప్ అంతటా ప్రాకిపోయింది. ప్రభుత్వాలూ, మత సంస్థలూ అప్పటికి కొంచెం 'మేలుకొని' పొగాకు ఏవిధంగానూ సేవించకూడదన్నాయి. పొగ త్రాగినవారికి మరణశిక్ష కూడా విధించారు. (కొందరిని దేశంనుంచి బహిష్కరించారు. మరి కొందరిని వెలి వేశారు.)

నెపోలియన్ 1811 లో 'టుయిలెరి' అనేచోట ఒక పెద్ద పార్టీ ఏర్పాటు చేశాడు. ఆ పార్టీలో ఒకామె చాలా నగలు ధరించి ఉండటం గమనించి భోగట్టా చేశాడు. ఆవిడ ఒక పొగాకు వ్యాపారి భార్య అని తెలియగానే—ఆ రాత్రే అంటారు—పొగాకు వ్యాపారం జాతీయంచేసి పారవేశాడు, నెపోలియన్. సంవత్సరానికి నగటున ఫ్రాన్సుకు సుమారు 250 కోట్ల రూపాయలు పొగాకు పన్నుల ద్వారా మాత్రం వస్తుంది. మార్చి నెలలో నికోటిన్ పొగాకు కేథరిన్ రాణికి ఇచ్చి 400 సంవత్సరాలు పూర్తి అయింది. ఫ్రాన్సు దేశమంతటా ఉత్సవాలు చేసుకొన్నారు. ఈ సమయంలో పొగాకు ఆరోగ్యానికి మంచిది కాదన్న ఒక శాస్త్రజ్ఞుడి ఉపన్యాసం ప్రభుత్వ టెలివిజన్ కార్యక్రమాలలో ప్రసారం చెయ్యలేదు.

భారతదేశంలో పొగాకు పెద్ద పంట మాత్రమే కాక పెద్ద పరిశ్రమ కూడా. కొన్ని వివరాలు క్రింద 'పట్టీ' ద్వారా తెలుసుకోవచ్చు. (లెక్కలన్నీ 1959 కి సంబంధించినవి.)

1. ముడి పొగాకు పంట రు. 33 కోట్లు.
   (58.9 కోట్ల పౌన్లు.)
2. ముడిపొగాకు ఎగుమతి రు.12 కోట్లు.
3 విదేశ ద్రవ్యాదాయం రు. 45 కోట్లు.
4. ఎగుమతి . . . 8—9 కోట్ల పౌన్లు
5. ఎక్సైజ్ పన్ను ఆదాయము ప్రభుత్వానికి వచ్చేది రు. 32 కోట్లు
4. సిగరెట్ పరిశ్రమ :
   ఎ. ఉత్పత్తి (ఏటాసుమారు) 2.300కోట్లు
   బి. పరిశ్రమ పెట్టుబడి రు. 20కోట్లు
   సి. మొత్తం ఫ్యాక్టరీలు . . . 15కోట్లు

5. ఆంధ్రప్రదేశ్ — భారతదేశం మొత్తం పంటలో 43.2% మన రాష్ట్రంలోనే ఉంది. ఇంతే కాక వర్జీనియా పొగాకు దేశంలో 95% వరకూ ఆంధ్రప్రదేశ్‌లోనే పండుతుంది. దేశంలోని 15 ఫ్యాక్టరీలలోను 3 ఇక్కడే ఉన్నాయి. (బొంబాయి 6, ప. బెంగాల్ 3, మైసూర్ 1, ఉ. ప్రదేశ్ 1, బీహార్ 1.)



జాన్ నికో

"చుట్టా—బీడీ" మన దేశంలో మద్రాసు రాష్ట్రంవారు ఎక్కువ చుట్టలు కాలుస్తారు. ఇక్కడ సుమారు 422 చుట్ట ఫ్యాక్టరీల లున్నాయి. చుట్టలకోసం ఇంచుమించు 5.3 కోట్ల పౌన్ల పొగాకు ఖర్చువుతుంది.

బీడీ ఫ్యాక్టరీలు దేశం మొత్తంమీద 2700 వరకూ ఉన్నాయి. వీటిలో 25% మధ్యప్రదేశ్ లోనూ, 40% బొంబాయి, మద్రాసు రాష్ట్రం లోనూ ఉన్నాయి.

---

ఒక మహిళ, ఎం.ఎల్.ఏ.గా ఎన్నికైన మరునాటినుండి ఎన్నో కార్యక్రమాలు ఉండి, రోజూ చాల ఆలస్యంగా వస్తూండేది ఇంటికి. ఒకనాటి రాత్రి పదిగంటలు దాటిన తర్వాత వచ్చి భర్తకెదురుగా కుర్చీలో కూర్చుంది.

"దేశంలో పరిస్థితి చాలా బావుందండి. వచ్చేఎన్నికలలో ప్రతిపక్షాన్ని తుడిచి పారేస్తాం" అంది సంతోషంలో.

"ఆ తుడుపు మన వంటింటి నుండే" మొదలు పెడితే బావుంటుంది అన్నాడు భర్త కుర్చీలో ఇబ్బందిగా కదిలి.

మృగశిర (కాకినాడ)

---

# హరి వంశము

## సాందీపనిపర్వం - 11

వసుదేవుడు తిరిగి ఇట్లా అన్నాడు : "తండ్రీ! మీరు ఇప్పుడు ఆనందకాననము, అవిముక్తము, మహాస్మశానము అని పేరుపొందిన కాశీ నగరం విద్యాభ్యాసంనిమిత్తం పోతున్నారు. మీకు ఇప్పుడు నేను ఆ కాశీనగరవృత్తాంతం ఏమిటో వినిపిస్తాను. అప్పుడుగాని మీకు ఆ కాశీమాహాత్మ్యం ఏమిటో తెలియదు. ఎక్కడ పరమశివుడు విశ్వేశ్వరుడై, అన్నపూర్ణాసహితుడై ఉన్నాడో, అది అందరికీ ముక్తిభూమి. సర్వ విద్యలకు నెలవు. అక్కడ మీరు గురువుగా వరించిన సాందీపని ఆశ్రమం ఉంది. ఆయన పరమ శివభక్తుడు. పరమవేత్త. బ్రహ్మభూతుడు. ఆయన మీకు గురువుకాదగినవాడు వేదవ్యాసులు అమాటే అన్నారు. అది సరే మరి కాశీవృత్తాంతం చెబుతాను సావధానులరై వినండి.

'తండ్రీ! శ్రీ కృష్ణా! తండ్రీ! సంకర్షణా! సృష్టికి ముందు ఈ ప్రపంచం అంతా జలార్ణవమై ఉంది. అప్పుడు అక్కడ ఏ పదార్థము లేదు అంతా పరమ నిరాకారమై, నిరాలంబమై, కటికచీకటితో కూడినదై, పట్టి శూన్యమై ఉంది అట్లా ఎంతకాలం వుంది? ఎవ్వరూ చెప్పలేరు కాని కొంతకాలం అట్లా జరిగిపోయిన తర్వాత ఆ మహా కృపీట జలధినుండి ఒక మహాతేజస్సు ఉద్భవించింది. ఆ తేజస్సే బ్రహ్మపదార్థమై రూపు పొందింది. అంతా నిరామయంగా వున్న ఆ జలార్ణవంలో, పరబ్రహ్మస్వరూపమైన ఆ తేజస్సు ఒక్కటిగా వెల్గుతూ, తనకు తోడు లేదేమని చింతించింది. ఆ చింతనం నుంచి సంకల్పం అంటూ పుట్టి, ఆ మహాతేజస్సు తన శరీరాన్ని రెండుగా విభజించి తనకు తోడును కల్పించుకున్నది. ఆ రెండుభాగాలలో ఒక భాగం పురుషుడు. రెండో భాగం స్త్రీ. ఆ స్త్రీ పరమశక్తిస్వరూపాన్ని అవధరించింది వేయి తలలతో, అంతకు రెట్టింపు బాహువులతో, వరదాభయహస్తంతో, జ్ఞానముద్రతో ఆ తల్లి లోకమాతయై పరిణమించింది. మన కాళికాదేవి ఆ తల్లి అవతారమేకదా! ఆ తల్లిహస్తములలో శంఖము, చక్రము, గద, ధనుశ్శరములు, త్రిశూలము, పట్టిసము, ముద్గరము మొదలైన ఆయుధాలు ఉన్నాయి. ఆమెకు మూడోకన్ను ఉంది. నొసటను కస్తూరీతిలకం ఉంది. ఒడలినిండా నగలు. మెడలనిండా ఆభరణములు. ఆమె నీల మేఘచ్ఛాయను పోలిన శరీరవర్ణం కల్గిఉంది తల మీద కోటిసూర్యుల కాంతినిపోని కిరీటాన్ని ధరించివుంది. ఆమెను చూచి పరబ్రహ్మము చాలా సంతోషించినాడు. ఆమె అందమును చూచుటకు ఆయనకు ఒక్కముఖము చాలలేదు. ఆయన పంచముఖుడైనాడు. తానును మిగులు కన్నును తెచ్చుకున్నాడు. ఆమె నీలవర్ణ కదా! తాను తుషారధవళమైన దేహచ్ఛాయను అలవరించుకున్నాడు. ఆమె నిత్యయౌవన. తానును నిత్యయౌవనమూర్తిని పరబ్రహ్మము విడంబించినాడు. ఆమె స్త్రీ. తాను పురుషుడు. వారు ఒకరిని ఒకరు చూచుకున్నారు. వారిలో విచిత్రములైన భావములు జలార్ణవ తరంగములనుపోలి లేచి ఆడాయి. ఆమె అతని వంక తన మూడుకన్నులను దోగగా వంచి చూచింది. అతడు తన మూడు కన్నులను విప్పి, అప్పుడే జన్మించిన నవ్వుతో ఆమెను చూచినాడు. ఆమె నవ్వినది. ఆయన నవ్వినాడు. ఇద్దరి శరీరములు ముందు ఒక్కటి ఇప్పుడు మరల తిరిగి ఒక్కటియైపోయినాయి. ఆ కలయికలో తచ్ఛరీర వామార్ధము నీలమై, దక్షిణార్థము శుభ్రస్వచ్ఛమై ప్రకాశించింది వారు తప్ప ఆ మహావకాశంలో మరి ఎవ్వరూ లేరు ఆ జలార్ణవం వారిని చూచి, అంతయు వేడియో క్రొత్త అనిపించి, తరంగజాలపరస్పరసంఘట్టనవిస్పష్టంగా జయగీతములు పాడినది. విచిత్ర హేలాలీలావిలాసంగా నురుగులు చిమ్మి మందహాసితాలు చేసింది. ఆ ఆది దంపతుల అనూకాంతివిక్రాంతిలో తానును విచిత్ర క్రాంతి విక్రాంతిని పొందింది. ఆయన ఆమెకు పరమేశ్వరుడైనాడు. ఆమె ఆయనకు పరమేశ్వరి అయినది. తనకు ఆమె, ఆమెకు తాను తప్ప మరి ఇంకో జీవం ఏదీ లేక, వారు ఒంటరితనాన్ని భజించారు వారిలో సర్వవిమర్శము అంతర్లీనమై ఉంది. ఇప్పుడు దానిని వారు బాహిరపరచినారు. తండ్రీ! శ్రీ కృష్ణా! వారు అప్పుడు తమ మాయచేత శ్రీ లక్ష్మీజనార్దన మూర్తిని సృష్టించారు ఆ మూర్తి అతి విచిత్రంగా వుంది. నాల్గు భుజములు. నాల్గు చేతులు. నాల్గు చేతులలో నాల్గు ఆయుధాలు. శంఖము, చక్రము, గద, ధనస్సు. ఆ మూర్తి కన్నులు పద్మపత్ర దళాభములు ఆ కన్నులు అమృతాన్ని కురుస్తున్నట్లు ఉన్నాయి. పరమేశ్వరీపరమేశ్వరులు తమ ప్రథమ సృష్టిని చూచి చాలా ఆనందించారు. వారికి ఆ మహామూర్తి పట్టి బాలునికి పోతె కన్పించినాడు. వారు ఆ బాలుణ్ణి తమ అంకదేశంమీద కూర్చోపెట్టుకున్నారు బంగారపు రంగువస్త్రాన్ని కట్టబెట్టారు. అందుచేతనే ఆయన పీతాంబరుడైనాడు. ఆ బాలుడు అతిశయప్రకాశంతో ఒప్పారుతున్నాడు. అందుచేత అతనిని ఆదిదంపతులు "విష్ణూ" అని సంబోధించారు. తల్లి ఆ బాలుని కేశములు తడివిచూచింది. కన్నులు అంటిచూచింది. "బాలకా! నీ కేశములు మహా అందంగా ఉన్నాయి. నీవు కేశవుడవు" అన్నది. "నీ కన్నులు అందంగా ఉన్నవి. నీవు కమలాక్షుడవు" అన్నది. పుట్టుకతోనే ఆ బాలుడు లక్ష్మిని ధరించి పుట్టినవాడాయెను "నాయనా! నీవు శ్రీధరుడవు" అన్నది. క్షతిలేని చిరునవ్వుగలవాడు ఆ బాలుడు. "తండ్రీ! నీవు అచ్యుతడవు" అన్నది. ఆ బాలుడు వారి తొలి సంతానం. మొట్టమొదట పుట్టినవాడు. 'బాలకా! నీవు పురుషోత్తముడవురా' అన్నది తల్లి అప్పుడు మహేశ్వరీ మహేశ్వరులకు, ఆ బిడ్డను తాము ఎందుకు సృష్టిచేసింది ఎరుకకు వచ్చింది "బాలకా! నీవు విశ్వాన్ని సృజించవలసి ఉంది. విశ్వంభరుడవు కావలసి ఉన్నది" అన్నారు మరి ఆ సృష్టి జరగడం ఎట్లా? పరమేశ్వరీ పరమేశ్వరులు ఆ బాలకునకు శివ పంచాక్షరీమంత్రాన్ని అప్పు డుపదేశించారు.

శ్రీ లక్ష్మీజనార్దనుడు ఆలోచనాధీనుడైనాడు. పరమేశ్వరీ పరమేశ్వరుల వాక్యాలు ఆ మూర్తిని విచారాధీనుణ్ణి చేశాయి. ఆయనకు ఆ ఆలోచన తెగుతున్నట్లు లేదు. అంతలో ఒక వటపత్రం ఆ జలార్ణవంలో తేలుకుంటూ ఆయనదగ్గరకు వచ్చింది. అది జలార్ణవంలోనే పుట్టింది ఆయన వటపత్రాన్ని అవలంబించి దానిమీదనే పరున్నాడు. అది ప్రథమపోతము. దానిమీద పరుండి ఆయన ఆలోచించినాడు. ఆ ఆలోచన తపస్సుగా పరిణమించింది ఇట్లా ఎంతకాలం ఆ తపస్సు సాగింది? ఆయనకే తెలియలేదు ఒక్కసారి హఠాత్తుగా ఆయనకు ఒక శబ్దం వినిపించింది. "నారాయణ! పరిపక్వ మనస్కుడవైనావు ఇక జ్ఞానమును చేపట్టుమా?" అని వటపత్రశాయికి జ్ఞానోదయం అయింది ఇప్పుడు ఆయన ఆ జ్ఞానోదయాన్ని పొంది తిరిగి తపస్సు చేసి

హరిత శివశర్మ

వాడు. ఆయనమీద పరమేశ్వరీ పరమేశ్వరులకు అనుగ్రహం కల్గింది ఆ అనుగ్రహవశంచేత అప్పుడు సృష్టికార్యం ప్రవర్తిల్లింది ముందు వేదాలు; తరువాత ఇరువదినాలుగు తత్వాలు. ఇట్లా సృష్టికార్యం కొనసాగింది. ప్రకృతి, ప్రకృతినుండి మహత్తు, మహత్తునుండి సత్వరజస్తమో గుణాలు, వానివలన అహంకారము, ఆ అహంకారం వలన పంచతన్మాత్రలు, ఆ పంచతన్మాత్రలవలన పంచభూతములు, వానివలన పంచేంద్రియములు, ఇట్లా సృష్టి సాగింది నారాయణదేవుడు ఇంకను వటపత్రశాయి అయియే ఉన్నాడు. అప్పుడు ఆయన నాభిదేశంనుండి ఒక కమలం ఉద్భవించింది. ఆ కమలం సహస్రదళవిభాసితం. అందునుండి పంచముఖబ్రహ్మ సరస్వతీసహితుడై ఆవిర్భావంచెందినాడు. అతనికి తన పుట్టుకయే విచిత్రం అనిపించింది తన ఐదు ముఖాలతో, పది కన్నులతో అన్ని దిక్కులను కలయ చూచినాడు. ఎటుచూచినా జలం తప్ప మరియేమీ కన్పించడంలేదు మరి తాను ఎచ్చటినుండి పుట్టినాడు? బ్రహ్మ తాను స్థితినిపొందివున్న పద్మమును చూచినాడు. ఇది తనకు జనిస్థానము. దాని ఆకారము ప్రపంచము పట్టరానిదిగా వున్నది. మరి దీనికి మొదలేమి ? తుద యేమి ? దాని అంతు ఏమో తెలుసుకొనవలయునని ఆయనకు పుట్టినది. పైకి పోయినాడు అంతు చిక్కలేదు. క్రిందికి పోయినాడు. అంతు చిక్కలేదు. అతనికి విచారమైనది విషణ్ణత ప్రాపించినది. ఆయన విషణ్ణుడైనాడు నేను ఏమిచేసిన ఈ పద్మముయొక్క తుదిమొదళులు తెలియును ? పరమేశ్వరీ పరమేశ్వరులకు ఆయనపై అనుగ్రహము పుష్పించినది వారు అశరీరులై ఆయనకు ప్రణవము నుపదేశించినారు బ్రహ్మప్రణవమును ఉపాసించి తపస్సును ఆచరించినాడు ఆ తపస్సునకు ఫలితమేమి ? పరమేశ్వరీపరమేశ్వరుల దర్శనము ఆయనకు కాలేదు. లక్ష్మీజనార్దనుడు సరస్వతీబ్రహ్మమునకు దర్శనమిచ్చినాడు. ఆయన ఎదుట ఆవిర్భావముచెందినాడు. బ్రహ్మకు అనిపించినది: "నా తపము ఉద్దామమైనది. నేను ప్రథమసృష్టికి కర్తను. ఈ నా ఎదుట ఆవిర్భవించిన ఈ మూర్తిని నేను సృష్టించితిని."

లక్ష్మీజనార్దనుడు విచిత్ర మందహాసము చేసినాడు అప్పుడే ఉషస్సు ఉదయించినట్లువుంది ఆ మందహాసం బ్రహ్మ ప్రశ్నించినాడు: "నీవు ఎవరవు? ఇక్కడ ఎందుకు ఆవిర్భావం చెందినావు?" నీవు నాచే సృష్టింపబడినావుసుమా? అన్న అహంకారం ఆమాటలలో ప్రతిధ్వనించినది. ఆ మాటలు ఆ జలార్ణవమునకు గూడా విన్పించినవో! అది తరంగ ధ్వానంచేత వికటాట్టహాసం చేసింది.

లక్ష్మీజనార్దనుడు అనినాడు : కుమార ! నీవు నా నాభికమలమునుండి పుట్టినవాడవు. నాకు ప్రథమసంతానమవు. నీకు వేదములను చెప్పగా, జ్ఞానమును బోధించగా వచ్చినాను.

బ్రహ్మకు నవ్వు వచ్చింది. తమోగుణ ప్రాచుర్యమువలన ఆయన ఐదుముఖములు తెల్లబడినవి. "ఓయి నీలవర్ణాభ! ఏమి మాటలు ఇవి? నేను నీకు పుట్టితినా? నేను స్వయంభువుడను. సర్వ సృష్టికర్తను. పరమేష్ఠిని. బ్రహ్మ స్వరూపుడను నాకు నీవు చదువులను చెప్పుటయేమి! అహో విచిత్రము" అన్నాడు

లక్ష్మీజనార్దనునకు అప్పుడు కోపము వచ్చినది. అది ఆయనలో కల్గిన ప్రథమవికారము. ఆయన తిరిగి బ్రహ్మతో ఇట్లా అనినాడు : "నేను విష్ణువును. ప్రథమ సృష్టికర్తను. ఆది కారణము అయినవాడిని. నీవు నా కార్యమువు. నేను సర్వమునందును వుందును. నన్ను పురుషోత్తముడని యందురు మరియు నీకు తండ్రిని. నీవు నన్ను తిరస్కరించుచున్నావు."

బ్రహ్మ నిజముగానే అప్పుడు ఆయనను తిరస్కరించెను. "ఓయి ! పురుషోత్తమ ! ఓయి విష్ణు! నేను నీకన్న జ్యేష్ఠుడను. నన్ను తిరస్కరించవద్దు సుమా! కాదు! నేనే జ్యేష్ఠుడను అందువు. మరి నాతో యుద్ధముచేసి,ఆ జ్యేష్ఠత్వ,శ్రేష్ఠత్వములను తేల్చుకొందువా?". వ్యవహారము మితిమీరిపోయినది. మరి విష్ణువు సత్త్వగుణభ్రాజమానుడు. నీల మేఘముడాలును పోలిన ఆయన శరీరవర్ణమును దానినే చెప్పుచున్నది ఆయనకు బ్రహ్మతో యుద్ధముచేయుటకు మనస్సు రాలేదు. తాను తండ్రి, అతడు పుత్రుడు నాయెను. లక్ష్మీజనార్దనుడు పరమేశ్వరీపరమేశ్వరులను ధ్యానించినాడు. ఆయన తన జన్మమును గూర్చి యెరుగును. బ్రహ్మకు చెప్పును. విష్ణువుతలంపు విష్ణువుతలంపుగా సాగి రాలేదు. పరమేశ్వరీసహితుడైన పరమేశ్వరుడు తనయెదుట ఆవిర్భావము చెందలేదు. తనకు సాక్షాత్కారమిప్పించలేదు. తన ఎదుట, తన్ను తిరస్కరించిన బ్రహ్మ ఎదుట ఏదో జ్వాల లింగాకారముగా నుబికివచ్చుచున్నది. అది ఎచ్చటనుండి పుట్టినది? తెలియుటలేదు. ఎచ్చటికి పోవుచున్నది? తెలియుటలేదు. అవ్యక్తాదియైనది, అవ్యక్తాంతమయినది, ఇది వ్యక్త మధ్యమము మాత్రమా? అనుకున్నాడు విష్ణువు. బ్రహ్మకు ఏ ఆలోచనయులేదు. మూర్తి అంతయు ఆశ్చర్యమేమై నిలబడిపోయినాడు. విష్ణువు అన్నాడు : "ఓ బ్రహ్మ! ఇప్పు డీ లింగము ఉద్భవించినదా! ఇది నా సృష్టికాదు. నీ సృష్టియగుటకును వీలులేదు. మరి ఇందాక యుద్ధము అన్నావు గదా! అది ఎందుకు? ఈ లింగముయొక్క తుది మొదళులను ఎవరు ఎగిరివత్తురు, వారు అధికులు."

బ్రహ్మకును అది నచ్చినది. "నీవు ఆదిని కనుగొనుము. నేను అంతమును కనుగొందును" అన్నాడు. విష్ణువు వున్నవాడు వున్నట్లు రూపమును మార్చినాడు. ఆయన ఇంతదనుకవున్నచోట నొక్క వరాహము భీకరము, సుందరము, దుర్ధర్షము అయి నిల్చినది. ఆ వరాహము తెల్లని రంగు కలది. ఎర్రనికన్నులు కలది దీర్ఘదోర్దండమునుపోని దంతములు కలది విష్ణువు ఆరూపమును చూడగా బ్రహ్మకు భయమనిపించినది. భక్తియు కుదిరినది. అహంకారము వదలలేదు. విష్ణువు పోత్రయై లింగమూలమును తొలుచుట కారంభించినాడు. అధోముఖముగా ఆ లింగమునంటి దానిమొదలును తెలియగా బయలుదేరినాడు. విష్ణువు తన రూపమును మార్చుకొనెను. నేనును ఏల మార్చుకొనరాదు అని బ్రహ్మ సంకల్పించెను. ఆ సంకల్పోదయముచేత ఆయన హంసగా మారిపోయెను. తెల్లని ఒడలు; తెల్లని రెక్కలు; ఎర్రని పాదములు; ఎర్రని ముక్కు బ్రహ్మ ఆ జ్వాలాలింగమును అంటి పైకి ఎగిరెను. విష్ణువు జ్వాలాలింగము ఆదిని తెలియుటకు నూరు దివ్యవత్సరములు అధోముఖుడై తిరిగినాడు. బ్రహ్మ ఊర్ధ్వముఖుడై నూరు దివ్యసంవత్సరములు ఎగిరినాడు. అతనికి ఆది చిక్కలేదు. ఇతనికి అంతము అందలేదు. ఇరువురును తిరిగి బయలుదేరినప్రదేశమునకు వచ్చిరి. ఇరువురును డస్సిపోయిరి. ఇరువురును తిరిగి తమ స్వస్వరూపములను ధరించిరి.

విష్ణువు బ్రహ్మను చూచి అనినాడు : "ఓయి! బ్రహ్మ! నాకు ఈ లింగముయొక్క ఆది ఏదియో పట్టుబడలేదు "

బ్రహ్మ విష్ణువునుచూచి అన్నాడు : "ఓయి విష్ణు ! నేనును దీని అంతమును దరియలేకపోతిని."

బ్రహ్మకు ఏమియు తోచలేదు. విష్ణువునకును ఏమియు తోచలేదు. ఇరువురును అమూర్తిని అప్పుడు ధ్యానించిరి. అంతలో విచిత్రము జరిగినది. ఆ జ్వాలాలింగము మాయమైనది. ఆ లింగము వున్నచోటను మూడు కన్నులవాడు, పదిచేతులవాడు, పదిచేతులయందును ఆయుధములు కలవాడు, శరదంబు వాహముపోని మేని రంగువాడు, ఉత్తమ కిరీటుడు, ఉత్తమ ఆభరణుడు, శక్తి అర్ధదేహమున కలవాడు, ఆవిర్భావమును చెందెను. ఆ మూర్తికి వయస్సు ఎంతయని? అది ఇదమిద్ధమని నిర్ణయింపరానిదిగా వున్నది. నిత్యయౌవనునకు వయస్సుతో పనియేమి? ఆయనకు వయస్సులేదు. ఆయన ఓంకారశబ్దమును చేయుచు, వారిమధ్య నిలబడెను. జలార్ణముగూడ ఓంకారము చేయుచున్నదివలె ఆ ధ్వనులతో మార్మోగెను. దిశలు అవాంతరదిశలు గూడ ప్రణవనాదపూర్ణములై మహాకాశమంతయు శబ్దమయాత్మకమై ఓంకారచ్ఛందముగ ప్రవర్తిల్లెను.

విష్ణువు ఆ మూర్తికి సాగిలపడి మ్రొక్కెను. బ్రహ్మకు అహంకారము ఇంకను దిగలేదు. ఆయన తన ఐదుతలలను విరుద్ధమర్యాదముగా కదిల్చి "నీవు ఎవ్వడవు?నీకీ ఐదుముఖములేమి?నా యంతటివానికే అవి వుండతగినవి? నీకు ఎట్లు వచ్చినవి? అని తిరస్కరించి మాట్లాడినాడు.

పరమేశ్వరుడు శాంతమును వహించెను.



చిత్రకారుడు—వి. నాగరాజ (కడప)

"ఓయీ! బ్రహ్మా! నీవు విష్ణుని నాభికమలము నుండి ఉద్భవించినవాడవు. ప్రాకృతసృష్టి నీ కార్యము. మరి నీకు ఈ మాటలేల! నన్ను తిరస్కరింపనేల!" అనినాడు.

బ్రహ్మ వికటముగా నవ్వినాడు. "ఆయనతో పాటు నీవును ఒకడవు నన్ను కికురించుచున్నావు.

# హరివంశం

ముందు నేను నేనై పుట్టితిని. తరువాత ఈ విష్ణువు నాయెదుట పుట్టెను. ఇప్పుడు నీవు పుట్టినావు. నేను ప్రథముడను. అతడు ద్వితీయుడు. నీవు తృతీయుడవు" అన్నాడు.

పరమేశ్వరుడు కోపగించినాడు. ఆయన రుద్రుడై పోయినాడు. తన ఎడమచేతిని ఎత్తి, చిటికిన వ్రేలిని పరశ్వధముచేసి, బ్రహ్మ ఐదవశిరస్సును ఖండించివేసినాడు. బ్రహ్మగర్వము ఉడిగిపోయినది. ఆయన నాల్గు తలలవాడైనాడు. ★





## ఎక్కడ లైఫ్‌బాయ్ వున్నదో, అక్కడ ఆరోగ్యము వున్నది!

లైఫ్‌బాయ్ నీళ్ళతో స్నానంచేసి, ఆనంద కరవతురై పోండి! అది మిమ్ము ఆరోగ్యవంతమైన హాయి గొలుపుతుంది! ప్రతిరోజూ మురికి అంటకుండా మనము తప్పించుకోటము... లైఫ్‌బాయ్ యొక్క నెమ్మదియైన మురికి నురగ మురికిలో వున్న క్రిములను కడిగి వేస్తుంది. కుటుంబముతో అందరూ లైఫ్‌బాయ్ వాడుటవల్ల ఆరోగ్యవంతంగా వుంటారు!

L. 13. X32 TE

హిందుస్థాన్ లీవర్ లిమి.

# కథ కాని కథ

## "స్నానంతు అయింది..."

### (మొదటి బహుమతి రు. 10 లు)

మేము మెడిసిన్ చదువుకొంటున్న రోజులవి. మొదటి సంవత్సరం ఫిజియాలజీ ప్రాక్టికల్స్ (Physiology Practical) చేసికొంటు న్నాము. అందులో ఏమంటే కప్ప కాలి లోని కండరాన్ని, నరాన్నితీసి నరానికి కరెంటుపెట్టి ఏదో చేయాలి. కండరాన్నేమో దారంతో బాగా కట్టి దాన్ని స్టాండుకి తగిలించాలి. మాకేమో ఒక డెమాన్ స్ట్రేటర్ వాటిని చేసి చూపెడుతున్నారు. అతను క్రొత్తగా పెళ్ళిఅయింది. అతను కండరానికి ముడులు వేస్తున్నాడు. అది జారిపోతూ వుండినది. అందుకని ఒకబ్బాయి "మూడు ముడులు వెయ్యండి సార్" అన్నాడు. అందుకాయన, "నా వంతై పోయింది. నీ వంతుకోసం ప్రయత్నించు" అన్నారు. అందరూ పగలబడి నవ్వారు.

కుమారి సి. రంజని (మద్రాసు)

*   *   *

## 'జ'కు కొమ్మిస్తే.......

### (రెండవ బహుమతి రు. 5 లు)

మా బాబు ఇప్పు డిప్పుడే అక్షరజ్ఞానం కలుగుతోంది. మా టైగర్ (కుక్క) భలే చలాకి. మా బాబుకు ఒకనాటి ఉదయాన "జ" గుణింత మును పలకమీద పెట్టించి దిద్దమన్నాను. వాడు సరే అని దిద్దడం మొదలుపెట్టాడు. వాని ప్రక్కన సిరాబుడ్డి (మూత లేనిది) కలము కూడా ఉన్నవి. వాడు బిగ్గరగా చదువుచూ "జ"కు దీర్ఘమిస్తే 'జా' "జ"కు గుడిస్తే 'జి' 'జి'కు గుడిదీర్ఘ మిస్తే 'జీ' "జ"కు కొమ్మిస్తే "జు" కొమ్ముకు దీర్ఘమిస్తే "జూ" అని రెండుసార్లు బిగ్గరగా చదివాడు. ఇంతలో బయటయున్న మా టైగర్ తోకాడిస్తూ బాబువద్దకువచ్చి, మూతితో సిరాబుడ్డిని పడవేసింది ఇంకేముంది. కుక్క మూతి కంతా సిరా అంటింది. మా బాబు ఇది చూచి ఛ్ఛ ఛ్ఛ అనడం మొదలుపెట్టాడు. కుక్క బాబుఅనటం చూచి బాబు మూతిని నాకడం మొదలుపెట్టింది. ఇంకేముంది. బాబుమూతికంతా సిరాయే. మేమంతా ఇది చూచి నవ్వుతుంటుంటె మా బాబు బిక్క మొగం వేసాడు.

ఎం. ఎల్. నరసింహారావు (ఇబ్రహింపట్నం)

*   *   *

## వింత లెక్క

### (రెండవ బహుమతి రు. 5 లు)

నేను యస్. యస్. ఎల్. సి. చదివే రోజుల్లో ఒకరోజున మా లెక్కల మేష్టారు పరిగెత్తుకుంటూ వచ్చి బోర్డుమీద ఒక ఆల్‌జీబ్రా లెక్కవేసి ఎవ రైన ఆ లెక్క చేయగలిగితే వచ్చి బోర్డుమీద చేయండి అన్నారు మాకందరికి ఆశ్చర్యం వేసింది. కారణం ఏమిటంటే అది మాకు ఎప్పుడు చెప్పనూలేదు—చాలా కష్ట మయిన లెక్క. అందుకని మేమందరం అరవకుండా కూర్చున్నాం. ఇంతలోనే నాపక్క కూర్చున్న నా స్నేహితుడు గబగబాలేచి బోర్డు దగ్గరగా వెళ్ళాడు. మే మందరం ఆశ్చర్యపోయాం. ఎందుచేతనంటే వాడికి అసలులెక్కలేరావు. ఇంతాచేస్తే వాడు బోర్డుదగ్గ రకు వెళ్ళడం లెక్క చేయడానికికాదు. ప్రక్కనున్న కిటికీగుండా ఉమ్మివేయటానికి. మా క్లాసంతా నవ్వులతో నిండిపోయింది.

జి. టి. టి. శ్రీనివాసశాస్త్రి (నంద్యాల)

*   *   *

## పెండ నీళ్ళ స్నానము

### (రెండవ బహుమతి రు. 5 లు)

ఒకరోజు నేను స్నానము చేయుచున్నాను. స్నానము చేయుచున్న గదము దూరములో మా అమ్మ బయట పెండనీళ్ళు చల్లటానికి ఒక బకెట్‌లో పెండనీళ్ళు తయారుచేసి చెంబు తీసుకొని రావటా నికి ఇంట్లోకి వెళ్ళినది. నేను అప్పుడు ముఖమునకు సబ్బు రుద్దుకున్నాను. బాగుగా రుద్దుకొని చెంబు తీసుకొని నీళ్ళకోసము వెతుకుచు నా నీళ్ళబకెటే అనుకొని పెండనీళ్ళ బకేటు దగ్గరవెళ్ళి చెంబును ఆపెండ నీళ్ళలో ముంచి తీసుకొని నెత్తిపై మంచి పోసుకున్నాను. ఇంకేముంది ముఖమునిండా పెండ నీళ్ళే. అంతలో మా అమ్మ చెంబు తీసుకొని వచ్చి నన్నుచూచి ఒకటే నవ్వడము మొదలు పెట్టింది.

ఎస్. ఇస్మాయిల్ (కర్నూలు)

*   *   *

## ....'లంగూడి'

### (రెండవ బహుమతి రు. 5 లు)

అవి మేము స్కూల్ ఫైనల్ చదివే రోజులు. మా తెలుగు ఉపాధ్యాయుడు ప్రతిపదము విడదీసి అర్థము చెప్పేవారు. ఒక దినము వ్యాకరణ పాఠమును బోధిస్తూ, ఏదో ఒకసంధిని విడదీసి "అచ్చు 'లంగూడి' హల్లులు....." అని మాత్రము చెప్పేరు. మరునాడు మా క్లాసులోని మొద్దుశంకరంలేచి "మేష్టారూ! 'లంగూడి' అంటే అర్థమేమిటి?" అని అడిగాడు. సమయాని కేది స్ఫురించక "రేపు చెప్తాను కూర్చో అబ్బాయ్" అని మా మేష్టరు సమాధానం చెప్పారు.

మా ఉపాధ్యాయులు ఆ పదముకొరకు ఆ రాత్రంతా వెదికి దాని కర్థము తెలియకపోగా, మరి రెండు రోజులు సెలవుపెట్టి ఆ పదముకొరకు డిక్షనరీలన్నీ వెదికివేసారారు. ఆ మరునటిరోజు పాఠ శాలకు వచ్చి "ఈ పద మే పుస్తకములో చదివావు?" అని శంకరాన్ని ప్రశ్నించాడు. అందులకు శంకరం విజయుడై నట్లు మొగము పెట్టి "మొన్న మీరు అచ్చు'లంగూడి'న హల్లులు....." అని మాత్రము చెప్పారుకదసార్" అన్నాడు. అది విని మేష్టారు వాని అసమర్థతను తెలియబరచి, తనుపడిన కష్టాన్ని తెలియబరుస్తూ గొల్లుమని నవ్వారు. మేము కూడ నవ్వలేకుండ ఉండలేకపోయాము.

ఎస్. నరసింహమూర్తి (పాకాల)

*   *   *

## ఇదీ పెసలుమూటే

### (రెండవ బహుమతి రు. 5 లు)

ఇది సంవత్సరం క్రితంనాటి సంగతి. నేనూ, నా మిత్రులు కలసి కొండపల్లి విహారయాత్రకు పోయి తిరిగి వచ్చుచు, ఖాళీగా నుండగా నొక కంపా ర్టుమెంటులో నెక్కితిమి. ఇతరుల నెవ్వరినీ ఎక్క నీయులేదు. ఇంతలో ఒక పల్లెటూరు రైతొక పెసలు మూట ఎత్తుకొని మేమున్న కంపార్టుమెంటులోని కెక్కుచున్నాడు. మేము "ఇది స్పెషల్ కంపార్టు మెంటు" ఎక్కరాదు అని చెప్పినాము. "ఇది గూడా పెసలు మూటే పోవయ్యా! ఎందుకెక్కనీయరు?" అన్నాడు. అంతా ఒక్కసారి గొల్లుమన్నారు.

ఎం. నారాయణరావు (బెంగుళూరు)

★



# హాలాహలంలో అమృతభాండం

**మధురాంతకం దొరస్వామి పిళ్ళై**

> హాలాహలంలాంటి ... నుంచి ఈ అమృతభాండం ఎలా ప్రభవించింది? అనుకున్నాడు కృష్ణమూర్తి నీరజను చూచి.

అమ్మమ్మ హృదయం ఒక అమృత భాండం! కోటి మాతృ హృదయాల కూడలి స్థలం! మరి మెత్తని మనసూ—ఎముక లేని చేయీ అమ్మమ్మది!

మండు వేసంగిలో పయనించే పాంథులు, చల్లని నీడ విచ్చే కానుగ క్రింద మార్గాయాసాన్ని బాపుకొన్నట్లు, బంధుప్రీతి గల అమ్మమ్మచే పోషింపబడి ఆమె అమృత హస్తాల్లో పెరిగి, రెక్కలు వచ్చిన తరువాత తల్లిని వదలివెళ్ళిపోయే పక్షి పిల్లల్లాగా, నిష్క్రమించినవారు లేకపోలేదు.

అమ్మమ్మ చల్లని చూపు లేకుంటే—తనింతటి వాడయేవాడు కాదు కృష్ణమూర్తి! ఈ భావన కలిగినపుడు అతని హృదయం గాలి తాకిడికి అల్లల్లాడిపోయే మాధవీ లతికలా చలించిపోతోంది. అమ్మమ్మకు దిక్కెవ్వరు? అమ్మమ్మ దేవతలాంటి మనిషి .... యీ ఆలోచనలతో అమ్మమ్మని పూవుల్లో పెట్టి పూజించాలని ఆమెకే కొరత లేకుండా చూడాలని, ఏమేమిటో ఘోషిస్తుంది కృష్ణమూర్తి హృదయం.

అది అర్ధరాత్రి, దాదాపు రెండు గంటల సమయమైనా అయి ఉండవచ్చు. బహుశః తానప్పుడు నిద్రాదేవి బాహులతా పంజరంలో ఒదిగి తనకేమీ యీ లోకంతో ప్రసక్తి లేనట్లు విశ్రాంతి పొందుతూను ఉండవచ్చు.

నిశ్శబ్దాన్ని చీల్చుకొని, అమ్మమ్మ కంఠంలో నుండి యీ మాటలు వెలువడినై: "పాండ్రా! ఏ మయ్యో గొయ్యో చూచుకోనుంటుంది. వెదకండి, చిట్టితల్లి ఏమైందో" తల బాదుకుంటూ రోదిస్తోంది. నిద్రమత్తు వీడింది. అయినా అయిదేండ్ల వయస్సులో అంతంత మాత్రమేమి అర్థం కాలేదు, తనకు.

అమ్మమ్మ దేనికి రోదిస్తుంది? వెదకడం దేన్ని? మున్నగు ప్రశ్నలు కృష్ణమూర్తి హృదయంలో ప్రభవించక పోలేదు. పూరింట్లోని

వారందరు గుమిగూడారు. తలోవిధంగా అమ్మమ్మను ఓదారుస్తున్నారు. తాతయ్య నిర్లిప్తంగా కండువా భుజంపైన వేసుకొని వంట అరుగుపై కూర్చొని సెత్రకతానికి అనుచరులను పురమాయిస్తున్నాడు.

తెల్లవారుజాము నాలుగు గంటలు .... ఐదారుగురు మనుష్యులు అమ్మను చేతులపైన వేసుకొని వచ్చి పరుండబెట్టారు. ఒక్క మాటుగా అమ్మమ్మ, తాతయ్య అందరూ బావురుమన్నారు. ఎందుకో తనకప్పుడు అర్థంకాలేదు కృష్ణమూర్తికి! అమ్మ కొంచెం పొడగరి. ఆమె నిర్వికారంగా ప్రసన్న వదనంతో శయ్యపై నిద్రిస్తున్నట్లనిపించింది తనకు. ఆ రాత్రే ఏడుగంటలప్పుడు వెండి గిన్నెలో పాలుపోసి పంచదార కలిపి అన్నం తినిపించింది తనకు. సాయంకాలం మట్టి ప్రమిదలలో ఆముదం పోసి ప్రత్తితో వత్తులు చేసి, గుమ్మానికి రెండు వైపులా దీపాలు వెల్గించింది అమ్మ. తనలో కారుచీకట్లు పోకార్చి జ్ఞాన లతలను ప్రవేశింప జేసినట్లు స్ఫురణకు వస్తూంటుంది అమ్మ వెలిగించిన రెండు జ్యోతులు. అమ్మను వదిలి పరుండడం తనకట్టే అలవాటు లేకపోయినా! అమ్మమ్మ ప్రక్క పరుండడం అనేది ఒక్కొక్కరోజు జరుగుతూంటుంది. ఆనాడు అమ్మమ్మ దగ్గర నన్ను పరుండబెట్టి నిద్రపోయే వరకు చేతితో తట్టుతూ ఉంటుంది అమ్మ. ప్రస్తుతం పరిస్థితి యేమిటో? అర్థంకాక, కృష్ణమూర్తి మోము వెలవెల పోయింది.

తాతయ్య గ్రామకరణం కావటం మూలాన గ్రామంలో మేటి రైతులందరూ ఆ రాత్రికి రాత్రే తన యింటికి హాజరైనారు. ఒక హరికెన్ లాంతరుతో .... నలుగురైదుగురు రైతులతో హాజరైన రెడ్డిగారు "కరణంగారూ, కన్న కుమార్తెను వంచనచేసి, యేం పుణ్యం కట్టుకుంటారు, మీ ముఖమైనా చూడకూడదు" అని మందలించారు. వంచన ఏమిటో అర్థమైనది కాదు ఆనాడు కృష్ణమూర్తికి!

పోలీసులు ఉదయం ఏడింటికే హాజరై అమ్మ పొడవు, గుర్తులు వ్రాసు కొని ఆమె ఎలా మరణించిందని ప్రశ్నించారు. అదివరకే తాతయ్యవద్ద ఉపదేశం పొందిన, కుమ్మర మునెప్ప "ఆమె, చిన్నబిడ్డకు బావిగట్టున గల మందాకు కోసుకుంటూ ఉండడం క్రితం సాయంత్రము తాను చూచానని, పరధ్యానంలో ఆమె కాలు జారి నూతిలో పడడం గమనించి కేకేశానని, తనకు యీత రాకపోవడం మూలాన జనం చేరి ఆమెను నూతిలో నుండి తీయగా అదివరకే ఆమె మరణించిందని" వాఙ్మూలం యిచ్చాడు. ఏదో కొంచెం లంచం రాళ్లతో తప్పుడు సాక్ష్యాలని తమ డైరీల కెక్కించి నిష్క్రమించారు పోలీసులు. తన యింటి ఆచారం మేరకు చనిపోయిన వారిని భూస్థాపితం చేస్తారు గాని, అగ్ని సంస్కారము చేయరు. కానీ, ఏ కారణంచేతో, అమ్మకు అగ్ని సంస్కారం జరిగింది. కారణం తనకప్పట్లో అర్థంకాలేదు.

అమ్మమ్మ అమ్మను తలపోస్తూ వేడివేడి కన్నీటి కణాలు రాలుస్తూ నిశల్లో రోదిస్తూండేది. తాతయ్య అప్పుడప్పుడూ నిర్లిప్తంగా శూన్యంలోకి చూస్తూ—దీర్ఘ నిశ్వాసాలు వదలుతూండేవాడు.

తాతయ్యకు, అమ్మ అంటే పంచప్రాణాలు—అమ్మ తాతయ్యకు ఏకైక పుత్రిక. ఆమాట కొస్తే, "అమ్మమ్మకు నలుగు రైదుగురు మగ సంతానం కలిగినట్లు, అందరూ, సంవత్సరం.... రెండేళ్లూ .... పూర్తిగాక పూర్వమే మరణించినట్లూ, తుదకు, అమ్మమ్మ తాతయ్యల దాంపత్య నందనవనంలో పారిజాత పుష్పంలా భాసించింది అమ్మ" అని అమ్మమ్మ అంటూండేది.

తాతయ్య పాతకాలపు మనిషి—రామాయణ, భారత, భాగవతాలు వీధిబడిలో బాగా అభ్యసించినవాడు. ఎవరికి ఏ ఉత్తరం వ్రాసినా, ఏమైనా సలహాలిచ్చినా ఉద్గ్రంథాల్లోని పద్యాలను, సంస్కృత శ్లోకాలను ఉదహరిస్తూ ఉండేవారు.

లేకలేక పుట్టిన కూతుర్ని కంటికి రెప్పలా కాపాడాడు తాతయ్య—సీత, సావిత్రి, అనసూయల్లాగా తన కుమార్తె ఆదర్శనారి కావాలని ఉవ్విళ్ళూరాడు. ఆమెను పాఠశాలకు పంపక పోయినా

> "పొట్టి పోతరాజుకి విదూషకుడిపైన కోపంవచ్చి మరణదండన విధించాడు. అతను మరీ ప్రాధేయపడగా ఇల్లా అన్నాడు. "నువ్వు అబద్ధం చెప్పావో తలకాయ కొట్టేస్తాం. నిజంచెప్తే ఉరితీస్తాం. విదూషకుడు వెంటనే "నాతల కొట్టేస్తారు" అన్నాడు.

తానే తెనుగు చక్కగా వ్రాయను, చదువను, కొంత గణితజ్ఞానము కలిగించాడు తాతయ్య.

ఆస్తికత్వంలో జీర్ణించుకుపోయిన భావాలపుట్ట తాతయ్య తదనుగుణంగా రూపొందించాడు అమ్మని. ఒక అమ్మ నేమిటి? తాతయ్య పోషణలో పెరిగిన తను ఓ ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయుడైనా, మున్ముందు కళాశాలల్లో అధ్యాపక వృత్తి నెరపడానికి తనకు అర్హతలు, అవకాశాలున్నా, తాతయ్య సంప్రదాయికమైన ఆస్తికత్వపు భావాలు యీ నవీన యుగంలోను తన ఒంటిలో నుండి వదలిపోలేదు. ఉగ్గుపాలతో రంగరించి పోసిన భావాలు కదూ? ఏలా పోతాయి! ఓ దీర్ఘ నిశ్వాసం విడిచి కృష్ణమూర్తి మరలా ఆలోచనలో పడ్డాడు.

భ్రాతృవత్సలతలో తాతయ్య భరతునికి సాటి! తన కున్న ఆరుగురు తమ్ముళ్ల బిడ్డలలో కనీసం ఐదారు మంది బిడ్డలను తానే పోషిస్తూండేవాడు తాతయ్య. తాతయ్య కడపటి తమ్ముడు సుదూర ప్రాంతాల్లో కరిణీకం చేస్తూ బాగా రెండు చేతులా గడిస్తూండేవాడు. మాటకు, మూటకు, ఆ సంసారాని కంతకూ ఆయనదే మాటగా ఉండేది!

అమ్మకు సంబంధం—ఆ చిన్న తాతయ్య తీసుకొని వచ్చిందే! ఓ ప్రాథమిక పాఠశాలోపాధ్యాయునికి తన అన్న కుమార్తెను (అమ్మను) ఇప్పించి ఆ పంతులు పెళ్లిలిని వివాహ మాడాడు, చిన తాతయ్య!

నాన్నగారికి, పెదనాన్నగారికి వచ్చిన తగాదాల మూలంగా నాన్న అమ్మతో సహా తన అత్తారిల్లు చేరాడు. ఆ దరిదాపుల్లో పంతులు ఉద్యోగం నెరపుతూ ఉండే నాన్నను సుదూర ప్రాంతాల్లో ఒక పల్లెటూరులో సింగిల్ టీచరుగా మార్పు చేశారు. ఆ క్రొత్త పరిసరాలలో అమ్మతో కాపురం ప్రారంభించి కొన్ని సంవత్సరాలు ఆ కుగ్రామంలో గడిపారట నాన్న. బడిపంతుళ్లంటే దేవుళ్లలా ప్రజలు చూసుకొనే రోజు లవి. పూర్వపు తాలూకా బోర్డుల కాలం! గ్రామస్థుల సహకారంతో ఏ లోటూ లేకుండా జీవనం గడుస్తూ జీతం రాళ్లు అట్టే మిగిలిపోయేవట.

నాన్న జీవితంలో పెను తుఫానులా వచ్చింది ట్రాన్స్‌ఫర్ చినతాతయ్యగారి వూరికి. ఆ వూరికి ట్రాన్స్‌ఫరై నాలుగు మాసాలు గడిచింది. నాన్న తన చెల్లాయి యింట్లో అవిభక్తంగా ఉండడం తనకు నచ్చక మార్పుకు అర్జీ పెట్టుకొన్నాడు. దేవరకొండకు ట్రాన్స్‌ఫర్ ఆర్డరు వచ్చింది.

డ్యూటీలో చేరి వారమైనా తిరుగలేదు. అమ్మను చిన తాతయ్య గృహంలో వదలి వెళ్లాడట—జ్వరంతో తిరిగి వచ్చిన నాన్న గట్టిగా మంచం పట్టి ఎనిమిది రోజుల్లోనే ఈ ప్రపంచాన్ని శాశ్వతంగా వదలాడట!

చినతాతయ్య మాత్రం నాన్నగారికి జబ్బు నయం చేయడానికి ఓ డాక్టర్ని యింటిలోనే ఉంచి ఎనిమిది రోజులుగా చికిత్స చేయించి తన ముద్దుల మరిదిని జీవింప చేయడానికి, ఎంతో ప్రయత్నం చేశాడు.

"రిప్లాక్సు ఫీవర్. ఇది మరీ సీరియస్" అని డాక్టరు తొలుతనే పెదాలు విరచారట. ఈనాడులాగా మంచి ఔషధాలు లేని రోజు లవి. ఏమైతే నేం! పుట్టించినవాడు రమ్మన్నప్పుడు ఔషధాలేం జేస్తాయి గనుక! ఏమైతే నేం. నాన్న యిక లేడు .... అమ్మ ఆక్రందనాలకు అంతమే లేదు.

తాతయ్య ప్రాచీన భావలహరిలో ప్రభవించిన అమ్మ యీ యిరవయ్యో శతాబ్దం ప్రథమ పాదంలో సైతం సహగమనానికి .... తాతయ్య నర్థించింది. తాతయ్యయితే అందుకు అంగీకరించేవాడే! పైగా అగ్నిగుండం పైన్నే విమానంలో అదృశ్య రూపంలో తన అల్లుడు తన కుమార్తె కోసం ఎదురు చూస్తుంటాడని, కుమార్తె సహగమనం చేయగానే ఆమె ఆత్మ అతనిని చేరి వారి విమానం నేరుగా వైకుంఠ ధామం చేరుతుందని ఆయన ప్రగాఢ విశ్వాసము అయి ఉండవచ్చు!

అదివరకే పతిత మానవోద్ధరణకై యిలాతలంలో రాజా రామమోహన్‌రాయ్ ప్రభవించి సహగమన దురాచారాన్ని రూపుమాపి ఎన్నో ఏండ్లు గడిచినది! తాతయ్య అమ్మ కోరికను మన్నించాడా, తాను కుటుంబంతోపాటు శ్రీకృష్ణ జన్మస్థానం అలంకరించడమో లేక అంతకంటే కఠిన

# ఇప్పుడు
## మీకు ప్రియమైన
## ఆరోగ్యముచేకూర్చే
# విటమినులు కలిసిన
## వాటర్‌బరీస్ కాంపౌండ్
## తీసుకోండి

భారతదేశమందు మిక్కిలి ప్రియమగు, అమూల్యమైన విటమినులతో కూడిన టానిక్కును మీరు యిప్పుడు కొనగలరు. ప్రఖ్యాతి గాంచిన వాటర్‌బరీస్ కాంపౌండ్ ఫార్ములాలో ఆరోగ్యమును, పుష్టిని కలిగించెడు అనేక విటమినులు చేర్చబడినవి. వాటర్‌బరీస్ విటమిన్ కాంపౌండ్ మీకు అనేక విధములుగా మేలు కలుగజేయును. ఇది రక్తమును వృద్ధిచేసి, కోల్పోయిన శక్తిని మరల చేకూర్చి, మీకు ఉత్సాహము నిచ్చును. ఇది నరములకు సత్తువ కలుగజేసి కండరముల అభివృద్ధికి తోడ్పడుటయేగాక వ్యాధులను కూడా నిరోధించును. జబ్బు చేసిన తరువాత త్వరగా స్వస్థత పొందుటకు యిది చాలా సహాయపడును.




# వాటర్‌బరీస్
## విటమిన్
# కాంపౌండ్

మీ ఆహార పోషణను పూర్తి చేయును.

దగ్గు, జలుబులకు క్రియోజోట్ మరియు గ్వైకాల్‌తో కూడిన వాటర్‌బరీస్ కాంపౌండ్ ఎర్ర లేబిల్ గల సీసాలో కూడా లభించుచున్నది.



శిక్షో ప్రభుత్వంచేత విధింప బడుతోంది. అందుకే సహగమనానికి మద్దతు నిచ్చే ధైర్యం ఎవరికుంటుంది గనుక !

చిన్నతనంలో పురాణాలు ఉగ్గుబాలతో రంగరించి పోసినాడు తాతయ్య .... ! తన జీవితం దేనికి ? తన తనువు, మనసూ ఎవరికి ? వైధవ్యంతో ఉన్న స్త్రీలంటే సంఘానికి బహుచుల్కన. వారి మోము చూచినా పాపం అని తలచే రోజులవి.

తనెందుకు జీవించాలి ? ఏదో పరధ్యానంగా ఉంటూంది అమ్మ. ఏదో ఆలోచిస్తూ కంటిలో నుండి తన చెక్కిళ్ళ మీదుగా కారే కన్నీటి ధారను తన చేతో అప్పుడప్పుడూ తుడుచుకొంటూంది. పినతండ్రి మందలించినా, తండ్రి ఓదార్చినా ఆమె దుఃఖం ద్విగుణీకృత మయ్యేది.

తాతయ్య రెండెద్దుల బండిలో అమ్మను తన వూరికి తీసుకొని వెళ్ళాడు. నాన్న పోగా అమ్మ పోషణ భారం అంతా తాతయ్యపై బడింది. ఆమాట కొస్తే అమ్మ తనికి ఏకైక పుత్రిక. తనకు మగ సంతతి లేక పోవడం మూలాన అమ్మ పోషణ భారం అతను వహించవలసి నందుకు తాతయ్య భయపడ్డం లేదు. కానీ తాతయ్య బంధుప్రియుడు.

అన్న కుమారులైనా, తన కుమారులైనా ఒకటే నన్న భావన తాతయ్య మదిలో అలుముకొని పోయింది. తన అన్న కుమారుడు ఆనందరావు పొతికేళ్ల వానికి ఓ మంచి సంబంధం అని ఎంచి ఓ చక్కని చుక్క లాంటి కన్నెను తెచ్చి వివాహం చేశాడు తాతయ్య. అన్నగారన్నా, ఒదిన గారన్నా ఎంతో భక్తి గౌరవాలు—అమ్మకు. ఆనందం కూడా అమ్మంటే చాలా సానుభూతితో ఉండేవాడు. అదేం చిత్రమో గాని లోకంలో అత్తకు కోడళ్లకు, ఆడబడుచులకు ఒదినగార్లకు, ఎలుకకూ పిల్లికీ, ఉప్పుకు నిప్పుకు ఉన్నంత సంబంధం ఉంటుంది.

"నీకూ యీ యింటి కేం సంబంధం ? యీ యింటికి నేను గృహలక్ష్మిని" అన్నట్లున్నవి ఆమె చూపులు, భావాలు—నిర్హేతుకంగానే. దానితో పాటు తాతయ్య తదనంతరం కరిణీకం, వగైరాలు, ఆస్తి అంతా తమకే దక్కాలని, యీ యింటికి అమ్మకు ఏలాంటి సంబంధం ఉండగూడదని, ఆమె ఉండడంచేత ఆ హక్కులు కాస్త గృహమేధియైన తాతయ్య ఏం చేస్తాడో ? నని ఆనందం గారి భార్య ఆరాట పడేది. తనకు పుట్టబోయే భావి సంతానానికి ఆ గృహం, స్థిర చరాస్తులు సంక్రమించాలి. అందుకు అమ్మ ఆ యింటిలో ఉంటే ఏం సంభవిస్తుందో ? ఏకైక పుత్రిక అని తాతయ్య తన ఆస్తిలో అర్థం వ్రాసి యిచ్చినా యీయవచ్చునన్న తలంపు ఆనందం గారి భార్య మెదడులో మెదలడంతో అమ్మను అంతరంగికంగా ద్వేషించడం ద్విగుణీకృతం అయింది.

ఆనందంగారి భార్య నీళ్లకన్నా తేలిగ్గా చూస్తూంది అమ్మని. తాతయ్యకు తాను ఏకైక పుత్రిక అయినా పరాయివాండ్ల ఇంటిలో ఉన్నట్లు మధనపడసాగింది అమ్మ. తన వదిన చిన్న

# హాలాహలంలో అమృతభాండం

చూపుల గురించి అన్నగారితో కాని, తన తండ్రితో గాని చెప్తే తన వదినకు తగిన శాస్తి జరుగుతుంది ! కాని తనవల్ల అన్నగారి కాపురంలో రవరవలు లేవడం అమ్మకు సుతరామూ యిష్టం లేకపోయింది.

నాన్న మరణించడంతో ఆయన బడిపంతులుగా పనిచేసి సంపాదించిన రెండూవేల రూపాయలూ తాతయ్య స్వాధీనంలోనే ఉంది. ఆ గ్రామంలోనే మంచి మాగాణి భూమి ఆ సెలయేటి కాలువ క్రింద మూడెకరాలు రెండువేల రూపాయలకు కొనదలచుకొన్నాడు తాతయ్య. తాతయ్య చేయదలంచుకొన్న పనిలో అతని దృక్పథంలో తప్పు కూడ యేమీ లేదు. అమ్మ పేరుతో భూమి కొన్నచో పెద్దనాన్నగారు, అతని సుపుత్రులు భాగా

> కొడుకు : "అమ్మా ఈ ఉత్తరం పోస్టుచేసివస్తానే"
>
> తల్లి: వద్దు బాబు ! ఈ చలిలో కుక్కలుకూడ వీధిలో తిరుగవు. మీ నాన్న వేసి వస్తారు లే!"
>
> —షేక్ ఇక్‌బాల్ అహమ్మద్ (చిత్రగుంట)

నికి వచ్చినా రావచ్చు. తొలుత తన పేరుతో చేసుకొంటే కాలక్రమాన ఆ భూస్థితి తప్పక దౌహిత్రుడైన తనకు చెందక పోదని ఆయన విశ్వాసం. ఈ కారణాలచేత అమ్మ పేరుతో పొలం ఉండడం మంచిపని కాదని అతని ఉద్దేశం.

తన కుమార్తె జీవన భారమంతా పూర్తిగా వహించదలచుకున్న తాతయ్య తన పేరుతో ఆ పొలం చేసుకోడానికి నిశ్చయించాడు. తన తదనంతరం తన స్వార్జితమైన ఆస్తిలో కొంత,కరిణీకం తన అన్న కుమారుడైన ఆనందానికిచ్చే మనో నిశ్చయం అతనిలో లేకపోలేదు. ఈ నిశ్చయం ఆయన పలుకులవల్ల అందరికీ విదితమైనదే.

ఒకవేళ తాతయ్య మరణించినట్లయితే నాన్న సొత్తుతో కొన్న భూమి అన్నకు సంక్రమిస్తుంది. అది మామూలు. కాని తన అన్నంటే—పెదనాన్న కుమారుడు ఆనందం అంతకు పొల్పడుతాడా ? ఎన్నటికీ పొల్పడడు. కానీ, తన ఒదిన నల్లతంగ. ఒదినె. "మూళి అలంకారి—మూదేవి శొండాళి' లాంటిది. అన్నయ్య ఒదినె చేతిలోని కీలుబొమ్మ ఆమె ఎట్లాడించిన అట్లాడగలడు. ఇంతకు ఆనంద మామయ్య భార్య ఒక స్వాధీన పతిక.

ఈలాంటి ఆలోచనలతో అమ్మ ఉక్కిరిబిక్కిరి అయ్యేది.

తన్నింకా దేవు డెందుకు జీవింప జెయ్యాలి ? అన్నగారి సంసారంలో అగ్నిభాండం తన కారణంగా లేవగూడదు కదా ! తాతయ్య తదనంతరం ఆస్థి వంశానుగతంగా అన్నయ్యకు చెందుతుంది. అన్నయ్య తనకివ్వాలన్నా యివ్వనియ్యదు ఒదినె. ఆమె నిన్ను హతో కృశించి పోయింది.

తండ్రిని సమీపించి తన పేరుతో ఆ పొలం రిజిష్టరు చేసి యిమ్మని కోరింది అమ్మ—తాతయ్య అపార్థం చేసుకొన్నాడు. భావి జీవితంలో అమ్మ వూహలు శిలాక్షరాలు అవుతాయని అతని కేం తెలుసు. 'ఎవరి పేరుతో నుంటే యేం ? నీ క్కావలసిం దింత గుడ్డ, అంత అన్నం, యిదేనా ? నన్ను నమ్మలేవా అమ్మా' అని ఆక్రోశించాడు తాతయ్య. మరి యెదురుగా నిలువలేక పోయింది అమ్మ.

ఆ మరుదినం రిజిష్టర్ను పూర్తి అయి వచ్చిన పత్రాలు, పెట్టెలో పదిలంగా దాచి పెడుతూండడం చూచింది అమ్మ. ఎవరి పేరుతో రిజిష్టరైంది పొలం అని అమ్మ అడిగిందానికి తాతయ్య "కస్సు" మంటూ లేచిపోయాడు బయటికి.

'ఎవరి పేరుతో అయితేనేం ?' అని ఒదినెగారన్నది. "రిజిష్టరు నా భర్త పేరుతో అయినది. అతడు చెప్పాడు. నీ తండ్రి మరణానంతరం నీకో చిల్లిగవ్వ కూడా దక్కదీ యింట్లో. ఎప్పుడూ కన్నీటితో మా యిల్లే ఏడ్పుల కొంపగా చేశావు. ఏ నూతిలో, గోతిలోనైనా పడి చావరాదూ ?" అన్నది ఒదినె.

ఇన్ని సంగతులు, వదినెగారన్న మాటలూ తాతయ్యకు నిజంగా తెలీదు. వృద్ధాప్యం మూలాన అమ్మమ్మకు ఆ పలుకులు స్పష్టంగా వినిపించినవి కావు. ఎంత పేచీ పెట్టినా, అమ్మ తాతయ్యతో చెప్పదన్న ధీమాతో గామాలు యిన్ని మాటలు అన్నది ఆనందంగారి భార్య !

"అవును, నిజం. ఆనాడే సహగమనానికి అంగీకరించలేదు తాతయ్య. ఆనాటి నుండి తనకు జీవితంపైన విరక్తి. ఎప్పుడూ దీర్ఘాలోచనలతో వేడి వేడి కన్నీటి కణాలు అప్రయత్నంగా చెక్కిళ్లపైన కారుస్తూ తన్ను చూచుకొని జీవించేది అమ్మ. వేసగి టీరెండచేత శుష్కమైన గడ్డిపోచలను రవంత అగ్నికణమే ప్రజ్వరిల్ల జేసినట్లు శోకమూర్తియై విరాగిణియై, జీవచ్ఛవంలా జీవిస్తూండే అమ్మకు ఒదినె అన్న మాటలు మంత్రాల్లా పనిచేసినై.

తా నెందుకు నుయ్యో గొయ్యో చూచుకోగూడదు ? నిజానికి నాన్న ధనంతో కొన్న ఆస్తి తన కుమారుడైన కృష్ణమూర్తికి అందదు. చెవి నిల్లు పెట్టుకొని ఘోషించినా, యీ విషయం తాతయ్యకు అర్థంకాదు. మొత్తానికి వైధవ్య భారంతో, వదినగారి అనాదరంతో, తండ్రిగారి అమాయకత్వంతో అమ్మ ఆ అర్థరాత్రం ఒదినె గారి సలహా మేరకే—నుయ్యి చూచుకొనింది. అని లోకం కోడై కూసింది. ఆ కూతతో అమ్మ మరణించినందుకు కారణం ఆనాడు తెలిసింది కృష్ణమూర్తికి !

అమ్మ మరణానికి తనూ కొంతవరకు కారణ

భూతు డున్న తాతయ్య ఆ చింతతోనే అచిరకాలంలోనే స్వర్గధామా న్నలంకరించాడు.

నాలుగోయేట తండ్రిని, ఐదోయేట తల్లిని పరలోకానికి పంపిన తనకు అమ్మమ్మ అండయ్యై పోషించింది. అత్తయ్యకు తనంటే ఏమిటో జుగుప్స. అమ్మ మరణించినా, తాతయ్య అంతరించినా, ఆనందంగారి భార్యకు హృదయంలోని ఆరాటం ఆగింది కాదు. అమ్మమ్మ అసలు భర్తృ మరణంతో, పుత్రికా శోకంతో కృంగి, కృశించి తన్ను చూచుకొని రోజులు గడుపుతున్నది. అత్తయ్య చేసే అల్లరికి ఆ యింటిలో ఉండడం దుర్భరమై అమ్మమ్మ తన్ను తీసుకొని తన తమ్ముని వూరు చేరుకొంది. తన పరిదీన దశను తన తమ్ముడు పద్మనాభరావుతో వెళ్లబోసుకుని, తల్లీ, తండ్రికి దూరమైన వా, యీ దౌహిత్రుణ్ణి పైకి తేవలసిన భారం నీదని కాళ్లా, వ్రేళ్లా బడి బ్రతిమలాడింది.

అక్కయ్య ఆవేదనను అర్థం చేసుకొన్న పద్మనాభరావుగారు ఆర్ద్రహృదయంతో కరిగిపోయాడు. సమీపమందలి బస్తీలో ఉన్నత పాఠశాలలో తన్ను చేర్పించి, అమ్మమ్మను తనకు అండగా నియమించి అన్ని ఖర్చులూ ఆయనే భరిస్తూండేవాడు.

రోజులు, వారాలు, నెలలు దొర్లి సంవత్సరాలుగా కాలచక్రం దొర్లుతూ శరవేగంతో అప్పుడే పదేండ్లు కావచ్చింది తన బస్తీ జీవితం. తనప్పుడు ఎస్. ఎస్. ఎల్. సి. చదివే రోజులు. టైఫాయిడ్ ఫీవర్ రావడంచేత పాఠశాలకు ఆగవలసి వచ్చింది తను. అమ్మమ్మ చెవిలోని కమ్మలు, మెడలోని కంటె అమ్మి డాక్టరుకు ఫీజు చెల్లించిందట. పద్మనాభరావుగారు అప్పుడప్పుడూ వచ్చి పరామర్శించి పోతూండేవాడట. సుమారు ఒకటిన్నర నెల పర్యంతం దివారాత్రముల తేడా తన కప్పట్లో తెలిసి రాలేదు. నయమైన కొద్దీ, డాక్టరు "కృష్ణమూర్తీ! యమధర్మరాజునే జయించావయ్యా" అనేవాడు. అమ్మమ్మ చిక్కి శల్యమై పోయింది. లోతైన కన్నుల్లో, బరువైన హృదయంతో ఆ మాతృహృదయం కంపించేది. ఆమె ఆ పరిస్థితిలో ఒంటరిగా రోగిష్టి అయిన తనతో యేలా గడిపిందో నని తలంచుకొన్న కొద్దీ గుండె చెరువై పోయేది.

ఇంత జబ్బు పడ్డా, తాను యధాతథంగా పరీక్షల్లో ఉత్తీర్ణు డయ్యాడు. కళాశాలలో ప్రవేశించి కళాశాల విద్యాపూర్తి గావించి ట్రెయినింగ్ కాలేజీలో చేరాడు తను. ఒక్క సంవత్సర కాలం అట్టే దొర్లి పరీక్షలు ముగిసినై.

అదివరకే తను ఉద్యోగానికి అప్లయి చేశాడు. టెలిగ్రాం అర్జంటువచ్చింది ట్రెయినింగ్ కాలేజినుండి రిలీవైన దినమే! సుదూర ప్రాంతాల్లో బస్తీలో తన్నే ఉన్నత పాఠశాలలో సైన్సు అసిస్టెంటుగా పోస్టు చేశారు. అమ్మమ్మ యీ వార్త విన్నప్పుడు ఆమె కన్నులు ఆర్ద్రతైనాయి. ఆనందాశ్రువులు రెండు అమ్మమ్మ చెక్కిళ్ళపై చింది జారిపోయినై. "బాబూ, యిదంతా ఏడుకొండలవాని దయ నాయనా" అన్నది అమ్మమ్మ. పద్మనాభరావు గారికీ శుభవార్తను వెంటనే టెలిగ్రాం

# హాలాహలంలో అమృతభాండం

మూలంగా అందజేసి మొదటి తరగతి రైలు పెట్టెలో అమ్మమ్మను ఎక్కించుకొని ఉద్యోగానికి బస్తీకి వెడుతున్నాడు తను. మందమందంగా రైలుబండి కిటికీలలో నుండి సమీరుడు లోని ప్రయాణీకులకు పంకా వేస్తున్నాడు. అమ్మమ్మ దేవతలాంటి మనిషి. అమ్మమ్మ లేకుంటే తనింతటివా డయ్యేవాడు కాడు, అన్న భావన తన కానాడే కల్గింది. అందుకే అమ్మమ్మను పూవుల్లో పెట్టి పూజించాలని తనప్పుడప్పుడూ అనుకునేవాడు.

బస్తీలో ఉన్నత పాఠశాలలో ఉద్యోగం బాగానే ఉంది. తోడి పంతుళ్ల సౌభ్రాతృత్వంతో, ప్రధానోపాధ్యాయుల ప్రసన్న హృదయంతో తన నిరంతర దీక్షాబద్ధమైన బోధనాపటిమతో ఖ్యాతి సంపాదించడానికి ఎంతో కాలం పట్టలేదు తనకు. ఎస్. ఎస్. ఎల్. సి. లో దాదాపు ముప్పై రెండు మంది విద్యార్థులు, ఎనమండుగురు విద్యార్థినులు ఉన్నారు. అందు నీరజ అనే అమ్మాయి సైన్సు పాఠాల్లో వీక్‌గా ఉండడం తను గమనించాడు. ఏలనో తన హృదాంతరాళంలో తనకు తెలికనే మమత ప్రభవించి తాను ఆమెపట్ల ఆప్యాయతతో నడుచుకొనేవాడు. సైన్సు పాఠాల్లో తాను స్పెషల్ కోచింగ్ యిస్తానని, యింటికి వచ్చి నేర్చుకోమని చెప్పాడు నీరజకు. సమీపించే పరీక్షా సందర్భంలో తెప్పలా దొరికాడు కృష్ణమూర్తి అనుకొన్నది నీరజ!

నీరజ వదనము వేయి రేకులు విరియించిన, మిత్రుని వైపు నిరీక్షించే నీరజమే! .... శరీరంలోని దేహకాంతి .... నిగ్గుతీని, ఆమె అవయవాలలో ప్రతిఫలించి సౌదామినీగాత్రిగా ఆమె తనువును మార్చివేసింది. ఆమెకు విజ్ఞాన శాస్త్రంలో పాఠాలిస్తూ, ప్రేమ పాఠాలు ఆమెకి వల్లించాలనుకొన్నాడు తను. నీరజ అప్పుడప్పుడూ అమ్మమ్మకు తాను వలదన్నా, విరామం కలిగినప్పుడల్లా పనిపాటల్లో సాయపడి వెళుతూండేది. పరీక్షలు ముగిసినై. బాగా వ్రాశానని తృప్తిపడింది నీరజ.

ఆనాడు తన్ను సమీపించి "మీ రుణం ఎలా తీర్చుకోగలను పంతులుగారూ!" అంటుంటే తను ఆమెచేలాంచలాన్ని పట్టుకొని చేరువకు తీసుకొన్నాడు.

"నీ—ర—జా నిన్ను ప్రేమిస్తున్నాను. నా జీవితం అంధకార బంధురం చేయకు" అన్నాడు డగ్గుత్తికతో తను. నిశ్శబ్దం తాండవించింది యిరువురి మధ్య.

తనో మాతృవిహీన, దీన అయిన ఒక అభాగిని. ఏకైక పుత్రిక ఐన తనకై తన తండ్రి వేయి కండ్లతో నిరీక్షిస్తూంటాడని, అతని సంకల్పానికి వ్యతిరేకంగా నడచుకోడం తన కిష్టంలేదని, కానీ, తన మాటను నిరాదరించే కఠినుడు మాత్రం తన తండ్రి కాడని ఆమె చెప్పింది.

ఆ మాటల్నిబట్టి ఆమె హృదయం తనతో లంకె పడ్డదని తా నానాడు గ్రహించాడు. పరీక్షలు ముగిసినా, రోజూ సాయంత్రం నీరజ తన గృహానికి రావడం తనకూ ఉల్లాసాన్ని కలిగించేది. ఒకనాటి సాయంకాలం నీరజతో తాను యింటి వెనుక వరండాలో ఉండగా వీధి గుమ్మంలో నుండి ఒకతను లోపల ప్రవేశించడం లీలామాత్రంగా కిటికీ పూచలలో నుండి కనిపించింది. ఆ ఆగంతకుడు అమ్మమ్మను జూచి బావురుమన్నాడు. తన భార్య మరణించిందని, తన పుత్రిక నీరజ యిక్కడ చదువుతూందని, అమ్మమ్మతో యేమేమో చెబుతూన్నాడు. నీరజ ఆతురతతో లోనికి పోబోవ తాను వారించాడు.

"ఏరా ఆనందం! గడచిందేదో గడచింది. అబ్బాయి కృష్ణుడు ఉన్నత పాఠశాలలో పంతులుగా ఉంటున్నాడు. నీ కుమార్తె నీరజను .... అని అర్థాంతరంలో ఆగింది అమ్మమ్మ. అంతకంటే కావలసిం దేమిటమ్మా నాకు. అపుత్రకుడైన నా యావదాస్తీ ఆమెకారణంగా యిచ్చి కృష్ణమూర్తికి వివాహం చేస్తాను. గానీ కృష్ణమూర్తి తన్ను క్షమిస్తాడా" అని అమ్మమ్మతో అంటున్నాడు.

సాయంకాలం తూర్పు కొండపై నిండు చంద్రుడు ప్రభవించాడు. శరజ్జ్యోత్స్నలో నీరజ మెరిసిపోతోంది. కృష్ణమూర్తి ఆమె చేతిని సున్నితంగా లాగి మృదువుగా ఆమె చెక్కిళ్లపై చుంబించాడు.

హాలాహలం లాంటి అత్తయ్యలో నుండి ఎలా ప్రభవించిందీ నీరజ అనే అమృత భాండం! అత్తయ్య పోలికలు గుణాల్లో గాని, రూపంలో గాని మచ్చుకైనా లేవీ నీరజలో అనుకొన్నాడు తను. మామయ్య వరండాలోనికి రావడంతో స్తబ్దులై నిలుచున్న నీరజను, తనను చూచిన మామయ్య ముఖారవిందంలో వో మందహాసరేఖ కందళించింది.

ప్రక్కయింటి గదిలో విద్యార్థి కాబోలు "ఎంగిలి చోట సువర్ణ మబ్బినన్ తక్కక వెన్విషంబున సుధారస ముండిన గ్రాహ్య మండ్రు" అని కంఠస్థ పద్యం కలకంఠంతో వల్లించుక పోతూన్న సవ్వడి గాలిలో లీలామాత్రంగా వినిపిస్తోంది. ఆనాటి మధుర సంఘటన లెన్నో యింకా కృష్ణమూర్తిగారి భావాంబర వీధిలో లీలామాత్రంగా యిలా మెదిలిపోతూంటాయ్. ★

రోగి-ఏమండీ, "ఒక్క డోసు మందుతో నా జబ్బు తగ్గిపోతుం దంటారా?"

డాక్టరు-తప్పకుండా! ఇంత వరకూ రెండవ డోసుకోసం నా దగ్గరకు ఎవ్వరూ రావడం జరగలేదు.

రిమాజ్ పాషా (కాకినాడ)

# నరాశయము : దాని భాగములు

మానవ జీవితంలో మాటల ప్రాముఖ్యతను గురించి చెప్పడం చంద్రుడు తెల్లగా చల్లగా వుంటాడని చెప్పడం వంటిది. మానవ నాగరికత మానవుల సంఘజీవితం, మానవ సంబంధ బాంధావ్యములు, అన్నీ మాటలమీదనే ఆధారపడి వున్నవి.

ఈ మాటలు ఎల్లా ఏర్పడుతున్నవి? మాట్లాడుతున్నప్పుడు శరీరంలో ఏ ఏ అవయవములు పాల్గొంటున్నవి. ఇవి రోగగ్రస్తము అయినప్పుడు మాట్లాడ్డంలో ఏ ఏ మార్పులు, లోపములు యేర్పడుతవి? అన్న విషయములు తెలుసుకోవాలంటే ఉచ్వాస నిశ్వాసములనుగురించీ,లేరింగ్సు (Larynx) (శబ్దపేటిక)ను గురించీ, ఇంద్రియములను గురించీ వీటన్నింటి కార్యక్రమములకు మూల కారణమయిన నరాశయమును గురించి అతి క్లుప్తంగానయినా తెలుసుకోవాలి.

ముందుగా నరాశయమును గురించి తెలుసుకుందాము.

(1) కేంద్రభాగమనీ, (2) పార్శ్వ భాగమనీ నరాశయమును స్థూలంగా రెండుభాగముల క్రింద విభజించవచ్చును.

కేంద్రభాగంలో శిరఃపేటికలోవుండే మెదడు, అందులో భాగములు, (2) వెన్నుపాము, దానికి సంబంధించిన నిర్మితులు ఉంటవి.

మెదడులో (1) సెరిబ్రము (Cerebrum) అనే అర్ధగోళాకృతిగలభాగము (2) సెరిబెల్లము (Cerebellum) అనేభాగము(3) మెడుల్లా ఆబ్లాంగేటా అనేభాగము,(4)పాన్సు, అనే భాగము ఉన్నవి. ఇంకొన్ని చిన్న భాగములు కూడా వున్నవి. కేంద్ర ప్రభుత్వ కార్యాలయములో అనేక భాగములు అనేక ధర్మములు నిర్వర్తిస్తూ, ఇతర భాగములతో సంబంధం కలిగి ప్రభుత్వం సర్వ కార్యములను నిర్వర్తించినట్లే మెదడు శరీరంలో అన్ని భాగములనుంచీ వార్తలను సేకరించి, అందుకు ఫలితంగా ఆ యా భాగములు నిర్వహించవలసిన విధులకు కావలసిన ఉత్తరువులను జారీ చేస్తూ వుంటుంది.

నరాశయ విజ్ఞానం అపారమయినది. అనంతమైనది. ఇంకా శాస్త్రజ్ఞులకే పూర్తిగా అర్థం కానిది. నరాశయవిజ్ఞానమే పూర్తిగా తెలుసుకున్ననాడు మానవుడు పరమాత్మతో లీనమైపోతాడు. నరాశయమును గురించి అతి విపులంగా సందర్భం వచ్చినప్పుడు వివరిస్తాను. ఇప్పుడు నాలుక, రుచి, మాటలు అందుకు కారణములయిన ఇంద్రియ కార్యక్రమము, వీటిని గురించిన విషయములనే యిక్కడ ప్రస్తావిస్తాను.

సెరిబ్రము : అర్ధ గోళాకృతిగల నిర్మితి' అని చెప్పేను. అది అర్ధగోళాకారంగల ఒకే నిర్మితి కాదు. ఇందులో కుడి ఎడమ భాగములున్నవి. పంపర పనసకాయను రెండు భాగములుచేసి, ఆ అర్ధ భాగమును మళ్ళీ తొనల అంచు విడివడకుండా రెండు భాగములు చేస్తే ఎల్లావుంటుందో, అల్లా యీ కుడి ఎడమ భాగములు కలిసి వుంటవి. ఈ రెండు భాగములను పాన్సు—అనే భాగము కలిపివుంచుతుంది. ఈ భాగములను సెరిబ్రల్—హెమి—స్ఫియరులు అంటారు.(Cerebral(Hemispheres)హెమి అంటే 'అర్ధ' స్ఫియరులంటే గోళాకృతి. కాని రెండు




భాగములుకలిసి అర్ధగోళాకృతికలదైనా, ఇం భాగములకు ఆ పేరే మిగిలిపోయింది.

ఈ నిర్మితులలో కొన్ని ఖాళీ ప్రదేశములు వుంటవి. ఆ ఖాళీ ప్రదేశములు ఒకదానితో ఒకటి సంబంధం కలిగి వుంటవి.

జీడి మామిడిపండుక్రింద జీడి గింజలాగా మెదడు క్రింద సెరిబెల్లము (Cerebellum) అనే భాగం వుంటుంది. దీనిక్రిందనుంచి మెడుల్లా ఆబ్లాంగేటా అనే భాగము వుంటుంది. ఈ భాగమే వెన్నుపూసలమధ్యగావెన్నుపాముగా(Spinalcard)క్రిందికి పోతుంది. ఈ వెన్నుపామునుండి రెండు ప్రక్కల నుంచీ అనేక నరములు ప్రారంభమై, శరీర భాగములకు పోతవి.

శిరఃపేటికలోవుండే భాగములను, వెన్నుపామును కలిపి కేంద్రనరాశయము (Centralnervous-system) అంటారు.

ఈభాగముల నిర్మాణంలో (1) న్యూరానులు (నర జీవకణములు)(2)నరంపోగులు (Nerve fibres) (3) న్యూరోగ్లియా అనే పదార్థము వుంటవి. సాధారణంగా న్యూరాన్ నక్షత్రాకారము గలది (1 వ చిత్రము) కాని ఆ న్యూరాన్ ఆకారం అనేక విధములుగా వుండవచ్చును. దానినుండి బయలుదేరే పోగుల సంఖ్య కూడా ఒకే రకంగా వుండదు. అన్ని జీవకణములలాగే న్యూరానులోనూ సైటోప్లాజమూ, న్యూక్లియస్ వుంటవి. నక్షత్రాకారముగల న్యూరాన్‌లో ఒక కొన న్యూరాన్‌నుండి వార్తను మరొక న్యూరానుకో కండరము, లేక గ్రంధికో తీసకొనిపోతుంది. ఇటువంటి పోగును ఏగ్జాన్ అంటారు. ఇతర అగ్రములు, ఇతర ప్రదేశములనుంచి వచ్చే వార్తలను న్యూరానులోకి అందజేసేవి. వాటిని డెండ్రానులు అంటారు. డెండ్రానులలో కొన్ని శాఖోపశాఖలుగా చీలివుంటవి. ఈ డెండ్రాను శాఖలను డెండ్రైటులు అంటారు. ఈ నరం పోగులను, మయెలిన్(Myelin) అనే వస్తువుతో తయారయిన పొర కప్పివుంటుంది. ఈ మయెలిన్ ఇన్‌ఫ్లేం కావడమును మెయెలైటిస్ అంటారు. ఈమధ్య ఆంధ్రదేశంలో ఎపిడెమిక్‌గావున్న పోలియోమైయెలైటిస్‌లో శరీరంలో జరిగే ప్రధానమైన మార్పు నరం పోగులమీద మయెలిన్ ఇన్‌ఫ్లేంకావడమే.

ఏగ్జానులు, డెండ్రానులు కలిసి కట్టగా ఏర్పడతవి. వీటిని టెలిగ్రాపు తీగెలతో పోల్చవచ్చును. ఒక న్యూరాను వార్తలను పంపడానికీ, వార్తలను, స్వీకరించడానికి శక్తి కలిగిన చిన్న ఉద్యోగివంటిదన్నమాట. నరంపోగులు, న్యూరానులు అన్నీ న్యూరోగ్లియా అనే గుజ్జువంటి పదార్థంలో సురక్షితములై వుంటవి. అనేక నరంపోగుల కలయికతో ఒక నరము ఏర్పడుతుంది. ఆ నరమును మరొక పొర సంరక్షించుతూ వుంటుంది.

శరీరంలో యితర జీవకణములకూ న్యూరానులకూ ఒక ప్రధాన భేదమున్నది. ఇతర జీవ కణములు అపాయములనుండీ, వ్యాధులనుండీ త్వరగా తేరుకోగలవు. కాని వ్యాధిగ్రస్తములయిన న్యూరానులు అంత తేలికగా తేరుకోలేవు.

ఒక్కొక్కప్పుడు కొన్ని న్యూరానులు కలిసి గుమిగూడివుంటవి. ఈ న్యూరానులకూడలిని గేంగ్లియాన్ Gangleon అంటారు. 'గేంగు' అంటే' గుంపు.

స్పర్శ, వేడి, బాధ ఇటువంటి అనుభూతులను కలిగించే విషయములను 'స్టిమ్యులస్' అంటారు. ఏగ్జాను అగ్రముకు యిటువంటి స్టిమ్యులస్ తాకగానే ఒక 'మార్పు' ఏర్పడుతుంది. ఆ మార్పును 'ఇంపల్సు' (Impulse) అంటారు. న్యూరానులకు, నరం పోగులకూ యీ ఇంపల్సులను, ఒక న్యూరానునుంచి మరో న్యూరానుకో, శరీరంలో ఇతర జీవకణములకో అందజేసే శక్తి వున్నది. ఒక న్యూరానునుండి ఆరంభమై ఏగ్జాన్ మరొక న్యూరాన్ అగ్రముతో "అంటి" వుంటుంది. "అలికి" వుండదు. ఎలెక్ట్రిక్ స్విచ్చిలో 'కాంటేక్టు' ఏర్పడ్డట్లే ఇక్కడా కాంటేక్టు మాత్రం సన్నిహితత్వంవల్ల ఏర్పడుతుంది.

నరం పోగుకు అంటివుండే ప్రదేశమును 'సైనాప్సు' అంటారు. (Synapse) ఈ సైనాప్సు ఎందుకున్నదో, వార్తాప్రసారంలో ఇక్కడ ఏఏ మార్పులు జరుగుతవో ఇంకా పూర్తిగా శాస్త్రజ్ఞులు తెలుసుకోలేదు. ఈ సైనాప్సులోనే, అక్కడకు వచ్చిన అనుభూతి (Sensation) ఒక

## మనమూ-మనదేహస్థితీ

కండరం కదలడానికో, ఒక గ్రంధి స్పందించడానికో, ఒకఆలోచన పుట్టడానికో కావలసిన'కర్మ' (action) కు కారణభూతమయిన "ఆజ్ఞ"గా మారిపోతుంది.

మయెలిన్ పొర ఎలెక్ట్రిక్ తీగెమీదవుంటే 'ఇన్సులేషన్' (Insulation) లాగా నిరంతరాయంగా వుండదు. వెదురులోనూ, చెరుకులోనూ వున్నట్లే యీ పొరలో కణుపు లుంటవి. ఈ కణుపుల ప్రయోజనమూ ఇంకా పూర్తిగా అర్థం కాలేదు. (విప్ప



మొదటిచిత్రము

## న్యూరాన్- దాని భాగములు




మూర్తికి వెదురు బొంగును, వాద్య విశేషంగానూ కుమారస్వామికి చెరుకు కర్రను ఆయుధంగానూ ఈ మయెలిన్ పొరను చూచే మనవారు కల్పించారేమో!)

నరంలో ప్రవహించే 'ఇంపల్సు' ఎలెక్ట్రిక్ కరెంటు వంటిది. దానిలాగే ఇదీ ఒక చోటినుంచి మరొక చోటకు ప్రవహిస్తుంది. కాని ఎలక్ట్రిక్ కరెంటు ప్రయాణించినంత వేగంతో నరం యింపల్సు ప్రయాణించలేదు. అది సెకండుకు 200 అడుగులనుండి 300 అడుగుల వేగంతో ప్రయాణిస్తుంది. కొందరిలో ఈ వేగం చాలా తక్కువగా వుంటుంది. అటువంటి వారిలో స్టిమ్యులస్‌కు వచ్చే జవాబు ఆలశ్యంగా వస్తుంది. అటువంటివారిని మందకొడి మనుష్యులంటాము. మానవ జీవితంలో ఈ భేదం అతి ముఖ్యమైనది. వ్యక్తులలో యీ భేదానికి కారణం ఇదమిత్థమని చెప్పడం కష్టం. పారంపర్య కారణములు, తర్ఫీదు లోపములు, ఆహార లోపములు, సాంఘిక పరిస్థితులు, కొన్ని వ్యాధులు ఎన్నో యిందుకు కారణములు కావచ్చును. ఒకరికి రెండు మూడు మారులు చెబితేనేగాని వంటబట్టదు. ఒకరు అనదలచుకున్న మాటను అనదలచుకున్నంత వేగంగా అనలేరు. చేయుదలచుకున్న పని వెంటనే చేయలేరు. ఈ మందకొడితనం అన్ని ఇంపల్సులకు, అన్ని వయస్సులలో, అన్ని పరిస్థితులలో ఒకే మాదిరిగా వుండదు. కొందరు కొన్ని శబ్దములను తేలికగా ఉచ్చరించడం మరికొన్ని శబ్దములను ఉచ్చరించడానికి బహు ప్రయత్నం చేయడం యిందువల్లనే కావచ్చు. మనిషిలో చురుకుతనమే దీనిమీద ఆధారపడి వున్నది.

కేంద్ర నరాశయంలో ప్రధాన భాగమైన సెరిబ్రమును కోసిచూస్తే పైన ఒక గోధుమరంగుగా వుండే పొర, లోపల తెల్లగావుండే భాగము కనిపిస్తవి. ఈ గౌర భాగం కేవలం న్యూరానుల కలయికవల్ల యేర్పడ్డది. ధవళ భాగము నరంపోగులు, వాటిని కలిపివుంచే న్యూరోగ్లియావల్ల ఏర్పడ్డది.

సెరిబ్రంలో అర్ధగోళములలో వెలుపలి ప్రక్కన ఒక గాడి వున్నది. ఆ గాడినీ, దాని అర్థమునూ రోలాండో అనే శాస్త్రజ్ఞుడు ముందు తెలుసుకున్నందున ఆగాడికి 'రోలాండో గాడి' (Fissure of Rolando) అనిపేరు. సెరిబ్రము గౌరభాగంలో ఆగాడిముందున్న—అంటే ముఖంవైపున వున్న ప్రదేశం అంతా మోటారుభాగమ్ము. 'మోషన్' అంటే చలనం. చలనం కలిగించేది 'మోటారు.' శరీరంలో కండరముల సంకోచ వ్యాకోచములు గ్రంధుల స్పందనములు, ప్రతిభ, జ్ఞాపకశక్తి సదసద్వివేక శక్తి విచక్షణజ్ఞానము, యుక్తాయుక్త నిర్ణయము యిటువంటి ఉదాత్త కార్యకలాపానికి సంబంధించిన న్యూరానుల కూడలులు యీ ప్రదేశంలోనే వుంటవి. ఈ న్యూరినులకు ఏమాత్రం ఒత్తిడి తగిలినా శరీరంలో అవయవములు బాదుకుంటవి. స్మృతికి సంబంధించిన న్యూరానులు యిక్కడ వున్నవి. తెలిసి చేసే పనులన్నీ యీ న్యూరానుల ఆదేశంవల్లనే జరుగుతవి. గౌరభాగంపై పొరలో తెలిసిచేసే పనులకు సంబంధించిన న్యూరానులు వుంటే తెలిసీ తెలియని ఉపస్మృతిలో చేసే పనులన్నీ క్రింది పోగులలో వుంటవి. శిరఃపేటికలోవుండే కేంద్రనరాశయమును మెదడు(Brain) అంటారు. ఇందులోనే సెరిబ్రము సెరిబెల్లము పాన్సు మెడుల్లా అబ్లాంగేటా మరికొన్ని నిర్మితులు వున్నవి. సెరిబ్రం ఒకే ముద్దగాదు. బత్తాయిలో తొనల లాగా అందులో అనేక భాగములున్నవి. వాటిని లోబులు అంటారు.ఇందులో శిరఃపేటికలో పాలభాగంలోవున్న 'లోబ్' (Lobe)లో [illegible] కములు, అనుభూతులు, జ్ఞాపకశక్తి వీటికి సంబంధించిన న్యూరానులు వున్నవి. ఈ న్యూరానులలో ఒక్కొక్క పనికి సంబంధించినవి ఒక్కొక్క గుంపుగా వుంటవి. ఈ గుంపులను కేంద్రములు(Centrcs) అంటారు. చిన్న గుంపును 'గేంగ్లియాన్' అంటారు. ఈ భాగం అపాయానికిగాని, రోగానికిగాని గురి అయినప్పుడు పై శక్తులు నశిస్తవి. మెదడు అతి కఠినమైన శల్యములతో తయారయిన శిరఃపేటికలో పరిరక్షితమై వున్నది. మెదడును, వెన్నుపామునుచుట్టి మూడు రకములయిన పొరలున్నవి. ఈ పొరలకు మెదడుకు మధ్య ఒక ద్రవ పదార్థము వున్నది. దానిని సెరిబ్రోస్పైనల్ ఫ్ల్యూయిడ్ అంటారు. అంటే సెరిబ్రముకూ, వెన్నుపాముకూ సంబంధించిన నీరు అని అర్థము. దీనిని మెదడు నీరు అందాము. ఈ నీరు సెరిబ్రములోవున్న ఖాళీ ప్రదేశములలో కూడా వుంటుంది. ఒక ఖాళీ ప్రదేశానికి మరొక ఖాళీప్రదేశానికీ ద్వారం వుంటుంది. వెన్నుపాములో మధ్యలోను గొట్టంవంటి ఖాళీ ప్రదేశమున్నది. మెదడులో ఖాళీప్రదేశములకూ యీ గొట్టంవంటి ఖాళీప్రదేశమునకు సంబంధం వున్నది. మెదడు నీరు మెదడును యీ ఖాళీ ప్రదేశములనూ నింపి చలిస్తూ వుంటుంది. ఈ ద్రవములో జరిగే, మార్పులను కొన్ని సాధనముల ద్వారా పరిశీలించి రోగ నిర్ణయం చేయవచ్చును. నెత్తికి

( 54వ పేజీ చూడండి)

2 వ చిత్రము




1) పాదం
2) కాలు
3) తొడ
4) ఉదరం
5) వక్షం
6) భుజం
7) ముంజేయి
8) హస్తం
9) వ్రేళ్లు
10) బొటనవ్రేలు
11) మెడ
12) ముఖం
13) నాలుక
14) దవడ
15) కొండనాలుక
16) శబ్దపేటిక

1 నుంచి 14 వరకు చలన కేంద్రముల లాగే
15 పెదిమలు
16 శబ్దపేటిక (LARYNX)

I మాటలాడటానికి సంబంధించిన కేంద్రము
II మాటలు వినడానికి సంబంధించిన కేంద్రము
III మాటల మధ్యభేదము తెలుసుకునే కేంద్రము

# సినీమా కధ

గంటి సూర్య ప్రకాశరావు



అనుకూలుడైన భర్త, ఆదరించే అత్తమామలు, రాధ కాపురం సుఖంగానే గడచిపోయింది. కాని విధి వైపరీత్యాన్ని తప్పించగలిగిందెవరు ?

సేట్ హీరాలాల్ ఇంటినుంచి బెజవాడ స్టేషన్ చేరుకునేసరికి ఏడుగంటలు దాటింది. అప్పటికే మద్రాసువెళ్లే మెయిల్ సుమారు ఒక గంట ఆలస్యం అని కూడా తెలిసింది. బయట వర్షం కురుస్తున్నా, స్టేషన్‌లో ప్రయాణికుల రద్దీ ఎక్కువగానే ఉంది, ప్రయాణికుల గొడవతో చికాకు కలిగించే వెయిటింగ్ రూములోకన్నా సావకాశంగా కాఫీ త్రాగుతూ కూర్చోవచ్చుని రెస్టారెంట్‌లో అడుగుపెట్టగానే నా కోసమే ఎదురు చూస్తున్న అసిస్టెంట్ సుబ్బారావు నన్నుచూచి పలకరించాడు. వెళ్ళి ఎదురుగా కూర్చున్నాను కాఫీకి ఆర్డరిచ్చాను. కొంతసేపు ఇద్దరం ఏమీ మాట్లాడలేదు

"ఇంతకీ సేట్ ఏమన్నాడు?" నా మౌనాన్ని ఛేదిస్తూ అడిగాడు సుబ్బారావు.

"ఊఁ! అతన్ని ఒప్పించడానికి చాలా కష్టపడవలసి వచ్చింది రెండు మూడు రోజుల్లో తప్పకుండా సర్దుబాటు చేస్తాను అని మాట ఇచ్చాడు. నిన్ను ఇక్కడ ఉండిపొమ్మంటున్నది నువ్వువచ్చేటప్పుడు తీసుకొని వస్తావనే" అన్నాను సర్వర్ తీసుకొని వచ్చిన కాఫీని మెల్లగా త్రాగుతూ.

"అయితే అతను మొదట నిరాకరించడానికి కారణం సినిమా 'కథ'ను గురించే అనుకుంటాను" అన్నాడు సుబ్బారావు కాని నేనేమీ మాట్లాడకుండా 'అయివుండవచ్చు'నన్నట్టు తల ఆడించాను.

ఇంతలో ఆలస్యంగా వస్తుందన్న రైలు కొంచెం ముందుగానే రావచ్చుననీ, కాని గూడూరుకి అవతల వర్షాలకి రైలుపట్టాలు కొన్ని తప్పిపోయినట్టు వార్త తెలిసిందనీ, మెయిలు మద్రాసుకి చేరుకునేటప్పటికి ఎంత ఆలస్యం అవుతుందో చెప్పలేమనీ మైకులో రైల్వే అధికారులు చేసిన ప్రకటన విని, సుబ్బారావు నన్ను ప్రొద్దునే జి. టి లో వెళ్ళమని సలహా ఇవ్వబోయాడు. కాని నేను వినిపించుకోకుండా బయటికివచ్చి ఫ్లాట్‌ఫారంమీద నిల్చున్నాను రైలు కోసం ఎదురు చూస్తూ.

"సుబ్బారావ్, సేట్ నాకు మాట ఇచ్చాడు. కాని నేను వెళ్ళిపోయినట్టు తెలిస్తే, ఇంకొంత ఆలస్యం చేస్తాడేమో. ఎలాగైనా వారం రోజులలో డబ్బుతో సహా మద్రాసులో కలుసుకుంటానని ఆశిస్తున్నాను" అన్నాను ఫ్లాట్‌ఫారంమీదికివచ్చి ఆగిన రైల్లో నా కంపార్టుమెంటుని వెతికి చూసుకుని కూర్చున్నాను.

"మీరేమీ దిగులు పడకండి. అదంతా నేను సవ్యంగానే చేసికొనివస్తాను" అని సుబ్బారావు ఇంకా ఏదో చెప్పబోతూండగా రైలు కదిలింది.

కంపార్టుమెంటులో ముసుగుతన్ని పడుకునిఉన్న మరొక ప్రయాణికుడు తప్ప, ఇంకెవరూ అందులో లేనందుకు కొంచెం సంతోషించాను బెడ్డింగు విప్పటానికి బద్ధకంవేసి బెర్తుమీదే కిటికీ దగ్గరగా కూర్చుని సిగరెట్టు వెలిగించి క్రమ క్రమంగా దూరమైపోతూన్న స్టేషన్ని మిణుగురు పురుగుల్లాగ వెలుగుతూఉన్న దీపాలను చూస్తూ, ఆలోచించడం మొదలుపెట్టాను

ఇప్పుడు బెజవాడ ఒక ముఖ్యమైన పనికోసం రావలసి వచ్చింది ఇంతవరకూ దరిదాపు నేను తీసిన సినిమాలు అన్నిటికీ పెట్టుబడి పెట్టిన సేట్ హీరాలాల్ ఎందుకనో ప్రస్తుతం నేను తీద్దామనుకుంటూన్న సినిమాకి డబ్బు ఇవ్వడానికి నిరాకరించాడు. కాని నేను స్వయంగా కలుసుకుని బలవంతం చేయడంవల్ల ఒప్పుకున్నాడు. బహుశ తీయబోయే 'కథ' విషాదాంతంగా ఉండటంవల్ల, విజయవంతమవదని భయపడి వుంటాడని సుబ్బారావు తన మాటల్లో సూచించాడు, తను కూడా సేట్ అభిప్రాయంతో ఏకీభవిస్తున్నట్టుగా. కాని నాకు మాత్రం ఎందుచేతనో ఈ 'కథ'నే సినిమాగా తీయాలని ఎక్కువ ఇష్టంగా ఉండేది మొదట నుంచీ కూడా. నిజానికి అది నా జీవితకథతో ఎక్కువగా సంబంధం కలిగిఉంది అనటానికి సందేహంలేదు. ఈ సినిమా వ్యవహారాల్లో దిగడం కూడా చిత్రంగా జరిగింది. రాధ ఆనాడు సహాయం చేయక పోయినట్లయితే నా జీవితం ఇంకేవిధంగా ఉండేదో చెప్పలేను.

బుద్ధితెలిసీ తెలియని వయస్సులోనే తల్లీ తండ్రీ మరణించటంవల్లా, మేనమామతప్ప వేరే బంధువులు ఎవరూ లేకపోవటంవల్లా ఆ ఇంట్లో అడుగుపెట్టినప్పుడు మొదట్లో గుర్తుపట్టలేక ఈ కొత్తవాళ్లెవరా అన్నట్టు చూసింది రాధ.

"బావని అప్పుడే మర్చిపోయావా?" అని తనికి గుర్తు చేస్తూ అత్తయ్య నన్ను పలకరించినపుడు "రా" విశ్వంబావా! అంటూ నా చేయిపట్టుకొని లోపలికి తీసుకొనివెళ్ళి ఎన్నో విషయాలు అడిగింది చనువుగా. నేను సిగ్గుపడటం చూసి ఎగతాళి కూడా చేసింది.

"సిగ్గుకి మీ అత్తయ్యనే పోలాడు, పాపం విసిగించకే!" అంటూ అత్తయ్య లోపలికి ప్రవేశించటంతో కొంచెం విముక్తి కలిగింది. అప్పటివరకూ రాధ ప్రశ్నలకి ఉక్కిరి బిక్కిరి అయిననాకు.

రాధ నాతో ఎంత చనువుగా ఉంటూన్నప్పటికీ ఎందుకో ధైర్యంగా మాట్లాడలేకపోయేవాడిని. ఎన్నో సార్లు నేనంటే ఎటువంటి అభిప్రాయమో అడిగి తెలుసుకుందామని అనుకున్నానుకాని సాహసించి అడుగలేకపోయేవాడిని నాలోని ఈబలహీనతే రాధని నాకు కాకుండా చేసింది చివరకు.

మామయ్య బయటివూర్లకు పనిమీదవెళ్ళవలసి ఉండటంవల్ల తరచు ఇంట్లో వుండటం పడేది కాదు మొదటి రోజుల్లో నేనంటే ఆదరణ చూపిన అత్తయ్య రాను రాను తర్వాత ఎందుకో విసుక్కోవడం గమనించాను. మామయ్య ఇంట్లో వుండటం తటస్థపడినప్పుడల్లా నేను బాగా చదువుకోవడం లేదనేది అప్పుడప్పుడు ఫిర్యాదు చేయడం కూడా వినేవాడిని. ఎప్పుడూ రాధను గురించే ఆలోచిస్తూ, చదువుమీద శ్రద్ధ వహించలేకపోయేవాడిని. స్కూల్ ఫైనల్ చేరుకునేలోగా రెండు మూడు దండయాత్రలు చేశాను కూడా.

"స్కూలు ఫైనల్‌కి వచ్చిన మొదటి రోజుల్లో సంబంధం చూడమని అత్తయ్య అప్పుడప్పుడు పోరు పెట్టడంవల్ల మామయ్య రాధకి పెళ్ళి చేసే యత్నంలో ఉన్నాడని తెలిసింది. అప్పటికే రెండు మూడు సంబంధాలు చూశారు కాని అత్తయ్యకి ఇష్టంలేకపోవడంవల్ల వదులుకోవలసి వచ్చింది

"పోనీ మేనరికం చేసుకోగూడదా? అని పొరుగింటి రమణమ్మగారు పెరట్లో పిట్టగోడ దగ్గర కలుసుకున్నప్పుడల్లా సలహా ఇచ్చినప్పుడు·

"ఒక్కగాను ఒక్క కూతురు అచ్చటా ముచ్చటా తీర్చుకోవద్దంటావమ్మా!" మూతి వంకరగా పెడుతూ ఇచ్చే జవాబు విన్నప్పుడు, నాలో నేనే మధనపడేవాడిని కాని పైకి ఏమీ అనలేకపోయేవాడిని.

పరీక్షలు జరుగుతూ ఉండగా నాతోబాటు ఒకప్పుడు చదువుకుని అప్పటికే కాలేజీలో చదువుతూ ఉన్న కేశవరావుని గురించి మామయ్య నన్ను అడిగినప్పుడు రాధ పెండ్లి అతనితో నిశ్చయం అయిందని తెలిసింది. లోపల ఎంత బాధపడ్డా పైకి కేశవరావుని గురించి మంచిగానే చెప్పా మామయ్యతో. రాధ తనకు పెండ్లి ప్రయత్నాలు జరుగుతున్నాయి అని తెలిసి కూడా నాతో చనువుగా ఉండటం చూసి, ఆమె అభిప్రాయం ఏమిటో అడుగుదామనుకొన్నాను కాని ఎందుకో అడగలేకపోయాను.

పరీక్షా ఫలితాలు తెలిసే రోజునే పెండ్లివారు వచ్చి, ముహూర్తం పెట్టించుకుని వెళ్ళారని తెలుసుకున్నాను. పరీక్ష పోయిందని విని మామయ్య చాలా కోప్పడుతాడనుకున్నాను. కాని పెళ్ళివారిని రైలెక్కించింతర్వాత ఆ రోజునే పైవూరికి వెళ్ళవలసి రావడం వోవిధంగా నా అదృష్టమే అయింది.

పేపరు చేతికి పట్టుకుంటూ, ఇంట్లో అడుగుపెట్టేసరికి రాధ ఒంటరిగా ఉండటం, అత్తయ్య రమణమ్మగారి ఇంటికి వెళ్ళడం, రాధతో ధైర్యంగా మాట్లాడడానికి తగిన అవకాశం కలిగించాయి. ఆనాడు మా ఇద్దరి మధ్యా జరిగిన సంభాషణని ఎన్నటికీ మరువలేను.

గదిలో అడుగుపెడుతూఉండగా అడుగులచప్పుడు విని 'ఎవరూ' అంటూ ఏదో పుస్తకం చదువుకుంటూ మంచంమీద పడుకుని ఉన్న రాధ లేచి కూర్చుంది నన్ను చూసి· నాకు ఏమని మాట్లాడాలో తెలియక కొంతసేపు రాధనే చూస్తూ నిల్చుండిపోయాను. కొంచెం చీకటిగాఉండే ఆ గదిలో ఆమె కళ్ళెందుకో మెరుస్తున్నా యనిపించింది.

"ఏం కావాలి బావా?" రాధ ప్రశ్నకు కొంచెం ఉలిక్కిపడ్డాను. పేపరిద్దామని మాట్లాడకుండా కొంచెం దగ్గిరగా వెళ్ళాను కాని నా కాళ్ళు ఎందుకో కొంచెం వణికాయి.

"ఫలితాలు వచ్చేట్టున్నాయే! ఏముందేమిటి?" అని అడిగింది రాధ నా చేతిలోని పేపరును అందు




# సినిమా కథ

కుంటూ నేనేమి జవాబు చెప్పలేదు. మౌనంగానే పేపరు వోమాటు తిరగేసి "నీ నంబరు ఏమిటి బావా?" అని అడిగింది కొంచెం తలెత్తిచూసి

"పరీక్ష తప్పాను రాధా!" అని ఎలాగో అనగలి గాను

"అయితే మళ్ళీ కడతావా?" పేపరుని తిరిగి ఇచ్చేసింది

"దాని విషయమే ఆలోచిస్తున్నాను రాధా" అన్నాను కాళ్ళు ఎందుకో తూగుతున్నట్లనిపిస్తే మంచం దగ్గిరగాఉన్న చిన్న బల్లమీద కూర్చున్నాను పేపరును మడిచి జేబులో పెట్టుకుంటూ.

"ఆలోచించడానికి ఏముంది? మళ్ళీ చదవడ మేగా! రాధ కొంచెం విసుగు కనపరచింది

"చదవాలని ఇష్టంలేదు" అన్నాను తలవంచు కుని నేలను చూస్తూనే

"చదవకుండా ఏం చేద్దామని నీ ఉద్దేశం" ఈ మాటలు కొంచెం బిగ్గరగానే వచ్చాయి రాధ గొంతు కలో చికాకుతో కోపం కలిసింది

"రాధా నేను పడే వేదన నీకు తెలుసుంటే నువ్విలా మాట్లాడవు! ఎదుటివారికి నేనంటే ఎటు వంటి అభిప్రాయమో ధైర్యంచేసి అడుగలేక వో విల వైన వస్తువుని పోగొట్టుకొన్నాను ఇప్పుడు కూడా నిన్ను నాకొక సహాయం చెయ్యమని అడగానికి వచ్చాను కాని ఎలా అడగాలో తెలియడం లేదు" అన్నాను నేను కూడా గొంతుక కొంచెం పెద్దదిగా చేస్తూ అప్పుడు అంత గట్టిగా మాట్లాడగల గడం ఆశ్చర్యపడవలసినవిషయమే అని ఒకసారి అనుకున్నాను

"నే చేయగలిగిన సహాయం ఏమిటిబావా?" రాధ ముఖంమీద పడి చికాకు పెడుతున్న ముంగురు లను వెనక్కు నెట్టుతూ లేచి నిల్చుంది.

"ఈ వూరు విడిచి ఎక్కడికేనావెళ్ళి ఉద్యోగం చేసుకుందామని ఉంది" ఇంకా చెప్పబోతూండగా రాధ నా మాటలకుఅడ్డంవచ్చి "అంతగా ఉద్యోగంలో చేరాలనుకుంటే మామయ్య వచ్చిన తర్వాత ఆలో చించవచ్చు ఇంతమాత్రానికి వూరువిడిచి వెళ్ళవలసి నంత అగత్యం ఏమి వచ్చింది బావా?" అంది నావైపు చూసి, అసలే పెద్దవయిన కళ్ళు మరీ పెద్దవిగా చేస్తూ నేను దీనికి ఏమీ సమాధానం చెప్పలేక పోయాను "రాధా! నిన్ను ఒకటి అడుగుతాను చెప్తావా?" అని కొంచెం సందేహంగా అడిగాను

"ఏమిటి!" అన్నట్టు చూసింది నావైపు

"మరి మ" అని ఏదో చెప్పబోయి "ఈ సంబంధం అంటే నీ కిష్టమేనా రాధా?" అని అడి గాను. నా గొంతుక కొంచెం తడబడింది.

"పో! బావా నువ్వు కూడా నన్ను వేళాకోళం పెడు తున్నావు" అంటూ ముఖానికి చేతులు కప్పేసుకుంటూ మంచంమీదికి వ్రాలిపోయింది సిగ్గుతో

"అందుకే రాధా! నేను ఈ వూరునుండి వెళ్ళి పోవాలని నిశ్చయించుకోడానికి కారణం" అన్నాను బరువుగా.

'అంటే' రాధ ఈమాటు ఆశ్చర్యంగా నావైపు చూసింది. నేను ఆమె చూపులకి తట్టుకోలేక తల వంచుకొనే,

"అవును రాధా! నీకు ఇప్పుడు చెప్పి నీ మనస్సుకి కష్టం కలిగించదలచుకోలేదు. మరి నువ్వు నాకు సహాయం చేస్తానని మాటివ్వగలవా" సంభాషణ ధోరణి మార్చే ఉద్దేశంతో అడిగాను.

"అదేమిటో అడుగు బావా! నే చేయగలిగిందేదైనా వుంటేతప్పకుండా చేస్తాను"అని రాధమాట ఇవ్వగానే, అప్పుడప్పుడు మామయ్య ఇచ్చిన చిల్లర పైకం నా ప్రయాణానికి సరిపోతుందనీ, తన దగ్గిర ఏమేనాఉంటే సర్దుబాటు చేయగలదేమోనన్న నా అభిప్రాయాన్ని వివరించి చెప్పాను. రాధ కొంత సేపు ఏమీ మాట్లాడకుండా నావైపే చూస్తూ ఉండిపోయింది ఆమెవైపు సూటిగా చూడలేక బయటికివచ్చి వసారా స్తంభానికి ఆనుకుని శూన్యం లోకి చూస్తూ ఉండిపోయాను.

చేతిలో ఏదో పొట్లంతో రాధ వచ్చి నా భుజం తట్టేసరికి స్తంభానికి ఆనుకునివున్న నేను కొంచెం ఉలిక్కిపడ్డాను.

'ఇంద బావా' ఇప్పుడు నేను ఇవ్వగలిగింది ఇంతే, అంటూ రాధ చేతిలో పెట్టిన పొట్లంను విప్పగా చిన్నపిల్లలు వేసుకునే బంగారపు మురుగులుచూసి ఆశ్చర్యంగా రాధ వైపుచూసి ఏదో అడగబోయాను. కాని

"దీన్ని గురించి నీకేమీ బెంగ అక్కరలేదు.బావా! అవి నా చిన్నప్పుడు చేయించుకొన్నవి. అమ్మ ఎప్పుడో మర్చిపోయి ఉంటుంది! పెట్టె అడుగున కనిపిస్తే తీసుకుని వచ్చాను

నిన్నెలా అభినందించాలో తెలియకుండా ఉంది రాధా! ఈ ఇంట్లో అడుగుపెట్టిన రోజున కూడా నువ్వే నన్ను ఆహ్వానించావు ఇప్పుడు నీ సహాయంతోనే వెళ్ళిపోతున్నాను ఎప్పటికైనా బావ సహాయం నీకు అవసరం కలిగినప్పుడు నేను ఎక్కడఉన్నా సరే నీ దగ్గరకి రావడానికి ప్రయత్నిస్తాను నా సహాయాన్ని నువ్వు కాదనకుండా తీసుకుంటానని మాట ఇవ్వగలవా రాధా" అని ఏదో అర్థరహి తంగా చెప్తుండగా అలాగే బావా అంటూ తల ఆడించి, నేను ఇంటికివచ్చి వెళ్ళినట్టు ఎవరికీ చెప్పొద్దని రాధకి చెప్పి ఆమె ఇచ్చే సమాధానమైనా వినిపించుకోకుండా వెంటనే స్టేషన్‌కి చేరుకున్నాను. రైలు కదలిన తర్వాతకాని నా మనస్సు కుదట పడలేదు

* * *

"బెజవాడ దాటిపోయిందాండీ?" నా ఆలోచనలకి అంతరాయం కలిగిస్తూ ముసుగుతన్ని పడుకుని ఉన్న ప్రయాణికుడు అడిగాడు లేచి కళ్ళు నులుము కుంటూ.

"దాటి చాలాసేపయింది"

"మీరు కూడా మద్రాస్‌కే వెడుతున్నారా?" అతను వేసిన ప్రశ్నకి అవునని జవాబు చెప్పాను, గాలికి కిటికీనుంచి మొహానికి కొట్టిన వాన జల్లుని చేతు లతో తుడవడానికి ప్రయత్నిస్తూ. అతను కూడా ఏమీ మాట్లాడకుండా తన బెర్తుమీద వ్రాలుతూ ఏదో పుస్తకంతీసి చదువుకోసాగాడు. నేను తిరిగి నా ఆలోచనలో మునిగిపోయాను.

* * *

మద్రాసుకి చేరుకోగానే స్టేషన్‌లోనే రంగధామరావుగారిని కలవడం నా అదృష్టమనే చెప్పాలి. అతను మామయ్యగారివూర్లోని ప్లీడరుగారి దూరపు బంధువు అవటంవల్ల నే చెప్పినదంతా విన్న తర్వాత తను కూడా ఒంటరిగానే ఉంటడంవల్ల నన్ను తన దగ్గరే ఉండిపొమ్మన్నాడు ఆయన అప్పటికే పేరు గడించిన సినిమా డైరెక్టరు తరచు నాకు కూడా పని నేర్పుతూ వుండేవారు. అవకాశం కల్పించినప్పుడల్లా, ఆయనకి తృప్తి కలిగించేలాగే పనులను నిర్వహించే వాడిని. కష్టపడి చివరకు సినిమా డైరెక్షన్‌లో కొంత అనుభవాన్ని కూడా త్వరలోనే సంపాదించాను

రంగధామరావుకి వయస్సు' మళ్ళినా త్రాగుడు వదులుకోలేకపోయేవారు. ఒకసారి పరిస్థితిమించి తీవ్రమైన జబ్బుకి దారి తీసింది అప్పుడు ఆయన ఒక సినిమాకి డైరెక్షన్ చేస్తూ ఉన్నారు అది ఆగిపోతుందేమోనని ఆయన బెంగపెట్టుకుంటుండగా, ఆ పనిని నాకు అప్పచెప్పి ఆయన్ని విశ్రాంతి తీసుకోమని చెప్పాను మొదట ఒప్పుకోకపోయినా, తర్వాత ఎందుకనో నాకే అప్పగించారు. ఆ సినిమా విజయవంతం అవడంవల్ల రంగధామరావుగారికి నామీద గురి ఎక్కువైంది. త్వరలోనే నేను స్వయంగా సినిమాలుతీసే అవకాశం కూడా కల్పించారు రంగధామరావుగారు. నన్ను ఒక పెద్ద ప్రొడ్యూసర్‌గాచూసే భాగ్యం లేకుండానే ఒకరోజున ఎక్కువగా వచ్చిన గుండె నొప్పివల్ల మరణించారు ఆయన మరణం నన్ను చాలా కృంగదీసిన మాట వాస్తవం రాధ సహాయం, రంగధామరావుగారి ఆదరణ ఈ రెండే ముఖ్యంగా ప్రస్తుత కథని సినిమాగా తీయాలన్న నా కోరికను బలపరచాయి

*　　　*　　　*

టైమెంత అయిందని తోటి ప్రయాణికుడు వేసిన ప్రశ్నకి కొంచెం ఉలిక్కిపడ్డాను. ఒంటి గంట దాటింది ఎందుకో అంతవరకూ వేగంగా వెళ్తూఉన్న రైలు కొంచెం మెల్లిగా వెళ్ళడం గమనించాను

"అయితే వచ్చేది బిట్రగుంట అయి ఉండాలి" అని అతను తనలో తాను అనుకుంటూ పుస్తకాన్ని పెట్టిలో పెడుతూ తలదగ్గిర వెలుగుతున్న లైటుని ఆర్పి పడుకున్నాడు ఎక్కువగా ఆలోచించడంవల్ల తల బరువుగా ఉన్నట్లనిపిస్తే ప్రక్కవేసుకొని పడుంవాల్చాను. ఎప్పుడు పట్టిందో నాకు తెలీకుండానే నిద్ర పోయాను.

బయట ఎవరో కొందరు ప్రయాణికులు నా కంపార్టుమెంట్‌ముందుగా అరుస్తూ,గట్టిగా మాట్లాడుతూ వెళ్ళడంవల్ల నాకు మెలకువ వచ్చింది అప్పటికే ఆరుగంటలు కావస్తోంది ఆగినది ఏ స్టేషనో చూద్దామని తలుపుకేసి క్రిందికి దిగగానే రైలు ఇంకా బిట్రగుంటలోనే ఉండటం గమనించి ఆశ్చర్యపోయాను.

వాన తుంపరలు కొద్ది కొద్దిగా పడుతున్నాయి ప్రయాణికులు స్టేషన్‌మాస్టర్ గదికి దగ్గిర ఏదో గొడవ చేస్తూ, గట్టిగా అరుస్తున్నారు రైలు ఎప్పటికి కదులుతుందో ఏమో అని గొణుగుకుంటూ నా ముందుగానే ఫ్లాట్‌ఫారంమీద పచార్లు చేస్తున్నారు కొందరు ఏమీ తోచక

స్టేషన్‌మాస్టర్ గదినుంచి దిగులుతో వస్తూ ఉన్న ప్రక్కకంపార్టుమెంటు ప్రయాణికుని పల్కరించి అడుగగా తెలిసింది బెజవాడ స్టేషన్‌లో చెప్పినట్టుగానే రైలు గూడూరువరకే వెళ్ళుతుందనీ, కానీ గూడూరు వెళ్ళడానిక్కూడా ఇంకా అనుమతి రాలేదనీ ఇంకొక రెండు గంటల్లో రావచ్చుననీ కూడా చెప్పాడు ఇంతలో తోటి ప్రయాణికు డొక్కడులేచి దిగి వస్తూ 'సంగతేమిటి' అని అడిగాడు నేను తెల్సుకున్నదంతా వివరంగా చెప్పాను

"అయితే మద్రాసుకు చేరుకునే సూచన లేమేనా ఉన్నాయా?" అని ఆతురతతో అతను అడిగినప్పుడు అతని తొందరపాటుకు నాలో నేనే నవ్వుకున్నాను క్షణం కూడా తీరికలేనట్టుగా త్వరగా ఇంకొక కంపార్టుమెంటు వైపుకి వెళ్ళబోతూన్న వెయిటర్‌ని పిలిచి, కాఫీని తీసుకొని రమ్మన్నాను కాఫీ వచ్చే దాకా ఏమి చేయటానికీ తోచక మళ్ళీ కంపార్టుమెంటులోకి ఎక్కి కూర్చుని గత స్మృతులలో పడిపోయాను

*　　　*

ఎవరికీ చెప్పకుండా నేను ఆవూరినుంచి వచ్చేసినందుకు మా మామయ్య చాలా కోపగించుకొని ఉంటాడని తెలిసి కూడా మద్రాసుకు చేరుకున్నతర్వాత రెండు మూడు ఉత్తరాలు రాశాను కాని వాటికి జవాబు రాలేదు. కనీసం రాధ ఉనికిని అయినా సూచించమని వ్రాసిన దానికి కూడా మౌనంగానే ఉండిపోయాడు మామయ్య నే నేదో చేయరానిపని చేసినట్టు చీదరించుకుంటున్నాడని ఆ వూరునుంచి వచ్చిన కొందరివల్ల తెలిసింది. కాని నేను చేయగలిగినదేమీ లేదని అనుకుంటూండగా వెయిటర్ కాఫీ తీసుకొని వచ్చాడు కాఫీ ముగించి బయటికి వచ్చి ఫ్లాట్‌ఫారంమీద నిల్చున్నాను అప్పటికే బాగా ప్రొద్దెక్కింది. వాన తుంపరలు కూడా ఆగిపోయి సూర్యుడు మెల్లగా మబ్బులలోంచి పైకి రావడానికి ప్రయత్నిస్తున్నాడు. ప్రయాణికుల ముఖాల్లో అదోవిధమైన ఆందోళన, ఆతురత కనిపిస్తోంది స్టేషన్‌మాస్టరు తన రూమునుండి బయటికీ, లోపలికీ తిరుగుతూ ఎప్పుడూ తన్ని అంటిపెట్టుకు తనవెంటే తిరుగుతూఉన్న ప్రయాణికుల ప్రశ్నలకు సమాధానం చెప్తూనే ఉన్నాడు. కాని చాలా అలసిపోయినట్టు కనిపించాడు

ఏమోయి విశ్వం! అంటూ ఎవరో నా భుజం తట్టేవరకూ స్టేషన్‌మాస్టర్ రూమ్ దగ్గిర హడావుడి పడుతున్న ప్రయాణికుల గుంపునే చూస్తూ ఉండిపోయాను

"నన్నింకా గుర్తు పట్టలేదుటోయ్! నేనే శ్రీనివాసరావుని" అన్నాడు నన్ను పలుకరించినతను అతన్ని గుర్తుకు తెచ్చుకొనడానికి ప్రయత్నిస్తుండగానే "మే మెక్కడ జ్ఞాపకం ఉంటాం" ఇప్పుడు ఒక పెద్ద సినిమా ప్రొడ్యూసర్‌వికా!" అన్నాడు కొంచె వ్యంగ్య ధోరణితో నాకు కొంచెం చికాకు వేసింది కాని లేని నవ్వును తెచ్చుకుంటూ, అబ్బే అటువంటిదేమీ లేదోయి నువ్వు చాలా మారిపోయావు అందుకనే మొదట గుర్తు పట్టలేకపోయాను" అన్నాను సన్నగా పీలగాఉండే

(53-వ పేజీ చూడుడు)


నారసింహ లేహ్యం
బంగారుతో చేరినది మేహము, పక్కాక, నిస్సత్తువ వగైరా హరించి బలము రక్తవృద్ధికల్గించును 20 కవ్వీరు 3-8-0 పోస్టేజి రు. 1-1-0
పి. సి. వి. అండ్ కంపెనీ ఆయుర్వేద సమాజం, పెరిదేపి (PO) నెల్లూరుజిల్లా.

పండిత డి గోపాలాచార్యులవారి
జీవామృతం
ఆరోగ్యానికి బలానికి
ఆయుర్వేదాశ్రమం (ప్రైవేట్) లిమిటెడ్ మదరాసు-17

సినిమాపటాలు
మీగు సిని కొగులు గా చేరి, సెలకు మంచి ఆదాయం పొందవలెనన్న చో నేటే మాకు వ్రాయండి. ఉ తిరప్రత్యుత్తరాలు ఇంగ్లీషు లేక హిందీలో వ్రాయవలెను.
BOMBAY FILM SERVICE
(A.M.W.) PHAGWARA (NR)

వైబ్రో


సర్వ గర్భాశయ వ్యాధులను పోగొట్టి, ఆరోగ్యమగు సంతాన మునుకలుగజేయును. అన్నిచోట్ల దొరకును. సీసా 2-8-0
కన్సాలిడేటెడ్ బెజవాడ

# ప్రేమా! - ప్రేమా!

# పెళ్లి! - పెళ్లి!

సులోచన వచ్చిందని తెలిసి, చూట్టానికి వెళ్ళాను నాంపల్లి. "ఏమేవ్! రారా! ఎన్నాళ్ళ కెనాళ్ళకి కల్సుకున్నాం పెళ్ళయిందిటకదూ ? లవ్‌మేరేజా? ఏమిటీ వ్యవహారం" అంటూ గబగబ ప్రశ్నించింది ఒక్కసారిగా సులోచన. "అ—లవ్వూ లేదు గివ్వూలేదు గానీ—మామూలు మేరేజీలే ఇప్పుడిప్పుడే మొదలు పెట్టున్నాం లవ్వు వగైరానూ" అంటూ అది అడిగిందానికి సమాధానంచెప్పి—ఈ "ప్రేమలూ — పెళ్ళిళ్ళూగురించి కొంతసేపు వాదోపవాదాలైన అనంతరం కాస్సేపు "పిచ్చాపాటీ' కబుర్లు చెప్పుకున్నాం! తర్వాత కొద్దిసేపుండి వచ్చేశాను

అసలు సులోచనేకాదు, ఈ రోజుల్లో ఎక్కడ చూసినా, ఎక్కడవిన్నా, ఎవరినోటనైనాసరే ప్రేమా ప్రేమించుకోవటం, ప్రేమ—ప్రేమ—ప్రేమా ఈ మాటకి అంతులేకుండా పోతోంది. అనగా అనగా యీ మాటకున్న (పవిత్రమైన) విలువ తగ్గుతోంది కూడా! నేటి ప్రేమలు చూస్తూంటే (కాలేజీల్లోకానీ, మరెక్కడైనాకానీ) 'మేం ప్రేమించుకున్నాం-పెండ్లిచేసుకోబోతున్నాం-చేసుకున్నాం—చేసుకుంటాం, అంటూ ఒకటే గొడవలు. పోనీ అనుకున్నా పర్వాలేదు. తర్వాత జరిగేది (భవిష్యత్— జీవనానికి బాట వేసుకునేముందు) కొంచెం నిశితంగా నిర్ధారణ చేసుకు మరీ ముందుకు దూకాలి అంతేకానీ, ఏదో "ప్రేమించేశాం, పెళ్ళాడేస్తాం" అంటే తర్వాతి ప్రతిబంధకాలు ఎన్నో మరి ఎదుర్కొనేందుకు, ఇదేం కూరగాయలబేరంకాదు కొందరు ధైర్యం మీద నిలబడి, ప్రేమించి పెండ్లిచేసుకున్నాక—వారి జీవితం చిగురించనూవచ్చు—లేక, కొందరి జీవితం ఎడారిలో ఎండనూ వచ్చు. ఇంతకీ ఎవరి తలవ్రాత ప్రకారం అలా జరుగకమానదు

ఇటు తలితండ్రులుగానీ, నేటి యువతీ యువకులుగానీ తమ జీవితాలకు— తమ నూరేళ్ళపంటకూ ఎంతగానో ఆలోచించి—ఎన్నో 'మంచి చెడు'లను చూసి నిర్ణయించుకున్నప్పుడు ఆ భావి జీవిత బంధం-పవిత్రంగా ఉంటుందనే ఆశే మరి. ఆపైన ఏదైన జరిగే దానికి వీరు బాధ్యులా? అలాంటప్పుడు మన ఖర్మను మనం నిందించుకోక తప్పదు అలా అని— తొందరపడి—సందర్భం కలసివచ్చిందిగదా అని ప్రేమించుకుని, ఆ తర్వాత 'ఖర్మ' అనుకునేకన్నా—మన జీవితాన్ని—మన బతుకుబాటను నిర్ణయించుకునేముందు—మనం అన్ని విధాలా ఆలోచించుకోవాలి. ఆపైన విధి లిఖించిన దానికి మనం బద్ధులమే మరి! దైవ నిర్ణయాన్ని కాదనగలమా? ఏమో మరి!

ఏదో ఇదంతా మన ప్రయోజకత్వంతప్ప మరేం కాదు అనుకుంటాం, కొన్ని సందర్భాలలో. ఈనాడు వివాహాలంటే నూటికి నూరుపాళ్ళూ—విత్తులుండాలి దండిగా చేతినిండా (అంటే డబ్బు) నేడు ఎన్ని బిల్లులొచ్చినా కట్నాల సమస్య—సమస్యగానే వుండిపోయింది. దీనివల్ల మరింత 'బ్లాక్‌మార్కెట్' పెరిగిందేగానీ, మరేలాభం కలగలేదు. ఏదో కొద్దో గొప్పో యిచ్చుకునే తాహతున్నా—ఆ తాహతుకు తగ్గ సంబంధం తటస్థపడదు మరి ఆమధ్య దూరపు బంధు వొకాయన—వచ్చారు మా యింటికి—బాగా పెద్దఉద్యోగమేచేసి, సంపాదించాడు కొంత ఆస్తీ పాస్తీను. ఆస్తికితగ్గ మందీ(జనం) ఉన్నారు ఇంట్లో తింటానికి. పోతే ఆయన చేసిన తెలివైన పనల్లా (అదే అందర్నీ) స్వపర భేదాలు లేకుండా—విద్యాబుద్ధులు గరిపించటం. వారి పుత్రికకు సంబంధాలు

**పి. కనకదుర్గ**

వెతుకుటకై వచ్చారన్నమాట. "ఏవైనా చక్కని సంబంధాలుంటే చెప్ప"మని అడిగాడు ఆయన

"మీకు ఏమాదిరిగా వుండాలో చెప్తే ఆ తర్వాత నాకు తెల్సినవి చెప్తా"నన్నారు మావారు. సరే తప్పదన్నట్లుగా—నసుగుతూ—నాన్చుతూ యీవిధంగా చెప్పాడు. అవి ఇవి. వరుని వయస్సు (ఇది ముఖ్యం మరి) 30—32 ఏళ్ళకు మించకూడదు (మించితే ముసలివాడు—మించకపోతే కూతురికన్న చిన్నవాడూ అవుతాడు మరి) కనీసం ఏ ఇంజనీరో, లేదా డాక్టరో, ప్లీడరో, అదీ ఇదీకాకపోతే ఏ కలెక్టరో, అసిస్టెంట్ సెక్రెటరీనో అయివుండాలిట పిల్లవాడు పుష్టిగానూ, అందంగా, ఆరోగ్యంగానూ, ఒడ్డూ పొడుగూ కలిగి వుండాలి (ఆస్తిపాస్తులు సరేసరికదా) ఒక కారుంటే మరీ మంచిదే! ఇవి ప్రస్తుతం ఆయనగారికున్న కోరికలు

ఇహ మా వారన్నారు "నాకు తెల్సిన జూ" ఇంజనీరున్నాడు ఆస్తిమాత్రంలేదు పిల్లవాడు బాగా వుంటాడు" అని

"అబ్బే! అంతలా అయితే ఎలా" అంటూ నసిగాడు

సరే మరికొన్ని చెప్పారు. "మా సెక్రటేరియట్‌లోనే సూపరింటెండెంట్, పర్మనెంటు నెలకు రెండువందల ఏభై జీతం. ఇది ఒకటి—ఒక ఆఫీసరు. పిల్లవాడు అంత బాగుండడు. మరి ఓ మోస్తరుగా వుంటాడు ఇవే నాకు తెల్సినవి" అన్నారు మావారు

"సూపర్నెంటు ఏమిటోయ్! రేపు అమ్మాయి కాపరానికొస్తే యీ రెండొందలూ పది హేను రోజులకైనా వస్తాయా? ఈ మండిపోతున్న కరువు రోజుల్లో—అందులోనూ హైద్రాబాద్‌లో. సరే పోతే ఆఫీసరుకి ఆస్తీ లేదూ, అందమూలేదు ఇవే నటోయ్ నీకు తెలిసినవి?" అంటూ పెద్ద పోజు విసిరాడు.

"ఇంతకీ ఇన్ని అడుగుతున్నారుగదా, మరి మీ అమ్మాయి చాలా అందంగా అప్సరసలా వుంటుందా! చదువేమిటీ?" అంటూ అడిగారు మావారు.

"పిల్ల అంత అందంగా లేకపోయినా కళగానే వుంటుంది. బి. ఎస్ సి. చదివిందట అయిదువేలు ఇచ్చేస్తా దానికని కేటాయించినది ఏమైనా చేసుకోమను అన్నాడాయన

కోరికలు ఏలా వున్నాయో చూడగా! కొంత చేతులారా చేసుకుంటున్నాడనిపించింది చెప్పొద్దూ! ముద్దు ముద్దుగా ముప్పై ఏళ్ళున్నా యింకా వివాహానికి తొందరపడకపోవటం విచిత్రమే మరి. ఇహ చదువుకున్నందుకు—తన సరిసమానస్తుడు పనికిరాడు. పైన ఎన్ని ఎక్కువ డిగ్రీలుంటే అంత మంచిది. పోతే చివరికి చదువుకుంది కాబట్టి ఏ ఉద్యోగమో చూసుకుంటుంది! అవ్వైన వంటరిగా ఎన్నాళ్ళని?.....

నేటి యువతీమణులే తమకన్న తక్కువ చదువు, చదువుకున్నవాణ్ణి నిరసిస్తారు. పోనీ తమతో సమాన డిగ్రీలున్నా పనికిరావటంలేదు. ఇల్లాంటి పరిస్థితిలో నేడు ఆడ పిల్లల వివాహ సమస్యలు విషమ సమస్యలే అవుతున్నాయి. కానీ అందరూ అలా ఉంటారా స్త్రీ ముఖ్యంగా ఎంత చదువుకున్నా వివాహం లేకుండా వంటరిగా జీవించలేదు! ఒకవేళ జీవించగలిగిన అవకాశమూ, పట్టుదలా వున్నాగానీ—అలా — నిశ్చింతగా వుండనివ్వదు లోకం ప్రతీ స్త్రీ, ప్రతి పురుషుడు కూడా ఆమెను ఓ పట్టాన బ్రతకనిస్తారా? ఎన్ని అబాండాలు వేస్తారో! అన్ని మాటలను సహించి, సమాజాన్ని ఎదిరించి, ఎంతకాలమని మనగలదు ఆ మగువ తల్లి తండ్రులు ఎల్లకాలం శాశ్వతమా? అన్నదమ్ములు ఆదరిస్తారా? అన్ని విధాలా ఆరళ్లే ఆతర్వాత ఇన్ని కబుర్లు చెప్పిన ఇంతులపాట్లు ఆ భగవంతునికే ఎరుక

అసలు అమ్మాయిలందరూ కాస్తో కూస్తో చదువుకోవటం మొదలెట్టాకనే నేడు ఈ విపరీతాలకు మూలాధారమైందేమో! కాలంతోపాటూ, అభిప్రాయాలూ, ఆదర్శాలూ, ఆశలూ, ఆవేశాలూ అంటూ బయల్దేరి రానురాను శృతిమించుతుందేమో అన్నట్లు తయారవుతోంది నాడూ, అతివలు కొందరు స్వతహాగా స్వతంత్రులయి—స్వబుద్ధితో—(అదే సావిత్రి—శకుంతల—దమయంతి—రుక్మిణి — సంయుక్త మొదలగువారు) మంచి మంచి పురుషులనే ఎన్నుకుని, ఎన్ని కష్టాలకైనాఓర్చి—తుదకు సుఖాంతం చేసుకున్నారు నేటి యువతులలో ఆమాత్రం ధైర్యసాహసాలు ఎంతమందికున్నాయి?

- పోసి—ప్రేమంటూ పీకలమీదకి తెచ్చుకుని, ఏలాగో తంటాలుపడి—ఆ ప్రేమకి సాఫల్యం చేకూర్చుకుని కాస్త కుదుటపడేసరికి ఏవో భేదాభిప్రాయాలే వచ్చి, విడాకులదాకా వస్తే—? అప్పుడు ఆ అమ్మాయి గతి ఏమిటి? ఆమెను యీ సంఘం ఆదరిస్తుందా? కనీసం సానుభూతన్నా చూపదు. ఆలాంటప్పుడు ఆమె గతి కుక్కలుకూడా పడవు ఇవన్నీ కూడా అనర్థాలు వస్తేనే . !సుఖంగావుంటే, ఏలా వివాహమాడినా తంటాలేదు అలా కానప్పుడే వచ్చేదంతా 'ఖర్మ' అనుకోవటం అందులో విద్యా విహీన అయినప్పుడు మరీ కష్టం! అసలు చదువుకున్నందుకు అదే ధీమా వుంటుందనుకుంటూ మూడొంతులు! "ఏం నా పొట్ట నేను—పోషించుకోగల శక్తి నాకుంది" అనే అహం తప్పక ఆడదానికి వుంటుంది. ప్రతీవారూ విద్యాబుద్ధులు నేర్వటం గొప్ప విషయం కానీ ఆ విద్యాకు తగ్గట్టు—వినయవిధేయతలు కల్గివుండీ, తమ జీవితాలను కూడా సక్రమంగా సాగిపోయేట్లుగా చూచుకోకల్గిననాడు, సుఖశాంతులకు నిలయమవుతుంది వారి జీవితం ఆలా కానినాడు వారి బ్రతుకు నిస్సారంకాక మరేమవుతుంది? . . .

ఏ స్త్రీ అయినాసరే, అధికారం వుంది గదా అనీ, భర్త ఆలుసు తీసుకుని, శృతిమించి ప్రవర్తించ కూడదు అందుకే "ఆలూ మగల తగువు అద్దం మీది ఆవగింజ"లా వుండాలిగాని, 'గోరంతది కొండంత'యి —చిలికి చిలికి గాలివానలా తయారవ కూడదు అంతదాకా తెచ్చుకోకుండా—చిన్న చిన్న కలహాలే అయినప్పటికీ, ఆడదికూడా రెచ్చిపోక తానైనా తగ్గి తన సంసారాన్ని చక్కదిద్దుకో గల గాలి

అణకుమవగావుందిగదా అని అణగదొక్కకుండా మగవాడు వుండాలి అసలు భార్యా భర్తలిరువురూ కాడెద్దులలాంటివారు పోతే కొంచెం భరించాల్సిన బాధ్యత గలవాడు భర్త కాబట్టి ఎప్పుడూ వోకమెట్టు ఎక్కువగానే జాగ్రత్తగా వుండాలి "ఆ! నేను వివాహమే చేసుకోను—నాకేం తక్కువ—హాయిగా ఉద్యోగం చేసుకు బ్రతకగలను"—అనిఅందరూ ఆలాగే అనుకుంటే యిహ యీ ప్రపంచంలో సృష్టి ఎలాగా అనిపించదూ? ఇంతకీ నుదుట వ్రాసిన వ్రాత తప్పించుట ఎవరితరంకాదు ఆలా జరుగకా మానదు కానీ ఆ అవకాశాలులేక, కళ్యాణగీత రాకనూ, ప్రస్తుతానికి అనుకునే మాటలేకానీ, నిజంగా పురుషుని పరస్పర సహకారం అవసరంలేక కాదు పురుషుని బలం లేక ఏ స్త్రీ జీవించలేదు ఆడది అబలే కానీ సబలకాదు, బలానికి చూసినా!

కోరికలు కూడా తమకు తగ్గట్టుగా చూసుకుని, హాయిగా వుండేట్లు మనం మన ప్రయత్నం చేయ కల్గిననాడు—అంతకంటే అదృష్టమే పట్టవచ్చును! ఎవరి అదృష్టమేలావుంటుందో? శక్తికి మించిన కోరికలు పనికిరావు! మానవప్రయత్నం చేసేవరకూ చేయాలి మరి! . అందనివాటికోసం ఆశించిన ప్రయోజనం, అందని ద్రాక్షపళ్ళుసామెతే అవుతుంది! ఇంతకీ అందరూ అలా వుంటారనికాదు—వున్న కొందరికే ఇది! ఆశించిన ఆశలు ఫలించినప్పుడు ఆ ఆనందానికి అవధులే లేవు! ★


ఇంటిల్లిపాదికి ఆనందం చేకూర్చే

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

తప్పక చదవండి!






నల్ జల్ గూడు ఔషధములకు ఒక టవునుకు ఒ: సాకిస్టును ఆహ్వానించెదము.







## దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

**19-4-1961 బుధవారము మొదలు**
**25-4-1961 మంగళవారము వరకు**

### మేషం :

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

ఈ వారం మీకు కీర్తివంతమైన సమయం. మొదట్లో ఇంతకుముందు అనుభవంలేని విషయాలలో సందేహాలు వచ్చినా, నేర్పుతో పరిష్కరించుకో గలుగుతారు. పెద్ద మనుష్యులతో సహవాసం చేస్తారు. దుబారా ఖర్చులు క్రమంగా తగ్గుతవి. క్రొత్తగా పెట్టుబడి పెట్టవలసిన పనులు సులభంగా జరుగుతవి. మీ ఆరోగ్యం బాగుంటుంది. వ్యవహార రంగంలో అనుకూలమైన కాలమే. కాని, ముందు కొంచెం కంగారు పడుతూ ఉంటారు. ధనాదాయం బాగుంటుంది. అధికారులతో మాట్లాడే సందర్భంలో జ్ఞాపకంతోను, నిబ్బరంతోను ఉండటం అవసరం. పిల్లల ఆరోగ్యం బాగుండక పోవటంవల్ల అశాంతి కలుగవచ్చు 23, 24 తేదులలో గౌరవప్రాప్తి, బంధు దర్శనం, శుభ సంతోష ఖర్చు.

* * *

### వృషభం :

**(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)**

ముఖ్యంగా గౌరవంకోసం పాటుపడవలసిన సమయం. బంధు మిత్రులకు మీమీద సందేహాలను రేకెత్తించే మనుష్యులు ఉంటారు కోర్టు కచ్చేరిలలో ఇంతకుముందు కనుపిస్తున్న ప్రతిబంధకాలు తొలగి మార్గం అనుకూలంగా ఉంటుంది ఆదాయము, దానితోపాటు ఖర్చులు విశేషంగానే ఉంటవి. కుటుంబ సంబంధమైన అసంతృప్తి తొలగిపోయి నెమ్మదిగా ఉండగలుగుతారు. ప్రయాణ కార్యక్రమాలలో ఖర్చులు విశేషంగా ఉంటవి. ఇంతకుముందు మీతో పోటీ చేస్తున్న మనుష్యులు క్రమక్రమంగా తొలగిపోతారు. వృత్తి వ్యాపారాలలో వృద్ధికరమైన సమయం. ముఖ్యమైన వస్తువులు గాని, కాగితాలు గాని సమయంలో లభించక బాధపడవలసి వస్తుంది. 19, 20 లలో శుభకార్యాలు, ఇతరుల నిమిత్తం శ్రమ, ధర్మ సందేహాలు.

* * *

### మిధునం :

**(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

మిమ్ములను మీరే నమ్మలేని సమయం పనుల నుంచి విరమించుకోలేరు. చురుకుగా ముందుకు సాగటానికి పరిస్థితులు కలిసిరావు బంధువుల వల్ల ఖర్చులు పెరుగుతవి. వృత్తి ఉద్యోగాలలో గౌరవం లభిస్తుంది. సంఘ కార్యాలలో ఎటు మాట్లాడటానికి అవకాశంలేని స్థితిలో శ్రమపడి మాట దక్కించుకో గలుగుతారు ఉష్ణ శైత్య సంబంధమైన అనారోగ్యం చేయుగల అవకాశాలున్నవి. మీ మాటను అనుసరించి గౌరవించే మనుష్యులు లభిస్తారు. సాధ్యమైనంతవరకూ ఇతరుల మాటను నమ్మి మీ బాధ్యతలను నిర్లక్ష్యం చేయవద్దు తలవని తలంపుగా ఖర్చులు వచ్చి పడుతవి కుటుంబంలోని వారి ఆరోగ్యం బాగుండదు. 22, 23 లలో శుభ, లాభవార్తలు. శ్రమవల్ల కార్యసిద్ధి, గౌరవం.

> **గ్రహస్థితి**
>
> మేషంలో సూర్యుడు, మిధున కటకాలలో అంగారకుడు, సింహంలో రాహువు, మకరంలో గురు శనులు, కుంభంలో కేతువు, మీనంలో శుక్రుడు, మీన మేషాలలో బుధుడు, వృషభ, మిధున, కటక, సింహాలలో చంద్రుడు.

* * *

### కర్కాటకం :

**(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)**

వృత్తి ఉద్యోగాలలో తోటివారు మిమ్ములను చిన్నచూపు చూస్తున్నా మీ శక్తి సామర్థ్యాలతో స్థానాన్ని నిలుపుకో గలుగుతారు. స్నేహితుల నిష్కారణ ప్రసంగాలను లెక్కపెట్టుకోవద్దు. కుటుంబంలోనివారి సంతృప్తికోసం కార్యభారం పెంచుకోవలసి వస్తుంది. విలువగల వస్తువులు కొంటారు. పుణ్య కార్యాలు అనుకూలిస్తవి అధికారులతో మీకు గల లావాదేవీలలో కొద్ది మార్పులు రాగల అవకాశాలున్నవి. ప్రతి పనీ ఖర్చుతో నెరవేరుతుంది బంధుమిత్రుల ప్రేరేపణవల్ల మీ నిరుత్సాహం తొలగిపోయి నూతన ప్రయత్నాలలో దిగ గలుగుతారు. ప్రయాణాలలో సుఖం తక్కువ. 20, 21 లలో సంచారము, శ్రమ, వృధా ఖర్చు.

* * *

### సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

దైవబలంతో అన్నివిధాలా ఉన్నత స్థితిని పొందగలుగుతారు. రాజకీయ వ్యవహారాలలో మీ మాటకు ప్రాధాన్యత లభిస్తుంది. అనేకమంది మిమ్ములను అనుసరించి నడుచుకుంటారు కుటుంబ శుభ కార్యాలు నెరవేరుతవి. ఆస్తి వృద్ధి ప్రయత్నాలలో మంచి సలహా చెప్పి సహాయం చేసేవారు లభిస్తారు సాధారణంగా మీ క్రింద పనిచేసే వారితో తగాదాలు వచ్చి నిదానంగా సర్దుబాటు అవుతవి. కుటుంబంలోనివారి ఆరోగ్యం గురించి జాగ్రత్తగా ఉండవలసినసమయం. దూరమందున్న బంధుమిత్రులవద్ద నుంచి ఎదురు చూస్తున్న వార్తలు రాకపోవచ్చు 19, 20 లలో ధనలాభం, కోర్టు కచేరిలలో అనుకూలత

* * *

### కన్య :

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా**

ప్రధానంగా వృత్తికిసంబంధించిన, అనేక ప్రతిబంధకాలు తొలగిపోతవి. మాట సహాయము ధన సహాయము లభిస్తుంది లోగడ మీవల్ల జరిగిన పొరబాట్లను సవరించుకుని నిలబడ గలుగతారు చిన్న చిన్న ప్రయాణాలు తరుచు చేయవలసి వస్తుంది దుబారా ఖర్చులనుండి బయటపడ గలుగుతారు తలవని తలంపుగా ఒకానొక ఆప్తమిత్రునితో అభిప్రాయ భేదాలు రాగల అవకాశాలున్నవి. ధనాదాయం మామూలుగా ఉంటుంది. బంధువర్గంలో మంచి పేరు పొందగలుగుతారు. మీకు ఇంతకుముందు అనుభవంలేని పనులయందు ప్రవేశించటం మంచిదికాదు పిల్లల మూలంగా ఆనందం లభిస్తుంది. 21, 22 లలో లాభవార్తలు జరిగే పనులలో స్వల్ప పేచీలు.

* * *

### తుల :

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)**

గతవారంలో అనుభవించిన మనోవేదనకు ఉపయోగం కనిపిస్తుంది అయినవారితో ఏర్పడిన మనస్పర్ధలు క్రమంగా అణగిపోయి మీ వృత్తి ఉద్యోగాలలో చురుకుగా ముందుకు పోగల అవకాశం లభిస్తుంది రావలసిన బాకీల వంటివి సకా

లంలో ఆందవు పిల్లల మూలంగా ఖర్చులు అధిక మవుతవి కొన్ని సందర్భాలలో మీరు చేసిన సహాయాన్ని అవతలివారు ఉపయోగించుకొనకుండా ఎమ్మెలను నిష్ఠురంగా మాట్లాడుతారు వారాం తంలో ఉష్ణవాత సంబంధమైన అనారోగ్యం కనిపిస్తుంది ఇతరుల వ్యవహారాలను పైన వేసు కొనటం సలహా చెప్పటం వంటి బాధ్యతలను తగ్గించుకొనటం వల్ల కొంత నెమ్మది లభి స్తుంది 23, 24 లలో సంఘంలో గౌరవం, ప్రయాణాలు

* * *

## వృశ్చికం

(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

సంఘంలో నలుగురి మాటా ఒకటే, మీ ఒక్కరి మాటా ఒక్కటే అన్నట్లుగా ఉంటుంది చివరకు నెగ్గుకు రాగలుగుతారు కాని మొదట్లో పోటీని ఎదుర్కొనటం శ్రమగా తోస్తుంది మొత్తంమీద ఆదాయంలేని పనులు అధికం అవు తవి సాధ్యమైనంత వరకు ధన వ్యయంతో కూడిన పనులలో దిగకుండా మాటలతో మర్యాదను కాపాడు కొనటానికి ప్రయత్నిస్తారు కాని సాధ్యం కాక పోవచ్చు ధనాదాయం మామూలుగా ఉంటుంది అధికారులతో సంప్రతింపులు అనుకూలిస్తవి కుటుంబంలో ఖర్చులు కనిపిస్తున్నా సుఖం లభి స్తుంది 19, 20 తేదులలో ఇష్టవస్తు ప్రాప్తి, శుభవార్తలు తెలుస్తవి

* * *

## ధనుస్సు

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)

ఒకప్రక్క జయం పొందగల అవకాశాలు కను పిస్తున్నా మధ్య మధ్య తెలిసే వార్తలు మిమ్మ లను క్రుంగదీస్తూ ఉంటవి ధనాదాయం మీరు అనుకున్నంతగా కనుపించకపోయినా ఇంతకు ముందుకన్నా మేలుగానే ఉంటుంది ఈ సమ యంలో మీలు గౌరవం పొందటం ఇష్టంలేని వారు ఒక రిద్దరు అబద్ధపు వార్తలను ప్రచారం చేయటానికి ఆరంభిస్తారు మీ ఆలోచనలు ఫలించి వృత్తిలో మీకు సహాయం చేయగల పెద్ద మను ష్యులు లభిస్తారు ఇతర శుభ కార్యాలలో పాల్గొన వలసి వస్తుంది మీ పనులలో శ్రమను క్రమంగా తగ్గించుకో గలుగుతారు 22, 23 లలో కష్ట వార్తలు ధన నష్టం

* * *

## మకరం

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం ధనిష 1, 2 పా)

మీ ఆందోళనను, తొందరను చూచి ప్రతి ఒక్కరూ తోచిన సలహా చెప్పి సహాయం చేస్తు న్నట్లు కనుపిస్తారు అయితే మీ అవకాశాలకు తగినట్లు ఆశను తగ్గించుకొని పనులు జరుపు కొంటూ ముందుకు సాగటం మంచిది శుభకార్య ప్రయత్నాలు అనుకూలించగల సమయం వారం రెండవ భాగంలో అకస్మాత్తుగా అప్పులు చేయవలసిన అవసరం కలుగవచ్చు కుటుంబంలో మనశ్శాంతి లభిస్తుంది. పరస్పర సంప్రదింపులతో కార్యభారాన్ని క్రమంగా తగ్గించుకో గలుగుతారు ప్రయాణ సూచనలు కనిపించి నిలిచిపోతవి బంధువర్గంలో మంచి పేరు లభిస్తుంది అగ్ని, యంత్ర సంబంధమైన పనులలో జాగ్రత్తగా ఉండటం మంచిది 24, 25 లలో పడమర దిక్కునుంచి లాభవార్తలు, కార్యసిద్ధి

* * *

## కుంభం

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ భాద్ర 1, 2, 3 పా)

మీ శక్తి సామర్థ్యాలను తెలుసుకుని గౌర వించేవా రుంటారు సభా గౌరవం లభిస్తుంది వ్యవహార కార్యకలాపాలలో మీరు అనుకున్నంత శ్రమ ఉండదు వస్త్రాలు ఆభరణాలు మొద లయినవి కొంటారు సాహసం ఉపయోగించుకుని కార్యసిద్ధి, ధనలాభము పొందగలుగుతారు మీ మాటను కాదని అనే మనుష్యులు క్రమంగా తగ్గి పోతారు అన్ని విధాలా మనశ్శాంతి లభించగల సమయం మీది కాకపోయినా ఏదో ఒకవిధంగా, ధారాళంగా ఖర్చు చేయగలుగుతారు అనేక విధా లుగా గౌరవం పెరుగుతుంది అధికారులు మొద లయిన వారిని కలుసుకొనటం నిమిత్తం శ్రమ పడవలసి వస్తుంది 20, 22 లలో ఖర్చులు అధికం ఆస్తి వృద్ధి ప్రయత్నాలు

* * *

## మీనం

(పూ భాద్ర 4 పా, ఉ భాద్ర, రేవతి)

మీ శక్తిని, అవకాశాలను తెలుసుకుని ముందుకు పోగలుగుతారు వ్యవహారరంగంలో నిరుత్సాహం తొలగిపోయి ఆశారేఖలు కలనుపిస్తవి అన్ని విధాలా మీ అంతస్తూ, విలువా పెరుగుతుంది వృత్తి ఉద్యోగాలలో "అన్యుల మనమున్ నొప్పిం పక తా నొవ్వక" అన్నట్లు నడచుకొనటంవల్ల సుఖము, ఆదాయము పొందగలుగుతారు కుటుంబం లోనివారి ఆరోగ్యం సరిగా ఉండకపోవచ్చు అధికా రులతో పేచీలు వచ్చినా మీ మాటకు ప్రాధా న్యత లభిస్తుంది రకరకాల ఆలోచనలు వినవలసి వస్తుంది కాని, ఉద్రేకపడవద్దు 22 23 24 లలో బంధువులతో అభిప్రాయ భేదాలు, వృత్తిలో శ్రమ ★

## ఈవారపు ధరలు

బంగారు ధర క్రమంగా పెరుగుతుంది కాని వారాంతంలో తగ్గవచ్చు వెండిధర తేజీ వచ్చి నిలుస్తుంది పసుపు ధరకు గిరాకీ వచ్చి తగ్గుతుంది పెసల ధరలో కొద్దిగా మందీ కనిపిస్తుంది ప్రత్తిధర గతవారంలోమాదిరి గానే ఉంటుంది నూలు ధర వారం రెండవ భాగంలో పెరుగుతుంది

వేరుశనగపప్పు ధర తాత్కాలికంగా తగ్గి వారాంతంలో పెరుగుతుంది నూనె ధర కొద్దిగా తగ్గి నిలకడగా ఉంటుంది నూవుల నూనె ధర నిలకడగా ఉంటుంది






టాక్సీ తారురోడ్డును మింగేస్తూ 'శర' వేగంతో ముందుకు సాగిపోతోంది. వెనకసీటులో రాధ కూర్చుం దన్నమాటే గాని, ఆమె మనస్సు మాత్రం అక్కడ లేదు. టాక్సీ వేగం తప్పించుకున్నట్లు ఆమె మనస్సు టాక్సీ దిగి మనోవేగంతో టాక్సీవేగాన్ని అధిగమించి పరుగెత్తుకు పోయింది.

'అతని'తో నాలుగున్నరకే వస్తానని చెప్పాను. అప్పుడే గంట ఆలస్యం అయిపోయింది. అతను ఉంటాడో, లేక విసుగెత్తి వెళ్ళిపోతాడో" అనుకుం టుంది ఆమె రిస్టువాచీ చూసుకుంటూ.

అలాగని 'అతను' అంత అసహనుడని గాదు. ఆమె తాను ఏనాడూ ... ఆమె అతన్ని ఇంతవరకూ ఎన్నడూ నిరీక్షణలో పెట్టలేదు. అతను చెప్పిన టైముకన్నా ముందే వచ్చి అతనికోసం నిరీక్షించేది. అలాంటిది ఈ రోజు ..

"కాంత్ తప్పక నా రాక కోసం ఎదురు చూస్తూనే ఉంటాడు వెళ్ళిపోడు" అని మనస్సును సరిపుచ్చుకుంది

టాక్సీ అనేక మలుపులు తిరిగి మౌబ్రేస్‌రోడ్డు మీదకు వచ్చింది రాధ నుదుట చేరాడుతున్న ముంగురుల్ని పైకి తోసుకుంది. వేళ్ళు ఒణికి నట్లు అయ్యింది చేతికేసి చూసుకుంది. వేయి గుటకేసినట్లు అనిపించింది. హృదయస్పందన చెవు లకు వినిపించినట్లయ్యింది. "ఎందు కింత ఒణుకు?" అనుకుంది ఒణుకుతున్న చేతిని ఒణుకుతున్న చేత్తో పట్టుకుంటూ.

> "నాకోసం చెయ్యలేదు నా రాధకోసం చేశాను నా రాధను సంతోష పెట్టడానికే.... అంతే.... రాధ...." అతను పిచ్చివానిలా మధనపడసాగాడు.

అతన్ని కలుసుకోడానికి వెళుతున్న ఆనందమా? లేక .... అతన్ని యింకా కలుసుకోలేదన్న ఆత్రమా?

రాధ సిగ్గుతో ముడుచుకుపోయింది.

"రాధా! నువ్వు రెండు జడలు మడిచికట్టు కుని ఆకుపచ్చ షిఫాను చీర, అదే రంగు రవిక వేసుకుని నిలబడితే దేవాంగనలు కూడా అసూ యతో నీకేసి చూడాల్సిందే సుమీ" అన్న, కాంత్ మాటలు ఆమెకు స్మరణకు వచ్చాయి ఆనందంతో తన శరీరంకేసి ఒక్కసారి చూసుకుని తన్మయించి పోయింది

'ఇతగాడు ఒప్పుకుంటే బాగుణ్ణు. అంతకన్నా నా తలిదండ్రులకు అభ్యంతరం ఏమీ లేదు' అను కుంది

టాక్సీ మరో మలుపు తిరిగి తూర్పుగా ప్రయాణం సాగిస్తోంది. ఎదురు గాలికి ఆమె ముంగురులు వెనక్కి ఎగిరి నాట్యం చేస్తున్నాయి. పైనున్న పైట ఎదురుగాలికి శరీరానికి హత్తుకుపోయి ఆ భాగంలో పైట అసలు ఉందో, లేదో అనిపించింది. రాధ పైటను తడిమి చూసుకుని సిగ్గుపడిపోయింది.

"ప్రేమ! .... ఎన్ని రంగులు ఆ పదానికి ??"

ఆమె మనస్సు 'ప్రేమ' నుంచి 'మాతృప్రేమ' మీదికి ప్రయాణం చేసింది. ఆ బాల్యం నుండి నేటివరకూ కంటికి రెప్పకన్నా మిన్నగా కాపాడు కొస్తున్న తల్లి తండ్రుల ప్రేమ నుండి .... ఎవరో మనస్సు వరించిన, పెద్దలు అంగీక రించిన, నూతన వ్యక్తి ప్రేమను అర్థించి, ఆ ప్రేమకోసం పరితపించి, ఆ ప్రేమకు పయన మవ్వడం .." ఇదంతా ఆమెకు ప్రపంచేతర యాత్రలా అనిపించింది

'అమ్మా! తెలుగు పాఠం .... నాకు సరిగ్గా బోధపడలేదు అందుకని ఒక స్నేహితురాలి యింటికి వెళ్ళి ఆ పాఠం చెప్పించుకుని అక్కడ ... ఆలస్యంగా వస్తాను' అని [illegible]



యుడు రూపాయలు అందిచ్చిన విషయం గుర్తుకు
్పింది. "మాతృ ప్రేమకు సాటిలేదు ...."
మె ఒడలు పులకరించింది.

టాక్సీ బీచ్ ఒడ్డున ఒక మేడ ముందర
ంది రాధ కళ్ళు టాక్సీ మీటరును కూడా
ాడకుండా అతని కోసం వెతకసాగాయి ....
గో !!!

కాంత్ రోడ్డుకు అవతలివక్క బస్‌స్టాపును
ుకుని నిలబడ్డాడు. నల్లని ప్యాంటు, వైట్
ట్, టక్ చేసి బ్లూ 'టై' కట్టుకున్నాడు.
షి ఆజానుబాహు. ఎంతసేపు చూసినా చూడా
పించే అతని శరీర లావణ్యం అమాయక వయ
ూ అతనితో ప్రత్యేక ఆకర్షణ.

అతను ఆమెను చూసి నోట్లో నానుతున్న
్పరకును ఉమ్మేసి ఆమెకేసి నడిచాడు అంత
కు గాక్సీలోనే కూర్చున్న రాధ సిగ్గుపడిపోయి
క్సీలోంచి బయటపడింది. ఈలోగా అతనే
టాక్సీకి డబ్బిచ్చి పంపేసి పేవ్‌మెంట్ ప్రక్క
నున్న స్కూటరు మీద చెయ్యి వేసి "మన రథం"
అన్నాడు ఆమె మనోరథం నెరవేర్చినట్లు ఆనం
దిస్తూ సంభ్రమాశ్చర్యాలతో రాధ కళ్ళు గిర
గిరలాడి పెద్ద వయ్యాయి. "ఏవిటి ? సొంతమే!
ఎప్పుడు కొన్నారు !!" అంది ఆశ్చర్యాన్ని అణుచు
కోలేక అతను యిబ్బందిగా ముఖంపెట్టి బుర్ర
వెనకభాగం గోక్కుని కాలరు సరిచేసుకుని ఆమె
కేసి చూస్తూ, "ఏం అనుమానమా ? నా మాట
మీద నమ్మకం లేదా ? నా రాధ కోరుకుంటే కొండ
మీద కోతినైనా సరే యీ 'కాంత్' దింపి తేగలడు
తెలుసా" అన్నాడు. గుండెలు బాదుకుంటూ. ఆమె
అతని నిశ్చల అమాయక ప్రేమకు మురిసి
పోయింది

కాంత్ ఒక్క కుదుపులో స్కూటరును స్టార్టు
చేసి "వెనకాల ఎక్కగలవా?" అన్నాడు చిరు
నవ్వుతో, చిరు కోపంతో రాధ అతన్ని కను



బొమ్మలతో వెక్కిరించి, పైటచెంగు మొల్లో దోపుకుని అతని వెనకాల ఎక్కి కూర్చుం. స్కూటరు "రయ్యి"మని దూసుకుపోయింది

కాంత్ అతి స్పీడుమీద ఆమెను అనేక రోడ్లు తిప్పి చివరకు బీచ్ వద్దకు వచ్చి జనసమ్మర్దం లేని చోటు చూసుకుంటూ పోనివ్వసాగాడు. రాధ హృదయం కాంత్ మనస్సులోకి చొచ్చుకుపోయింది

కొన్నాళ్ల క్రితం వరకూ రాధకి 'కాంత్' ఎవరో కూడా తెలీదు. అలాంటిది అతను, అతనే యిప్పు డామె సర్వస్వం అయిపోయాడు . . అవేళ . బీచ్‌లో తను ఒంటరిగా కూర్చున్నప్పుడు అతను చేరువకు వచ్చి ముచ్చటల్లో దించి చేరువలో తను పెట్టుకున్న చేతి బ్యాగును చేత్తో పుచ్చుకుని చకచకా వెళ్లిపోవడం ... అదే సంభవించకపోతే . . . అతను ఎవరో . . . " అనుకుంది రాధ గతం గుర్తుకు తెచ్చుకుంటూ.

కాంత్ ఒకచోట స్కూటరును ఆపాడు ఆమె క్రిందికి దిగింది. అతనూ దిగి స్కూటరు స్టాండు వేసి ఆమెను అనుసరించాడు.

ఇద్దరూ రోడ్డు దిగి ఇసకలో మౌనంగా నడక ప్రారంభించారు సముద్ర తరంగాలకు చేరువలో ఉన్న తడి యిసుకకు దగ్గరున్న పొడి యిసుకలో యిద్దరూ కూర్చున్నారు. అతను చేతులు తల క్రింద పెట్టుకుని వెల్లకిలా పడుకుని నీలాకాశం, నీలి సముద్రం చూసి తన్మయుడై పోసాగాడు

"నిజంగా ఆ స్కూటరు మనదే!"

ఆలోచిస్తున్నవాడల్లా అతను ఆ మాట విని చిరునవ్వుతో ఆమెకేసి చూశాడు రాధ కళ్లు అనుమాన, ఆత్రాలతో నిండి ఉన్నాయి

"ఏం రాధా! నా మాటమీద నమ్మకం లేదా!" అన్నాడు తను ఆమె కేసి జాలిగా చూస్తూ

"అనుమానంతో కాదు, నమ్మకం లేకా కాదు స్కూటరు కొనడం అంటే తేలికయిన పనా" ఆమెలో యింకా అనుమానమే కనుపిస్తోంది.

అతను కుడిచేతిని తలక్రింద నుండి బయటకు తీసుకుని ఆమెకేసి చూశాడు రాధ చూపులు వాల్చుకుంది.

ఇసకలో పెడకాళ్లు వేసుకుని కూర్చుని యిసకతో ఆడుకుంటున్న రాధ ఆ క్షణంలో అతని నయనాలకు దివ్యసుందరిగా కనపించింది. ఈమె అందమూ, ప్రేమా నాచేత ఎంతపనైనా చేయించగలవు రాధ నా అండను ఉంటే ఎలాంటి పనైనా చేయగల సాహసం ఉంది నాకు" అనుకున్నాడు

"ఏం ? అలా చూస్తున్నారు ?" పైట సరిచేసుకుని ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ రాధ ప్రశ్నించింది.

"రాధా, జీవితాంతం మన మిద్దరం యిలా హాయిగా, స్వేచ్ఛగా ఉండిపోతే .... మన జంటను చూసి ఎంతమంది అసూయ పడతా రంటావు ?" అన్నాడు ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుంటూ.

కానీ

ఊ, కానీ ...

మా అమ్మానాన్నలే ఒప్పుకోరు . .

ఏం ? ఆ పని మానేశానని చెప్పకపోయావా ?

అది కాదు

"మరి .... ?"

# పట్టుబడిన దొంగ

అదే. లేకలేక కలిగిన సంతానం .. మా తల్లిదండ్రులకు నే నొక్కర్తినే . . కొడుకునైనా, కూతురైనా కూడా నేనే . . . అందుకనే మా వాళ్లు అంత పట్టుబట్టారు .. కూతురూ, అల్లుడూ వాళ్ల కళ్ల ఎదురుగా తిరుగుతుంటే చూసి ఆనందించాలని ఉబలాట పడుతున్నారు పైగా అల్లుణ్ణి కొడుకులా చూసుకుంటారు కూడా" ఆమె చెప్పడం మానేసి బ్రతిమాలుతున్నట్లు అతనికేసి చూసింది.

"రాధా!" అంటూ అతను లేచి కూర్చున్నాడు రాధ కుడిచేతిలో యిసక ఎడంచేతిలోకి మార్చుకుంటూ అతనికేసి చూసింది

"మెత్తని పాదరక్షతో మీ దవడశుద్ధి మహా

## 'భాషారాష్ట్రాలు'

ఈ మధ్య మద్రాసు నుంచి ఒక 'జాకీ' బొంబాయి గుర్రపు పందేలలో పాల్గొన్నాడు. 'రేసు' జరుగుతూ ఉండగా గుర్రం కాలుజారి పడిపోయింది. పడటంలో జాకీ కాలు దాని క్రింద ఇరుక్కుపోయింది. "లే! నన్ను జరగనీ!" అన్నాడు జాకీ.

"నాకు తెలుగు రాదు." గుర్రం సకిలిస్తూ అన్నది.

త్సవము జరప నిశ్చయించాము" అనే పద్ధతి గాక, ఉన్నది ఉన్నట్లుగా చెప్పాలంటే 'ఇల్లరికం' అన్న మాట "

రాధ మారు మాట్లాడలేక చేతిలో ఉన్న ఇసకను కుప్పగా పోయ నారంభించింది

"రాధా! 'ఇల్లరికపు టల్లుడు' అనే పేరు పడేకన్నా "మాజీ దొంగ, మాజీ ఖైదీ" అనిపించుకోడమే నాకు ఆనందం ఇదే విషయం నీతో అనేకసార్లు అన్నాను "

ఆమె మారు మాట్లాడలేదు

"రాధా! నీకూ ఆ పద్ధతే యిష్టమా ? నేను నిన్ను పొందలేనా ? నా జీవితం యిలా పోవాల్సిందేనా ?" మళ్లా నేను 'వెనకటివాడిని' అయిపోవాల్సిందేనా ?'" అన్నాడు ఆవేశంతో ఆమె చెయ్యి పట్టుకుంటూ

రాధ శరీరం పులకరించింది. ఆమె కళ్లు చమ్మగిల్లాయి

నేను 'ప్రేమ' అనే పదానికి పవిత్రమైన అర్థం ఎరిగిన తర్వాత ఆ అర్థానికి అర్థం మీరే అని నమ్మాను. ఆనాడు మీరు దొంగిలించింది నా పర్సుకాదు, నా హృదయాన్ని . మీరే లేని నాడు నాకు హృదయమే లేదు అప్పుడు ప్రేమ ప్రసక్తి లేదు' అంది సహజావేశంతో

"రాధా! తెలుసు నాకు నీ మనసు" అంటూ అతను ఆమె చేతిని తన హృదయానికి హత్తుకున్నాడు

* * *

భుజంగరావు యింటికివచ్చి ఖిన్నవదనుడై కుర్చీలో కూర్చున్నాడు. అతని రాక ఎరిగిన కాంతమ్మ కాఫీ పట్టుకొచ్చి టేబులుమీద పెట్టి భర్త కభిముఖంగా ఉన్న కుర్చీలో కూర్చుంది. అతని కనుబొమ్మలు మనస్సులో, అంతర్గత బాధను వ్యక్తం చేస్తున్నాయి

"అతను, ఆ పని మానలేదు ఆకతాయితనంగా చేసిన పని అలవాటయ్యి కూర్చుంటుంది"

"ఏం ? యిప్పు డేమయ్యింది ? ఇటీవల బాగానే ఉన్నాడుగా" అంది ఆమె భర్త ముఖంలోకి చూస్తూ.

"ఏమవుతుంది ? దొంగతనం మళ్లీ చేశాడు" భుజంగరావు భార్య ముఖంలోకి చూడలేక పోయాడు

రామరామ !! మళ్లానా ? ఎప్పుడు ? ఎక్కడ?? ఎందుకు ??? ఎలా ??" ఆమె ఆశ్చర్యం ప్రశ్నల పరంపరై ప్రవహించింది

భుజంగరావు భార్య ముఖంలోకి ఒక్కసారి చూసి తల దించుకుని ప్రారంభించాడు

"హోటల్ ఎంపైర్ లేదూ ? అందులో అందరూ తాగి తందనా లాడుతున్నారట రావూ సాహెబ్ రామారావుగా రబ్బాయి మోహన్ తను తెచ్చుకుని టేబులుమీద పెట్టుకున్న రెండు కెమెరాలూ యితను కొట్టేశాడట . ."

"రామరామ !! నలుగురికీ తెలుస్తే ఎంత నామర్దా, ఎంత తలవంపులూ, ఛీ. ఛీ పుట్టుకతో వచ్చిన బుద్ధి పుడకలతో గాని పోదు' అంటారు గొప్పింటివాడు కూడాను పట్టుబడ్డాడా ? అంది కాంతమ్మ.

లేదు .. కానీ తలుచుకుంటే మరో పావుగంటలో కటకటాల అవతల ఉంటాడు ముందర ఆ వస్తువుల ఆచూకీతియ్యమని చెప్పాను

"ఈ విషయం అందరికీ తెలిసిందా ?"

"లేదు. భద్రయ్యకు ఒక్కడికే తెలుసు. వీలైనంత 'గుట్టు' గా ఉంచుతాను సార్" అన్నాడు. కాంతమ్మ భర్తమాటలు విని భారంగా నిట్టూర్చింది.

"ప్రేమ ... "

భుజంగరావు లేచి నించుని ప్రారంభించాడు. చిన్ననాటి నుండి, ఆ ప్రేమను మనవద్ద పుచ్చుకుని ఎవరో బలాదూరు వాడికి యిచ్చేస్తారు పిల్లలు. ఆ ప్రేమను అందించి, అంతవరకూ పెంచి పెద్దచేసిన పెద్దల్ని, తల్లితండ్రుల్ని కూడా "ఆ ప్రేమకు అతను అర్హుడు కాడు" అంటే లెక్కచేయరు. మన రాధకూడా అంతే! ఇదే యీనాటి పిల్లల తీరు."

కాంతమ్మ మారు మాట్లాడలేకపోయింది.

భార్యాభర్త లిద్దరూ అదేవిషయం మాట్లాడు కుంటూ కూర్చున్నారు గడియారం తొమ్మిది గంటలు కొట్టి మరో పావుగంట దాటి యింకో పావుగంట దాటబోతుండగా గేటుముందర ఏదో మోటారు ఆగినశబ్దం అయింది కాంతమ్మ లేచి వరండాలో లైటువేసింది.

గేటువేసి లోపలకు వస్తున్న రాధ తల్లిని చూసి పిల్లి అయిపోయి పైకి వెళ్లిపోయింది. అది చూసిన కాంతమ్మ "భోజనం చేయకుండా పైకి వెళ్లిపోయా వేమిటే అమ్మడూ" అంది మేడకేసి చూస్తూ. 'ఆకలిగా లేదమ్మా' అన్న కూతురుమాట చాలా నెమ్మదిగా వినిపించింది వా రిరువురకూ. ఇద్దరూ ఒక్కసారే నిట్టూర్చారు.

* * *

రాధని దిగవిడిచిన కాంత్ మళ్లా వచ్చి బీచ్‌లో కూర్చున్నాడు అతని మనస్సంతా ఆలోచనలతో నిండిపోయింది. ఆత్మ విచక్షణ, ఆత్మ పరిశీలన అతనిలో ప్రారంభమయ్యింది. గతం స్ఫురణకు వచ్చింది ....

" .. అబ్బాయీ మనిషి తను పుట్టిన కుల, ధన గౌరవాలవల్ల గొప్పవాడు కాడు, అవలేడు కూడా. సత్ప్రవర్తన కలిగిఉంటే సత్పురుషుడు అంటారు. లేకపోతే . లేదు 'నీతి' .... యీ పదానికి మనం విలువకట్టలేము నీతి మనుష్యునికి ప్రాణంకన్నా ముఖ్యం. మన పెద్దలు, 'నీతి—జాతి' అన్నారు. అంటే వాళ్ళు నీతికి ప్రప్రథమ స్థానం యిచ్చారన్నమాట. ఆ నీతి వదలినవాడు ఎంతటివాడైనా కొంతకాలానికైనా అధఃపాతాళానికి దిగిపోవాల్సిందే ? అతనికి సంఘం లో స్థానంలేదు అతని ఉనికి చీత్కారనీయం విద్య . దీనికన్నా కూడా నీతి ముఖ్యం .. చివరికి ప్రాణంకన్నా కూడా నీతి ముఖ్యం యిది గుర్తుంచుకో. నీకు చెప్పేవాళ్ళ నేను పోతే .... ఎవ్వరూ ఉండరు" అని అతని తండ్రి కడసారి అన్న మాటలు గుర్తుకు వచ్చాయి

అయితే నేను చేసిన పని తప్పా "చేయరాని పనులు వేయి అయినా సరే చేసి భార్యాపిల్లలను పోషించితీరాలి—భర్త అన్నవాడు" అని మనువు నీతిశ్లోకాల్లో ఉద్ఘాటించాడే ...... " అనుకుంటూ చల్లని యిసుకలో వెల్లకిల్లా పడుకున్నాడు.

ఒకపనిని మానవుడు త్యజించాడు అంటే .... అదిఅతను అతనుద్వేషించా డన్నమాట అలా ద్వేషించి త్యజించిన పనిని మళ్ళా అతను ప్రారంభించాడంటే అతను ఎంత హీనుడో వేరే చెప్పక్కర్లేదు

'అయితే నేను హీనుణ్ణా !' కాంత్ ఒక్క కుదుపులో లేచి కూర్చున్నాడు.

కాక ! .... ఇల్లరికమే నీచ మన్నావే ? .... అంతకన్నా నీచాతినీచమైన ఈ నీచకార్యం ఎలా చేశావు ...." అతని మనస్సు ప్రశ్నించింది.

"నాకోసం చెయ్యలేదు .. నారాధకోసం చేశాను, నా రాధను సంతోషపెట్టడానికి చేశాను అంతే... రాధ కోర్కె నెరవేర్చడానికి అంతే రాధ కోర్కె .... రాధ . . " అతను పిచ్చివానిలా మథన పడసాగాడు.

"అయితే మాత్రం .... ఎవరికి గొప్ప ? దొంగతనం ఎవరు చేసినా, ఎవరికోసం చేసినా దొంగతనమే ! చట్టంప్రకారం అతను దొంగే ."

కానీ—కానీ నేను చేసినది దొంగతనం కాదు ..

"ఏవిటీ ? నువ్వు చేసినది దొంగతనం కాదూ! అతని మనస్సు ఆశ్చర్యపడిపోయింది..

"కాదు .... ఆ హోటల్లో అందరూ తప్పతాగి తనువులు మరచి తందనాలు తొక్కుతున్నారు. ఆ మోహన్, తను తెచ్చుకున్న రెండు కెమెరాలూ మైకంలో నా ఒళ్లో పడేసి టేబుల్‌మీదున్న మరో బుడ్డిలో మునిగిపోయాడు మైకంలో అందరికీ కన్నూ మిన్నూ కానటంలేదు వాళ్ల వస్తువులు వాళ్లవే అన్న స్పృహతో కూడా లేరు పైగా—

> చెవులలో నెప్పిగా ఉన్న ఒకాయన తనకు పరిచయం లేని డాక్టరు వద్దకువెళ్లి పరీక్ష చేయించుకున్నాడు. ఇవీ అవీ మాట్లాడుతూ ఉండగా తనూ, డాక్టరూ కూడా ఒకే ఊరివారని తేలింది. పని ముగిసిన తర్వాత డాక్టరు అన్నాడు: "మీరు నేనూ ఒకే ఊరివారం. మా తండ్రిగారికీ మీ తండ్రిగారికీ చాలా స్నేహం కూడా! అందుచేత నేను సాధారణంగా పుచ్చుకునే అయిదురూపాయల ఫీజుపుచ్చుకోను! దయచేసి నాలుగు రూపాయలముప్పావలా చెల్లించండి.

ఆ కెమెరాలు నావద్ద ఉన్నాయి అంతే అవి నావి . వాటితో ఇవతలకు వచ్చేసి తాకట్టు వాళ్ల దగ్గర అమ్మేసి స్కూటరు కొనుక్కున్నాను కాదు నా రాధ కోసం కొన్నాను. ఇది దొంగతనం అవ్వదు నా జేబులో ఎవ్వరైనా పర్సు పెడితే అది వాడి తప్పు కాని, నా తప్పు ఎంతమాత్రం కాదు .... " అతను లేచి నడక ప్రారంభించాడు.

* * *

మగత నిద్రలో వినిపించిన ఫోను గణగణకు రాధ ఉలిక్కిపడి లేచి మంచంమీద కూర్చుంది. పక్క గదిలో ఫోనులో మాట్లాడుతున్న తల్లి కంఠం ఆమెకు వినిపించింది ఆమె గడియారం కేసి చూసింది తెంగున అరగంట కొట్టి—

'యిదిగాక మరో గంట కూడా అయ్యింది సుమీ' అంది గడియారం రాధ బద్ధకంగా ఆవులించింది.

"ఆ వస్తువులు దొరికాయట దుర్గయ్య ఫోను చేశాడు మిమ్మల్ని రమ్మని ."

తల్లి గొంతుకకు సమాధానంగా తండ్రి అడుగుల చప్పుడు వినిపించింది "అబ్బ ! ఏం పోలీసు ఉద్యోగాలు బాబూ, నాన్నగారికి విశ్రాంతి లేదు" అనుకుంటూ రాధ మంచం దిగి తలుపుకేసి నడిచింది

"అతను స్కూటరుమీద తిరుగుతున్నాడుట. పట్టుకోడం అవసరమని మీరంటే పట్టుకుంటాడట .... " అది తల్లి గొంతు

ఆ మాటలు వినగానే రాధ మగతనిద్ర ఎగిరిపోయింది శరీరం ఒక్కసారి చల్లారిపోయింది. "దొంగతనం, అతను స్కూటరుమీద తిరగడం" ఆమెఒళ్లు గజగజా వణికిపోయింది.

అమ్మాయి నిద్రపోతోందా !

నిద్రపోతూనే ఉండాలి లేకపోతే యివతలకు రాదూ ?

ఈవిషయం దానికి తెలియనివ్వక. అది చాలా బాధపడుతుంది . .. నేను వస్తాను

తండ్రి అడుగులశబ్దం మళ్లా వినిపించింది. "కాంత్ ! దొంగతనం చేశాడా ? .... అతను దొంగతనం చేశాడా ?" ఆమెతల దిమ్మెక్కిపోయింది. 'నాన్నగారూ' అంటూ గదితలుపు తీసుకుని గుమ్మం దాటుతున్న తండ్రిపాదాలను పెనవేసుకు వెక్కివెక్కి ఏడ్వసాగింది. భుజంగరావు క్రూరంగా ఉండాలని విశ్వప్రయత్నం చేసి విఫలుడయ్యాడు 'పితృప్రేమ' అతన్ని కదిల్చింది.

'రాధా ! లే. . నేను వెళ్లాలి' అని కూతుర్ని విడిపించుకుని మోటారు సైకిలునైపు వెళ్లిపోయాడు. తొట్రుపడుతున్న అడుగులతో రాధ తన రూముకు చేరుకుంది

అతను ... ప్రమాణం చేసిన అతను .... దొంగతనం చేశాడా . ఛీ. నిజాయితీ, నిలకడ లేనివాడు అంత మనోనిబ్బరం లేనివాడు...దుర్బలుడు దుర్మార్గుడు .. "

రాధ ఆ రాత్రంతా అతనిమీద ద్వేషం పెంచుకోవాలని విశ్వప్రయత్నం చేసింది. కానీ సంవత్సరాల తరబడి గడ్డకట్టుకున్న ప్రేమ యీనాటికీ ఆమె స్వల్ప కోపాగ్నికి భస్మం కాలేదు.

* * *

స్కూటరుమీద తిరుగుతున్న కాంత్ మెయిన్ రోడ్డు మొగలో ఎర్ర జెండాను చూసి మలుపు తిరిగి రయ్యిమని భయావేశాలతో యింటికి చేరుకున్నాడు లంకంత భవనం అతని రాక చూసి బావురుమంది పక్కమీద పడుకున్న కాంత్ "ఈ ఒంటరితనమే నన్ను యీవిధంగా చేసింది. ధనం ఉండీ అనుభవించే హక్కు లేదు" అనుకున్నాడు. అతని కళ్ళ ఎదురుగా ఉన్న తండ్రి పటాన్ని చూశాయి

నువ్వు చేసిన పని నీచమైంది కాదని అన్నావే ? అయితే ఆ పోలీసును చూసి ఎందుకు గిలగిల్లాడిపోయి పారిపోయావు ? అతనికి ఎదురుపడే శక్తి

(44 వ పేజీ చూడండి)

# కాల్గేట్ వాడి నోటినించి దుర్వాసన రాకుండా చేసుకోండి

## రోజంతా దంతక్షయం రాకుండాకూడా కాపాడుకోండి!




ఎందుకంటె : ఒక్క సారి తోముకొంటేనే

కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసన మరియు దంతక్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85 % వరకు తొలగించును

కాల్గేట్ 10 మందిలో 7 గురికి నోటి దుర్గంధమును వెంటనే అపుతుందని మరియు భోజనము అవగానే కాల్గేట్ పద్ధతిలో పళ్లు తోముకొనుట ద్వారా ఎక్కువ మందికి ఎక్కువ దంతక్షయము అరికట్టిందని దంత శాస్త్ర చరిత్రలో పూర్వమెన్నడూ తెలియచేయనంతలా శాస్త్ర పరిశోధనం ఫలితముగా నిరూపించబడినది !

ఊరికే నోటిలో నీళ్లు పోసుకొని పుక్కిలించుట చాలదు. భోజనము అయిన వెంటనే క్రమంతప్పకుండా కాల్గేట్‌తో పళ్లు తోముకోండి దాని చేనతనమైన నురుగు పళ్ల మధ్య కనపడకుండా ఉండే సందులలోనికి వెళ్లి నోటి దుర్వాసనకు మరియు దంతక్షయమునకు కారణమైన కుళ్లి పోతున్న ఆహారపు తునకలను తీసివేస్తుంది !

పిల్లలు కాల్గేట్‌తో పళ్లు తోముకొనుటకు యిష్టపడతారు ఎందుకంటె చాల సేపు ఉండే దాని పిప్పర్‌మెంట్ వంటి రుచి అంటే వారికి ప్రీతి !




మీకు పౌడరు కావాలంటే, ఈ లాభములన్నిటిని మీరు కాల్గేట్ టూత్ పౌడరు ద్వారా పొందగలరు . ఒక డబ్బా వెలలు వస్తుంది

కాల్గేట్‌తో క్రమం తప్పకుండా పళ్లు తోముకొంటే

- ✔ నోటి దుర్వాసనను పోగొట్టును
- ✔ దంతక్షయమును నిరోధించును
- ✔ పళ్లను మెరుస్తూ ఉండేలా ఉంచును

నోరు ఎక్కువ శుభ్రముగా, తాజాగా ఉండుటకు మరియు పళ్లు ఎక్కువ తెల్లగా ఉండుటకు ప్రపంచములో ఏ యితర పళ్లు తోముకొనే క్రీమ్ కన్నా కాల్గేట్ నే ఎక్కువ మంది వాడుతున్నారు.

CCG.310T TEL.



జూల్స్ వెర్న్ నవల

# ౮౦ రోజులలో భూప్రదక్షిణం

అనుకొన్న వేళ ప్రకారం, నవంబరు 6 వ తేదీ సాయంకాలం 6 గంటలకల్లా హాంకాంగ్ నుంచి బయలుదేరిన కర్నాటిక్ పూర్తి వేగంతో జపానుకు ప్రయాణం సాగించింది ఆ ఓడ పూటుగా సరుకెత్తుకుంది ప్రయాణికులనూ నిండుగా ఎక్కించుకుంది రెండు కాబిన్‌లు మాత్రం ఖాళీగా ఉండిపోయాయి. అవి ఫిలియాస్‌ఫాగ్ పేరిట కేటాయించి ఉంచినవి

మర్నాడు ఉదయం ఓడలో రెండోతరగతి కాబిన్‌ల వాడలోనుంచి ఒక ప్రయాణికుడు తూలుతూ అదీ యిదీ పట్టుకుంటూ ఇవతలికి వచ్చి ముందువేపు డెక్‌మీద ఒక కుర్చీ చూసుకుని కూలబడడం చూసి, ఓడ సిబ్బంది కాస్త ఆశ్చర్యపోయారు ఆ మనిషి కళ్ళు మత్తుగా ఉన్నాయి జుట్టు బాగా రేగిపోయి ఉంది. అడుగులు తొట్రుపడుతున్నాయి అతను పాస్పర్తూ

అసలు జరిగిన కథ ఇది

హాంకాంగ్ హాటల్‌లో డిటెక్టివ్ ఫిక్స్ బిల్లు చెల్లించి వెళ్లిపోయిన తరువాత, అక్కడ స్పృహ తప్పి పడిఉన్న పాస్పర్తూను, నౌకర్లిద్దరు కాళ్ళూ చేతులా సాయంపట్టి మోసుకెళ్ళి, సాటి నల్లమందు భాయి పక్కన ఒక మంచంమీద పడేశారు మూడు గంటల తరువాత పాస్పర్తుకు కాస్త తెలివి లాటిది వచ్చింది అది తెలివి కాదు. అతని మనసులో నిత్యం మెదిలే భావం—నిద్రలోనూ, కలలోనూ కూడా కదులుతూ, మెదులుతూ ఉండే బాధ్యత మేలుకుంది అది తన యజమాని పని తాను సవ్యంగా, సొంతంగా చేయలేదన్నది ఆ వూహ రాగానే మత్తు చాలవరకూ దిగిపోయింది. కొంత అతను దులపరించుకున్నాడు మిగతాదాన్ని అతిప్రయత్నంమీద నిగ్రహించుకొని లేచి తప్పటడుగులు వేస్తూ తూలుతూ తూలుతూ లేస్తూ గోడవారగా నడిచి నెమ్మదిగా ఇవతల పడ్డాడు. కర్నాటిక్, కర్నాటిక్ అంటూ కలవరిస్తూ, అజ్ఞాతజ్ఞానంలోనే హాంకాంగ్ రేవు కేసి నడిచాడు రేవులో కర్నాటిక్ కదలడానికి సిద్ధంగా ఉంది. ఆ తెలియని స్థితిలోనే తెలిసినవాడి హడావుడితో పాస్పర్తూ స్టీమరు సీదికి పరుగెత్తాడు. ఎక్కి ఎక్కగానే ముందుకు తూలి, కూలిపోయాడు మత్తులోకి, నిద్రలోకి ఇంకో క్షణంలోనే పట్టు తాళ్ళు తప్పించి ఓడని వదిలేశారు.

అక్కడి నావికులకు ఇలాటి మనుషులూ, ఈ

అనువాదం:

## ఎస్. పార్థసారథి

వరసా కొత్తకాదు వాళ్ళ రివాజు ప్రకారం పాస్పర్తూను మోసుకెళ్ళి రెండో తరగతి గదులలో ఒకదాంట్లో పడుకోబెట్టారు మర్నాడు ఉదయం పాస్పర్తూ మేలుకొనేసరికి స్టీమరు చైనా కోస్తానుంచి నూట యాభై మైళ్ల దూరం వచ్చేసింది

ఇదీ కథ ఆరుబయట కొంతసేపు కూర్చొని స్వచ్ఛమైన సముద్రపుగాలి పీల్చి వంట బట్టించుకునేసరికి అతను బాగా తేరుకున్నాడు. మత్తులోంచి మేలుకున్నాడు తాను ఎవడు, ఎక్కడినుంచి వచ్చాడు, మరిచిపోయినదేమిటి, జరుగుతున్న దేమిటి అనే విషయాలు జ్ఞాపకం చేసుకుందికి ప్రయత్నాలు ఆరంభించాడు. చాలాసేపు తిప్పలు పడ్డ మీదట మెల్లిగా ఒక్కొక్కటి గుర్తు కొచ్చింది. హాంకాంగ్ హాటలు, అక్కడి దృశ్యాలు, తాగడం, పొగతాగడం, ఫిక్స్ చెప్పిన రహస్యం అన్నీ లీలగా మనసులో మెదిలి తరవాత స్పష్టంగా కనిపించాయి

"బాగా చిత్తుగా తాగేశాను కాబోలు" అనుకున్నాడు పాస్పర్తూ ఫాగ్ ఏమనుకుంటాడో, అంటాడో నని ఊహ పోయింది. ఏమన్నా మొత్తానికి తను ఓడ తప్పిపోకుండా ఎలాగో అలా వచ్చి పడ్డాడు. అదే చాలు.

ఫిక్స్ గుర్తు కొచ్చాడు "ఈ దెబ్బతో వాడు విరగడయిపోయాడు నాతో అలాటి గూడుపుఠాణి చెయ్యబోయాడు కాబట్టి, కడుపులో వూహాలు చెప్పేశాడు కాబట్టి ఇప్పు డిహ ఈ ఓడమీద కూడా మనని వెంట తరమడానికి మొహం చెల్లదు. దమ్ములు చాలవు... హాఁ మా యజమాని బాంకాఫ్ ఇంగ్లాండులో దొంగతనం చేశాడుట. పట్టుకుందికి పోలీసు డిటెక్టివుట వా. ఎంతమాటన్నాడు ఫిలియాస్‌ఫాగ్ దొంగ అయితే నేను ఖూనీకోరు నయినట్టే" అనుకున్నాడు పాస్పర్తూ

ఇప్పు డీ సంగతు లన్నీ తను యజమానికి చెప్పాలా? ఈ వ్యవహారంలో ఫిక్స్ సంగతి అతని భూమిక బయటపెట్టడం మంచిదేనా ? అంతకన్న తాము లండన్ చేరేదాకా ఆగడం మంచిదికాదూ "అప్పుడు ఇంట్లో హాయిగా కూర్చున్నాక చెప్పచ్చు 'మీకు తెలీదుగాని మన ప్రయాణం పొడుగునా ఒక పోలీసు డిటెక్టివు మిమ్మల్ని వెంబడించాడు అరెస్టు చేదామని" అంటూ చెప్పుకు నవ్వుకోవచ్చు. అదే పద్ధతి అదే మంచిది ఎందుకయినా మంచిది. ముందు కొంచెం జాగ్రత్తగా ఆలోచించి మరీ వ్యవహారం చెయ్యాలి. అంతకన్న ముందర యజమా



## సుఖ జీవిత సేవ

భారత "సిద్ధ వైద్య మహిమ" మన దేశ సిద్ధుల పాటిలేని కీర్తికి ఒక తార్కాణము.

### "మేల్ మాయిల్ మందు"

ప్రపంచములో ప్రఖ్యాతి గాంచిన మేహ, కుష్ఠరోగనివారిణి భయంకరమైన మేహ వ్యాధివల్ల కష్టపడువారలకు పునర్జన్మమిచ్చు అద్భుత సంజీవి మేహరోగ నివారణ నూనె, లేహ్యము.

**డా॥ కె. టి. కృష్ణమూర్తి ఆచ్చారి & సన్సు**

5/22, మేల్ మాయిల్ (P. O.) (N. A. Dt.) S. India.



## పూవు మీ అదృష్టం చెప్పగలదు

మీ భవిష్యత్తులో ఏమి జరుగబోవునదిన్నీ, మీ సరియైన చర్యనుగురించిన్నీ మీరు తెలుసుకొనగోరినట్లయితే ఒక పోస్టు కార్డుపైన మీకు యిష్టమగు ఒక పుష్పము పేరున్నూ, మీరు వ్రాయు తేది, వేళ వివరములున్నూ, మీ సరియైన చిరునామాయున్ను వెంటనే వ్రాసి పంపండి.

జ్యోతిష శాస్త్రములోని రహస్య గణితము మూలముగా మేము గుణించి, మీరు కార్డు వ్రాసిన తేదీలగాయతు 12 మాసములలోను మీయొక్క అదృష్టము, లాభనష్టములు, జీవితమార్గము, ఏ వ్యవహారములో మీకు జయముకలుగునో, మీ ఉద్యోగం విషయంలో మంచిచెడ్డలు, మార్పులు, ఆరోగ్యవిషయము, పరదేశగమనము, తీర్థయాత్రలు, వివాహము, స్త్రీసుఖము, సంతానము, నిధినిక్షేపములు, లాటరీ, అకస్మాద్ద్రవ్యలాభము మొదలగు వానినిగురించి స్పష్టముగా మాసవారీగా వ్రాసి రు. 1-4-0 లకు మాత్రమే వి. పి. గా పంపగలము. (వి. పి. చార్జీలు ప్రత్యేకం) దుష్టగ్రహము లేవయినా వున్న యెడల శాంతిచేయు విధానంకూడా తెలుపగలము. వివరములు మా పూచీపైన పంపబడును. మేము పంపిన ఫోరకాస్టు మీకు తృప్తిగా నుండనియెడల పైకము వాపసు చేయబడును. ఒకసారి పరీక్షించి చూడుడు. మా అడ్రసు ఇంగ్లీషులో వ్రాయండి.

Pt DevDutt Shastri, Raj Jyotishi (WP-18) Jullundur City.




దక్షిణఇండియా ఆఫీసు 5/149 బ్రాడ్వే మద్రాసు-1.


# 80 రోజుల్లో భూ ప్రదక్షిణం

ని కలుసుకొని ఏవిధంగాను క్షంతవ్యం కాని తన ప్రవర్తనకు క్షమాపణ చెప్పుకోవాలి

పాస్పార్టూ లేచాడు తరంగిణి అల్లకల్లోలంగా ఉంది ఓడ తన ఒళ్ళులాగే తూలుతోంది ఊగుతోంది పాస్పార్టూకు కాళ్ళు గట్టిగా నిలబడడం లేదు అలాగే తూలుతూ, తొట్రుపడుతూ మెల్లిగా ఓడ వెనుకవేపు డెక్‌మీదకు వెళ్ళాడు. అక్కడ ఫాగ్‌ను పోలినవారు ఎవరూ కనబడలేదు. అయూదా లాటివారు కూడా కనబడలేదు.

"ఆవిడ బహుశా ఇంకా నిద్రలేచి ఉండదు. ఆయన్ని ఎవరో పేకాటకి తోడుదొరికి ఉంటాడు. ఈ వేళకి బహుశా రివాజు ప్రకారం—" అనుకుంటూ హాలులోకి వెళ్ళాడు అక్కడా యజమాని కనబడలేదు ఇంక చెయ్యవలసిందొక్కటే ఫాగ్ గది ఏదో ఎక్కడుందో కనుక్కోవడం 'ఆ పేరు గల ఆసామీ ఎవరూ ఉన్నట్టు లేరే" అన్నాడు అక్కడి ఉద్యోగి

"కాస్త దయుంచి జ్ఞాపకం చేసుకోండి నేను చెప్పే ఆయన పొడుగ్గా ఉంటాడు. దర్జాగా బింకంగా ఉంటాడు ఎవరితోనూ మాట్లాడడు. ఆయన కూడా ఒక ఆడపడుచు .."

"అసలీ ఓడమీద ఆడవాళ్ళెవరూ లేరే .... కావాలంటే ఇదిగో ప్రయాణికుల పేర్ల జాబితా చూసుకోండి" అంటూ పుస్తకం చూపించాడు ఉద్యోగి. పాస్పార్టూ జాబితా అంతా చూశాడు. తన యజమాని పేరు కనబడలేదు ఆశ్చర్యపోయాడు అంతలో అతనికి సరికొత్త వూహ పోయింది.

"ఒకవేళ కొంపదీసి—అసలు ఈ స్టీమరు పేరు కర్ణాటికేనా ?" అన్నాడు.

"అవును"

"ఇది ? యోకహామా వెళ్లేదేనా ?"

"అక్షరాలా."

ఆ ఆశ కూడా పోయింది తను పొరబాటున ఒక ఓడ కొకటి అనుకుని ఎక్కివుండవచ్చు ననుకుందికి కూడా వీల్లేదు యజమాని ఇందుమీద ఎక్కలేదన్నమాట

ఉసూరుమంటూ కుర్చీలో కూలబడ్డాడు పాస్పార్టూ. నెత్తిన పిడుగు పడ్డట్టయిపోయి నిశ్చేష్టుడై కూర్చున్నాడు హఠాత్తుగా మెరుపులాటి ఆలోచన వచ్చింది. అవును కర్ణాటిక్ అనుకున్న వేళకన్న ముందర బయల్దేరిపోయింది. ఈ సంగతి తానువెళ్లి యజమానికి చెప్పివుండవలసింది. చెప్పాలనే అనుకున్నాడు కాని, చెప్పలేదు. తనదే తప్పు వాళ్ళ కసలు తెలిసిఉండదు అంచేత ఓడ తప్పిపోయి ఉంటుంది. వాళ్ళు వెనక దిగబడ్డారన్నమాట.

తనదే తప్పు తన దేమిటి. అసలు ద్రోహి వాడు. ఆ ఫిక్సుగాడు. ఆ దుర్మార్గుడే ఇంత చేశాడు.

ఇపుడు బోధపడుతూంది. తనని ఎలాగైనా ఆపాలని బాగా తాగించాడు మనచేత ఇంకేముంది ఇపుడు సర్వనాశనం యజమానికి పందెం పోయి ఉంటుంది బహుశా ఈపాటికి అరెస్టయి బందిఖానాలో కూడా పడిఉంటాడేమో బాధ దుఃఖం ముంచుకొచ్చాయి. జుట్టు పీకేసుకున్నాడు పాస్పర్టూ .... ఆ ఫిక్స్ అనేవాడు తనకు మళ్లీ ఎదరపడాలి తన చేతులో పడాలి . అప్పుడు తను వాడి పని పట్టాలి

కోపం, దుఃఖం సర్దుకున్నాక, స్థిమితంగా కర్తవ్యం ఆలోచించుకున్నాడు పాస్పర్టూ. జరుగుతున్న కథ ఏమంత అద్భుతంగా పోయిగా లేదు. ఇప్పుడు జపాను వెళ్లి పడడానికేమీ బాధలేదు. చేరడం ఖాయమే కాని అక్కడినుంచి కదిలి వెళ్లడం ఎలా ? జేబులు కాళీ, షిల్లింగు కాదు ఒక పెన్నీ కూడా లేదు అదృష్టవశాత్తు ఈ ఓడమీద ప్రయాణానికి, అన్నపానాలకీ డబ్బు ముందరే కిట్టేసిఉంది అందువల్ల అడంగి చేరేవరకూ ఐదారు రోజులపాటు తిని కూర్చుని ఆలోచించుకోవచ్చు ఆలోచన ఎలావున్నా, అతని తిండి గురించి చెప్పుకొనడానికి భాష చాలదు వర్ణనాతీతం. ఆయొక్క దుఃఖంకొద్దీ యజమాని తరఫునా, ఆయూదా తరఫునా (తన తరఫున సరేసరి) కూడా ఎడతెరపి లేకుండా ఆరగించాడు పాస్పర్టూ. ఇలా అలా కాదు తను వెళ్లి దిగబోయే జపాను దేశం ఎడారి అయి అక్కడ నోట్లో వేసుకునే దేదీ ఉండబోదన్నంతగా తిని తాగాడు

13 వ తేదీ ఉదయం పోటుమీద కర్నాటిక్ యోకహామా రేవులో ప్రవేశించింది పసిఫిక్ సముద్రయానాలలో ఇది ముఖ్యమైన కేంద్రం ఉత్తర అమెరికా చైనా, జపాన్, మలే దీవుల మధ్య తిరిగే మెయిలు, పాసెంజరు ఓడలన్నీ ఇక్కడ ఆగుతాయి యోకహామా జెడ్డో అఖాతం మీది రేవు. జెడ్డో మహానగరం దీనికి దగ్గరే అది జపాను సామ్రాజ్యానికి రెండవ రాజధాని అంటే పూర్వం ఇద్దరు సమ్రాట్టులున్న రోజుల్లో పౌరపాలకుడు టైకూన్ పీఠం యిక్కడ ఉండేది. ఇతని శత్రువు, మతపాలకుడు—దేవతల పుత్రుడు మియకో తన పీఠాన్ని మికాడో నగరంలో నెలకొల్పుకొని ఉండేవాడు

ఇనతనూజలసీమ — జపానుదేశంమీద విషాదమేఘావృతమైన హృదయంతో ప్రవేశించి కాలు పెట్టిన పాస్పర్టూకు రెండో అడుగును ఎటు వేపు వెయ్యాలో తోచలేదు. అదృష్టమే దారి చూపుతుందని నమ్ముకుని కంటికి నదరైన వేపు అడుగు వేసి పురవీధులలో తిరగసాగాడు ముందర అతను వెళ్లినది నగరంలో యూరపియన్‌ల వాడ ఇళ్లన్నిటికీ సింహద్వారాలు బాగా దిగువకు ఉన్నాయి. చుట్టూరా అందమైన వసారాలతో, నాజూకైన స్తంభాలతో చూడ చక్కగా ఉన్నాయి విశాలమైన వీధులు, చౌకులు, పెద్ద పెద్ద గిడ్డంగులు ఉన్న ఆ వాడ నది ఒడ్డునుండి ''ట్రిటీ ప్రోమోంటరీ'' (సింధుశాఖ) వరకూ విస్తరించి ఉంది కలకత్తాలో లాగే ఇక్కడా అమెరికనులు, ఇంగ్లీషువాళ్లూ, చైనీయులు, డచ్చివాళ్లు, ఇంకా అనేక దేశాలవారూ, జాతులవారూ ఉన్నారు. వారిలో చాలమంది వర్తకులు ఏది పడితే అది అమ్మేవారు. ఏది పడితే అది కొనేవారు. ఆ గందరగోళం మధ్య ప్రెంచివాడు పాస్పర్టూకు దాదాపు మతిపోయింది అంతా విడ్డూరంగా ఉంది ఏహాటెన్‌టాట్‌ల దేశంలో ఉన్నట్లనిపించింది ఇక్కడ అతని సంగతి పట్టించుకునేవారు లేకపోలేదు అతను ప్రెంచి, ఇంగ్లీషు కాన్సలేట్‌లకు వెళ్లి తన సమస్య చెప్పి సాయం అడగవచ్చు కాని దానితోపాటు కథ అంతా చెప్పుకురావాలి—తన యజమాని సంగతి, ఫిక్స్ సంగతీ అంతా అది సుతరామూ నచ్చలేదు మిగతా ప్రయత్నాలు చేసి ఇంకేదారి లేకపోతే ఈదారి చూదామని నిశ్చయించుకున్నాడు.

యూరపియన్‌ల వాడలో వీధి వీధీ తిరిగాడు ఎంత తిరిగినా అదృష్టం ఎదురై సలహా లివ్వలేదు. సాయం చెయ్యలేదు ఆ వాడ వదలి జపానీయుల వాడ ప్రవేశించాడు అక్కడా కలసి రాకపోతే మెల్లిగా 'జెడ్డో' నగరానికి రోడెక్కాలనుకున్నాడు.

యోకహామాలో స్థానికులంతా నివసించే ప్రాంతాన్ని బెన్‌టెన్ అంటారు. అక్కడా, ఇరుగు పొరుగు ద్వీపాలలోనూ జనులు ఆరాధించే సముద్ర దేవత పేరిట ఈ వాడ వెలసింది ఇక్కడ మహా వృక్షాలు పుష్కలంగా ఉన్నాయి విచిత్రమైన శిల్పంతో విలసిల్లే విశాలద్వారతోరణా లున్నాయి కాలువల దగ్గర రెల్లు వెదురు పొదలు ఏపుగా పెరిగి ఉన్నాయి. పెద్ద పెద్ద వంతెనలు కూడా వాటి చాటున ఇమిడి దాగినట్లు కనిపిస్తాయి. మహావృక్షాల చిక్కటి, చల్లటి నీడ మాటున ఆలయా లున్నాయి. బౌద్ధ భిక్షువులు ఆచార్యులు అక్కడ నివసిస్తారు. కన్‌ఫ్యూషియస్ మతానికి చెందిన వారుకూడా ఈ ప్రాంతంలోనే ఉంటారు జనావాసాల మధ్య, వీధులలో వందలకొద్దీ పిల్లలు కేరుతూ, గెంతుతూ ఆడుకుంటూ ఉంటారు బొద్దుగా, గులాబీరంగు కాంతు లీనుతూ ఎర్రటి బుగ్గలతో ముద్దొచ్చే ఆ పిల్లలు—వాళ్లకాళ్ల మధ్య అటూ యిటూ పరుగులు పెడుతూ ఆడుకునే పొట్టికాళ్ల పూడిల్ కుక్కలూ—తోకలు లేని పచ్చటి పిల్లులూ—ఆ సందడి, ఆ సంతోషం ఉత్సాహకరంగా ఉంటుంది ఆడుకునే పిల్లలతోనే కాక, ఎప్పుడూ వచ్చే పోయే జనంతో వీధులు రద్దీగా ఉంటాయి తంబురాలు మీటుకుంటూ పోయే మతాచార్యులు, లాంఛనాలన్నీ పెట్టుకు ముస్తాబై పోయే పోలీసు అధికారులు, సుంకాల ఉద్యోగులు, గస్తీవాళ్లు, సైనికులు, సైనికాధికారులూ మొదలైన వాళ్లతో ఆ వాడ అంతా కలకల లాడుతూంది చైనాలో సైనికులను ఎంత తిరస్కారభావంతో చూస్తారో ఇక్కడ అంత గౌరవంగా, ఆదరంగా చూస్తారు. అందుకని సైనికాధికారులు అన్ని హోదాలవారు సర్వ లాంఛనాలతోనూ అలంకరించుకుని సగర్వంగా విలాసంగా విహరిస్తారు పౌరులు, తైర్థికులు కూడా ఉచిత రీతిన అలంకరించుకుని తిరుగుతారు. అక్కడి వారంతా తామ్రవర్ణులు. ఛాయా భేదాలు ఎన్ని ఉన్నా ప్రధాన వర్ణం ఒకటే. చైనీయులలా పసుపు ఛాయ మాత్రం ఎక్కడా కనబడదు. చైనీయులకూ, జపాను దేశీయులకూ ప్రధానంగా ఈ అంశంలో భేదం ఉంది ఇక పాదచారులు కాక వాహనాలమీద వెళ్లేవా రెందరో ఉంటారు. వాహనాలు గూడా అనేక రకాలు అనేక రంగులు బళ్లు, బగ్గీలు, తెరలు వేసిన తోపుడు బళ్లు 'నారిమోన్'లు, వెదురుబద్దలతో కట్టే 'కాంగో'లు ఎన్నో ఉన్నాయి. ఆ దేశపు స్త్రీల కళ్లు బిగలాగినట్లు విప్పారి ఉంటాయి. మూపులు ఎత్తుగా ఉంటాయి ఆ కాలపు ఫాషన్‌లను బట్టి పళ్లను నల్లగా ఉంచుకుంటారు. బుల్లి బుల్లి పాదాలతో చిన్నచిన్న అడుగులు వేస్తూ నడుస్తారు పాదరక్షలు కూడా చూడ ముచ్చటగా ఉంటాయి కాన్వాసు జోళ్లు, ఆకు జోళ్లు, పావుకోళ్లు రకరకాలు జాతీయ వస్త్రాలయిన 'కిరిమోన్' లను చాలమంది ధరిస్తారు. అది ఒకవిధమైన ''డ్రెసింగ్ గౌను''లా ఉంటుంది అది వెనుకొని చక్కటి పట్టు ధట్టీ కట్టుకుంటారు ఐమూలలనుంచి, ధట్టీకి వెనక పెద్ద ముడి అందంగా మడిచి ఉంటుంది. పారిసులో స్త్రీలు దీనినే ఫాషన్‌గా స్వీకరించినట్టు తోస్తుంది.

(ఇంకావుంది)★

## జరిగిన కథ

80 రోజులలో భూప్రదక్షిణం సాధ్యమని 20 వేల పౌన్లు పందెం వేసి సేవకుడు పాస్పార్టుతో బయలుదేరతాడు ఫిలియాస్ ఫాగ్. బాంకు దొంగ ఫాగ్ దొరికొడని, అరెస్టుకు బొంబాయికి వారంటు పంపమనీ లండన్‌కు టెలిగ్రామ్ పంపి, ఫాగ్ వెంట సూయజునుంచి బొంబాయికి చేరతాడు డిటెక్టివ్ ఫిక్స్. కాని వారంటు చేరలేదు. బొంబాయినుంచి కలకత్తాకుకు రైలుబండిలో ప్రయాణం అవుతాడు ఫాగ్. కోల్భీల్ వద్ద బండి ఆగిపోగా గత్యంతరం లేక ఏనుగుతో అలహాబాదు వెళ్ళుతారు. దారిలో ఖలవంతంగా సహగమనానికి పోతూఉన్న అయూదాను రక్షించి ఆమెతో కలకత్తా చేరుకొంటాడు ఫాగ్. అక్కడ వారిని నిలపడానికి ఫిక్స్ చేసిన యత్నం విఫలమైంది. ఫాగ్ ప్రభృతులు 'రంగూన్' ఓడలో పయనం ప్రారంభించారు. ఆ ఓడలో వే ఉన్నాడు ఫిక్స్. ఫాగ్‌ను అరెస్టుచేయడానికి ఫోగట్టా సేకరించాలని పాస్పార్టూను చేరదీశాడు. కాని అంతు చిక్కలేదు. లండన్ విడిచిన 36 రోజులకు హాంకాంగ్ చేరుకొని, అయూదాతో 'కర్ణాటిక్'లో యోకహామా ప్రయాణానికి ఏర్పాటు చేసుకొన్నారు. కాని ఆ ఓడ తప్పిపోయింది. దానిని షాంగ్ హైలో అందుకు నేందుకు ఫాగ్ "టాంకి డియర్" అనే పడవను కుదుర్చుకొని బయలుదేరాడు. పడవ ఫోకియన్ జలసంధి ప్రవేశించాక తుఫాను వచ్చింది.

తర్వాత వచ్చి రచ్చబండవద్ద కూచో గానే చెట్లక్రింద ఆడుకుంటోన్న మేమంతా వెళ్ళి తాతను చుట్టేసే వాళ్లం. తాత ఎంతో ఆప్యాయంగా మాకు ప్రతిదినమూ ఎక్కడెక్కడివో కథలు చెబుతుండేవాడు. అతడీ ప్రపంచంలో ఏకాకిగానే పుట్టాడేమో! 'తన' అనుకునేవాళ్లెవరూ అతనికి లేరు. అయినాసరే తాత మాంఛి సంతోషంగా కనిపించేవాడు. ఏదోవిధంగా తనబ్రతుకు తాను గడుపుకునేవాడు. అతనికి మనసులో రకరకాల భావాలు కదలాడుతూ వుండేవి. మాకు రోజూ కథలు చెప్పటద్వారా అతడు తన భావాలను తృప్తిపరచుకునేవాడు. తాతమొహంలో ఎన్నడూ మాకు చిరాకు కన్పించనే లేదు.

తాత ఓరోజు ఓచక్కని కథ చెప్పాడు—సప్తసముద్రాల కవతల, నవద్వీపాలూ దాటిపోతే ఓ శ్వేత ద్వీపం తగుల్తుంది. అక్కడ ఎంతో కాలంనుండి ఒక సన్యాసి తపస్సు చేసుకుంటూ వుంటున్నాడు. అతని గొప్పతనం యింతా అంతా కాదు, సూర్యుడూ చంద్రుడూ వంతుల ప్రకారం ఆ ద్వీపాన్ని చుట్టివస్తూ వుంటారు. ఏనాడూ అక్కడ చీకట్లు వ్యాపించవు ...ఆ ఋషిప్రభావం అటువంటిది. ఆయనకు ఒక కూతురు వుంది. ఆమె అందాన్ని గూర్చి ఎంతచెప్పినా తక్కువే. అచ్చు పుత్తడి బొమ్మ. అందమంతా కూడగట్టుకుని ఆ అమ్మాయి జన్మించిందేమో అన్నట్టు వుంటుంది. ఆమెను పొందడానికని దేవతలూ, మానవులూ అనేక ప్రయత్నాలుచేశారు. కాని, ఆ ఋషిమహిమకు తాళలేక అందరూ తమ ప్రయత్నాలలో ఓడిపోయారు. ఆ ఋషికన్య అలాగే వాడనచెడని పువ్వులా ఉండిపోయింది. ఈ విషయం ఆ నోటా ఆనోటా లోకమంతటికీ తెలిసిపోయింది.

— అదీ తాత చెప్పిన కథ. ఆనాడు అతడు చెప్పిన విషయాలు ఏవీ అంతగా అర్థం కాలేదు. ఋషికన్య ఎర్రగా, అందంగా వుంటుందనీ, మాతోపాటు ఆడుకుందుకు బాగా యిష్టపడుతుందనీ అప్పుడు నాకు అనిపించింది. ఆనాటి నాచిన్న బుర్రతో ఆ అమ్మాయీ, నేనూ కలిసి తీరుతీరుల ఆటలు ఆడుకుంటున్నట్టుగా; చెట్టాపట్టాలు వేసుకుని ఎక్కడెక్కడో తిరుగాడుతున్నట్టుగా నాలోనేను అమాయికంగా ఊహించుకుని ఉబ్బిపోయేవాణ్ణి. అదంతా బాల్యదశ.

కాని ఇప్పుడు నేను కొంత పెద్దవాడినయాను. క్రమంగా నాలో యవ్వనం మొలకలెత్తింది. దానితోపాటు ఆనాడు తాతచెప్పిన కథ తాలూకు భావాలు నాలో స్పష్టమైన ఆకారం దాల్చుకోసాగినాయి. ఆ ఋషికన్యను గూర్చి పరిపరివిధాలుగా ఊహించుకున్నాను. ఆమెను పొందడానికిగాను పెక్కువిధులను నిర్వహించవలసి వుంటుందని తాత చెప్పాడు. ఆ విధులేమిటో ఎంత ఊహించినా నా మెదడుకు అంతుబట్టలేదు. అయినా సరే, ఆమెను



పొందనిదే నా జీవితం పూర్ణం కాదనిపించింది. బహుశా నేను పుట్టినదే ఆ కన్యకోసమేమో ననికూడా అనిపించింది.

## 2

నాకు పరిపూర్ణమైన యుక్తవయసు రాగానే ఎంతోమంది నాకు తమకూతుళ్లనిచ్చి పెళ్లి చేయడానికి మా యింటిచుట్టూ రాకపోకలు సాగించారు. మా నాయన లక్షాధికారి. ద్వీప-ద్వీపాంతరాలతో సముద్రమార్గాన నౌకావ్యాపారం నిర్వహించి లక్షలు గడించాడు. నాకు యింటివద్దనే తగిన గురువులతో విద్యాబుద్ధులు చెప్పించాడు. అందచందాలూ ఏమంత తక్కువవిగావు. ఈ స్థితిలో మాతో వియ్యమందుకోడానికి ఎవరైనా ఉబలాటపడతారంటే ఆశ్చర్యం ఏముంది? అయినా, అదేమిటోగాని నాకు యీ సంబంధాలేవీ నచ్చలేదు. అంచేతే, మా వాళ్లు నా పెళ్లిప్రస్తావన తెచ్చినప్పుడు ఊరికే ముభావంగా ఉండిపోయేవాణ్ణి. చాలా రోజులు యిలాగే వెళ్లమారినాయి. నా మనసులోని విషయం స్వయంగా చెప్పేవరకూ మా వాళ్లకు తెలిసే అవకాశంలేదు. పోనీ, దానిని చెబుదామంటే అదీ అంత ఉచితంగా తోచలేదు. దీనికి స్వస్తివాచకం ఎలా పలకాలో ఎన్నివిధాలుగా ఆలోచించినా లాభం లేకపోయింది. ఊరికే లోపల్లోపల బాధపడసాగాను.

తలవనితలంపుగా ఈ మధ్యన అట్లాంటి అవకాశం ఒకటి కలిసి వచ్చింది. ఓ రోజు మా నాయన నన్ను చేరబిలిచాడు. "నాయనా, సోమశేఖరా! కోట్లకు పడగలెత్తిన

# ఋషి కన్య

కుటుంబాలు మనతో సంబంధం పెట్టుకోవాలని ఆరాటపడుతున్నారు. అందానికి అందం, డబ్బు, గౌరవము... అన్నీ వున్నవారే వస్తున్నారు. వారిలో ఎవరినిగూర్చి విన్నా నీ మొహంలో ప్రసన్నత కన్పించుటలేదు. నీవు మాకు ఒక్కగానొక్క సంతానము. నీకేవిధంగానూ బాధకలగకుండాలని మా వాంఛ. నీవు నీమనోరథం నిర్భయంగా చెప్పవలసింది. నా సాధ్యమైనంతవరకూ దానిని తీర్చడానికి ప్రయత్నిస్తాను" అన్నాడు.

మా నాయన అలా అనునయం చేసినందుకు నా సంతోషం చెప్పడానికే లేదు. ఏదోవిధంగా నా మనోవాంఛను సాధించుకొనుటకు ఇంతకంటే అదను లభించడం కష్టం. పైగా ముందుముందు పరిస్థితులు ఎలా మారుతాయో! అంచేత ధైర్యం కూడగట్టుకుని ఇలా చెప్పాను—

"నాయనగారూ! మీరు నాకు పూజ్యులు. నా నిమిత్తమై మీరు ఏమి నిర్ణయించినా, భావిజీవితంలో అది నాకు యితోధికంగా మేలు చేసేదే అవుతుందని నేను విశ్వసిస్తున్నాను. నేను మీకు ఏకైకపుత్రుణ్ణి అయినందున నన్ను సంతోషపెట్టడానికి మీరు మనస్ఫూర్తిగా ఇష్టపడతారని నాకు తెలుసు. అందుకే, నా కోరికను మీ సమక్షంలో, నివేదించుకోడానికి సాహసిస్తున్నాను. మీరు అనుభవజ్ఞులు. మీకు తెలియని ధర్మం లేదు. సమర్థుడైనవాడు స్వయంగా సంపాదించనిదే గృహాభారం నిర్వర్తించుటకు అర్హుడుకాడని పెద్దలు చెప్పకొనగా విన్నాను. తదనుసారము నాకున్నూ వివాహానికి ముందుగా ధనసంపాదన చేయవలెనని మనసుకలుగుతున్నది. తలిదండ్రుల సిరిసంపద ఎంత వున్నప్పటికీ స్వయంగా కష్టపడి ఆర్జించుటమూలంగా అనుభవమూ, ఆనందమూ రెండింతలవుతాయని తెలిసినవారంటారు. ఇదే నా కోరిక."

మా నాయన ఓ దీర్ఘనిశ్వాసం విడిచాడు. "వాస్తవమే నాయనా! నీవు మన కులోచితమైనమార్గమే ఆలోచించావు. స్వయంగా కష్టపడి ఉదరపోషణకు ప్రయత్నించడమే నిజమైన పురుషార్థము. నీకింత చక్కని ఊహ తట్టినందుకు నేను లెస్సగా సంతోషిస్తున్నాను. యదార్థంలో నిన్ను వదలి వుండటం నాకెంత బాధగా ఉంటుందో చెప్పలేను. మీ యమ్మ నీ వియోగంతో వృద్ధాప్యంలో మరీ నీరసించిపోవచ్చును. అయినా సరే, యీ విషయంలో నిన్ను నేను అభ్యంతరపెట్టదలుచుకొలేదు. ఇక మీదట నీ అభీష్టం సంపూర్ణంగా నెరవేరుగాక! రేపే నీ ప్రయాణం కోసం ఏడు నౌకలు సిద్ధం చేయించివుంచుతాను. అవసరమైన సంబారమంతా కట్టాయితం చేసుకుని, నీకు అనుకూలమైన రోజున బయలుదేర

రమేష్ — ఒరేయ్ బ్రదర్! ఎక్కడయినా ఇల్లు ఖాళీగా వుంటే చూడరా!

స్నేహితుడు—ఎందుకూ! మీ అత్తవారింట్లో ఉండరాదూ?

రమేష్-ఆ! మా అత్తవారే వారి అత్తవారింట్లో ఉన్నారురా!

కె. బన్సీలాల్ (నిజామాబాదు)

వలసింది," అంటూ మా నాయన నాకు అనుమతి ప్రసాదించాడు.

నాయనగారి ఆజ్ఞమేరకు ఏడు నౌకలూ సిద్ధం చేసుకుని మందీమార్బలంతో సరిగ్గా ఏడవనాడు ప్రయాణానికి బయలుదేరాను. నన్నంతో గారాబంగా పెంచుకున్న నా జననీ జనకులకు నన్ను యిలా ఒంటరిగా దూరదేశాలకు పంపడం భరింపరాని విషయం. అది ఎవరికైనా సహజమే. నన్ను వీడ్కొలుపుతున్నపుడు వాళ్ళ కన్నుల్లో నీళ్లు తిరిగాయి. నాకూ ఎలాగో అనిపించింది. కానీ, మరొకవైపున నాకు అమందానందం కలుగనున్నదన్న ఆశ నన్ను దిటవుగా వుంచింది. నన్ను సాగనంపడానికి వచ్చిన వారివద్ద సెలవు తీసుకుని, నాకై ప్రత్యేకింపబడిన నౌకలో కూచునే టప్పటికి ఏదో చెప్పరాని మధురానుభూతి నన్ను పులకింపజేసింది. అప్పుడు నా సంతోషానికి హద్దులు లేకపోయినాయి.

## 3

దారిలో ఎదురుపడిన ప్రతి ద్వీపంవద్దనూ కొంతకాలం ఆగి మేం వ్యాపారం చేశాం. అందువల్ల మాకు బహుసువర్ణముద్రికలు లభించడమేగాక ఆయా ద్వీపవాసుల ఆచార-విచారాలూ, వేషభాషలూ తెలుసుకోవడంతో మా ప్రపంచ పరిజ్ఞానం పెరిగిందని చెప్పనక్కరలేదు. అలా మూడు సంవత్సరాలూ నిరాఘాటంగా ప్రయాణించి, చివరికి ఓ వింత ప్రదేశం చేరుకున్నాం. అక్కడి ప్రజలు అడవిజంతువుల తోళ్లనూ, నీటిజంతువుల ఎముకలనూ అలంకారాలుగా ధరించడం చూసి నాకు భలే ఆశ్చర్యంవేసింది. ఇక్కడినుండి నా గమ్యస్థానమైన శ్వేతద్వీపం యిక కేవలం నెల

రోజులు దూరంలో ఉండటంవల్లనూ, గృహంనుండి బయల్దేరిన తరువాత అనేక విచిత్రదృశ్యాలు చూడగలిగినందుకున్నూ మేమంతా అక్కడ పెద్ద పండుగ జరుపుకున్నాం. కొన్నిరోజులు అక్కడ విలాసంగా గడిపి, పరివారంలోని పెక్కుమందినీ, ఆరు నౌకలనూ అక్కడే వదిలేసి, కొద్దిమందిని, వెంటతీసుకుని, నా ఒక్క నౌకతో ముందుకు సాగిపోయాను. గమ్యస్థానం రోజురోజుకూ దగ్గరపడుతూ వుంటే, వింతవింత ఆలోచనలు నా బుర్రను వుక్కిరిబిక్కిరి చేయసాగినాయి.

ఏడెనిమిది రోజుల్లో మా నౌక మరొక సముద్రంలో ప్రవేశించింది. అప్పుడా సముద్రం అచ్చు శరత్కాలంలోని ఆకాశంలా మనోహరమైన కాంతు లీనుతోంది. శరత్తులోని మేఘాలకు మల్లేనే ఆకడలిలోకూడా ఆయాచోట్ల పెద్దపెద్ద హిమశిలలు తేలియాడుతున్నాయి. అవి అలా కర్వతాల్లా వుంటంవల్ల మా నౌకాయానానికి ప్రమాదం సంభవిస్తుందేమోనని మేం భయపడ్డాం. వాటి మధ్యగా ముందు దారి కనిపెట్టడం దుస్తరంగా మారుటవల్ల నౌకలోని వారంతా గుడ్లు తేలవేశారు. ఇక ముందుకు పోవడం సుతరామూ పడదని నన్ను ఒప్పించడానికి వాళ్ళు చాలా తంటాలుపడ్డారు.

కానీ, నేనది ఎలా అంగీకరించగలను? నా ఊహాసుందరి నివాసానికి యింత సమీపంగా వచ్చిన్నీ పిరికి పందవలె వెనుదిరిగిపోవడమా! ఆ విషయం ఊహించినమాత్రాన్నే నా తల తీసివేసి నట్టనిపించింది. ఆరునూరయినా, ప్రాణాలు తారున ఎగిరిపోయినాసరే, ముందుకు పోక తప్పదు. ఎవరికైనా సరే, అపూర్వమైన సౌఖ్యాన్ని అనుభవించే ముందు యిడుములపాలు గాక తప్పదేమో!

నేను నాతోటివారికి ధైర్యం చెబుతూ, ఉత్సాహపరుస్తూ, స్వయంగా నౌకకు మార్గదర్శకత్వం

---

**ఖడ్గమృగం**

జడ్జి—"అది సరేనయ్యా! అతడెప్పుడో రెండేళ్ల క్రిందట ఖడ్గమృగం అంటే ఇప్పుడు దావా వేశావెందుకు?

ఫిర్యాది—(తడుముకోకుండా) "నేను యిన్నిరోజులు ఖడ్గమృగాన్ని చూసిన పాపాన పోలేదు. నిన్ననే చూశానండి.

షేక్ ఇక్బాల్ అహమ్మద్
(బ్రిటగుంట)

---

కూడా చేశాను. ఆ మంచురాళ్ల నడుమగా నౌక సాగుతూవుంటే ఒకటి రెండు తడవలు మేం ఆపదకులోనయ్యాం. కాని చివరికి యుక్తిగా పిసరంత ఎడంలో ఆపదలనుండి తప్పించుకోగలిగాం. తొలిగండమూ, మలిగండమూ తప్పేటప్పటికి మాకు పునర్జన్మ ఎత్తినట్లయింది.

ఆ సముద్రంలో దాదాపు పది రోజులు ప్రయాణం చేశాక ఆవలి ఒడ్డు చేరుకున్నాం. అక్కడి నుండి మసకమసకగా శ్వేతద్వీపం సరిహద్దులు కన్పించగానే నా ప్రాణాలు లేచివచ్చాయి. దాంతో యిక పర్వాలేదనే ధైర్యం చిక్కి నావెంటనున్న పరివారన్ని, నౌకనూ అక్కడే వదిలేసి, ఒంటరిగా శ్వేతదీపం వైపు వెళ్లిపోయాను.

శ్వేతద్వీపమున్నూ పూర్తిగా మంచుమయమే. అంచేత ముందుకు పోతున్నకొద్దీ నా కాళ్లు, చేతులు చలితో కొంకర పోవసాగినాయి. నేను దాదాపు ప్రాణరహితుణ్ణయి పోయాను. ఇంతజరిగినా, ఏదో మొండి ధైర్యమూ, తెంపులేని ఆశా నన్ను ముందుకునెట్టుతూనేవున్నాయి.

మరికొంతదూరం పారిపోయేసరికి రమారమి మనిషిపాటి ఎత్తు కలిగి, వూగులాడుతూ, వయ్యారంగా నడుస్తూ నాకేసివస్తోన్న వింత పక్షులుకొన్ని కంటబడినాయి. ఈకలు నిండిన రెక్కలతో వాటి శరీరాలు పూర్తిగా కప్పబడిపోయాయి. అవి తమలోతాము ఏమిటో సము భాషలో మాట్లాడుకుంటూండటం చూసి ఆశ్చర్యమూ; వాటి విచిత్రాకారాలను చూసి భయమూ నన్ను ముప్పిరిగొన్నాయి.

నేనాశకుంతాల భావమైతే అర్థంచేసుకోలేకపోయాను. కాని, అవి నాకు స్వాగతం పలకడానికే అలా వేంచేస్తున్నాయని ఎందుకో నాకనిపించింది. ఈ నా అనుమానం సమంజసమైనదేనని తరువాతి సంఘటనలు రుజువు చేశాయి. నాకా భావం రావడమే తడవుగా, ఎంత భయంగా వున్నప్పటికీ, అక్కడే ఆగిపోయాను. ఇంతలో అవి నన్ను సమీపించి, నా చుట్టూ రెక్కలు విప్పుకుని కలకలారావంతో మూగినాయి. తన్మూలంగా వేడిగాలి సోకి నాకు మామూలుస్వస్థత చేకూరింది. ఇక ఏమాత్రం ఆలస్యం చేయకుండా వాటిల్లో కొన్ని నాకు దారి చూపుతూనూ, మిగతావి నాకు రక్షగా వుంటూనూ ఋషి ఆశ్రమం వేపు కదిలినాయి. అప్పటికి గానీ నా బెరుకు పూర్తిగా తీరిపోలేదు.

(ఇంకావుంది)




AGENTS FOR ANDHRA
ఆక్కిలేడ్ ఏజన్సీస్
P. B. No. 116
విజయవాడ-1

# పట్టుబడిన దొంగ

(35 వ పేజీ తరువాయి)

నీలో ఎందుకు నాశనం అయ్యింది? నిత్యం చూస్తున్న మనిషేగా .....

తండ్రి పటం నుండి ఆ మాటలు వస్తున్నట్లు అనుకున్నాడు అతను నిద్ర పట్టని అతని మనస్సుకూ, హృదయానికీ సంఘర్షణ ప్రారంభ మయ్యింది

నిశ్చింతగా వివాహం చేసుకుని నీ ఆస్థిని అనుభ వించరాదూ ? యిలాంటి పనులు చెయ్యకపోతే ...

ఈపాటికి నువ్వు చేసిన దొంగతనం బట్ట బయలు అవుతుంది రాధకు తెలుస్తుంది ఆమె ఎంత విలపిస్తుందో వూహించావా ? నిన్ను ద్వేషిస్తుంది ఆమెమీద ప్రమాణం చేశావే ... చాలా సంవత్సరాలు మాని నిగ్రహావంతుడవైనావే . యీనాడు మళ్లా ఆ నిగ్రహం కోల్పోయి అల్పుడవైనావు ... ఆరిన అగ్నికి ఆర్జ్యం పోసినట్లు అయింది ఆమె ప్రేమనుండి దూర మవ్వడానికి యింతకన్నా ఏం కావాలి ? .... ఇంతకన్నా నీచుడవైనా ఆమె చింతించేది మటుకూ యింతే

అతను ఆవేశంతో పక్కమీంచి లేచికూర్చున్నాడు

"వెళ్లు. నీ తప్పును నువ్వు ఒప్పుకుని పోలీసుల స్వాధీనమయి నీ ప్రవర్తనను నిరూపించుకో!

కాంత్ యింటికి తాళంవేసి స్కూటరు ఎక్కి బయలుదేరాడు

*

భుజంగరావు తిరిగి యింటికి వచ్చేసరికి మూడున్నర అయింది తలుపు తీసిన రాధను చూసి 'ఇంకా నిద్రపోలేదా అమ్మా' అన్నాడు రాధ మాట్లాడకుండా కన్నీరు వత్తుకుంటూ మేడ మీదికి వెళ్లిపోయింది. భుజంగరావు ఆమెను అనుసరించాడు ఇద్దరూ ఆమె రూములోకి వెళ్లారు

"రాధా, అలా కూర్చో అమ్మా, నీతో ఒక ముఖ్యమయిన విషయం చెప్పాలి" అన్నాడు భుజంగరావు కుర్చీలో కూర్చుంటూ రాధ మంచం మీద కూర్చుంది

"అతను మళ్లా దొంగతనం చేశాడు"

ఆమె ఏమీ మాట్లాడలేక పోయింది భుజంగరావు కూతురు ముఖం వంక చూస్తూ ఉండి పోయాడు

"పట్టుకున్నారా !" ఆమె తండ్రి ముఖంలోకి చూడకుండానే అడిగింది

"లేదు కానీ తలుచుకుంటే పట్టుకోడం అంత కష్టమయినపని కాదు"

ఆ మాటలు రాధకి ఆనందం కలుగజేశాయి. తన తండ్రి అతన్ని పట్టుకోదల్చుకోలే దన్నమాట. ఆమె హృదయం తేలిక అయినట్లు ఆనంద పడింది

"రాధా, అతను మళ్లీ దొంగతనం చేసిన తర్వాత కూడా నీ నిశ్చయం మారదా ?"

ఆమె సమాధానం చెప్పలేదు రెండు క్షణాలు నిశ్శబ్దం రాజ్యం చేసింది

'ఇదే మొదటి సంఘటనా .... లేక, మామూలుగా చాలా జరిగాయా నాన్నగారూ' ఆమె ధైర్యం కూడక గట్టుని ప్రశ్నించింది.

లేదమ్మా, గత రెండు సంవత్సరాల నుండి అతనిమీద ఏ "నింద" లేదు నీకు మాట యిచ్చి సక్రమ నడుచుకున్నాడు. కానీ .. నివురు గప్పినా నిప్పు—ఎప్పుడూ అది నిప్పే తల్లీ .."

"నాన్నా !" అంటూ ఆమె మంచంమీద పడుకుని వెక్కి వెక్కి ఏడ్వసాగింది. భుజంగరావు కూతురు తల నిమురుతూ "పిచ్చితల్లీ! ఏడవకు" అనేసి వెళ్లిపోయాడు

తర్వాత కాంతమ్మ వచ్చి కూతుర పక్కన కూర్చుంది. "పిచ్చితల్లీ ... ప్రేమ .... అసలా పదం మా కాలంలో పుట్టనే పుట్టలేదమ్మా, తలిదండ్రులు ఎవరిని వెలికి నిశ్చయిస్తే వారినే చేసుకున్నాం . తాళి కట్టేవరకూ మీ నాన్నగారి ముఖం నేను ఎరుగను అలాగే మా నాటి వివాహాలు జరిగిపోయాయి ఏం ? ఆ పెళ్లిళ్లు ఆనందంగా లేవా ? నువ్వే చెప్పు పెళ్లి కాకుండా, మనిషి తరహాను తెలుసుకోకుండా ప్రేమించడం ... లోతు తెలియకుండా నీళ్లల్లో దిగడం వంటిదమ్మా" అంది తల్లి

"అమ్మా ! .. అది నేను కాదనను కాని దిగిన తర్వాత పైకి రాలేము నేను ఆయన్ని మనసారా ప్రేమించాను నామీద ప్రమాణం చేసి ఆ పని మానేశారు కానీ ఏదో దుష్టశక్తి వల్ల మళ్లీ ఆ పని చేశారు ఆయన్ని ఏనాటి కైనా మార్చగలదాన్ని నేనే లేకపోతే . 'దొంగ భార్య' అన్న పేరే నాకు శరణ్యం . తల్లివి కనుక మనస్సు విప్పి చెప్పాను" అంది రాధ, తల్లి ఒళ్లో తల పెట్టుకుని ఏడుస్తూ కాంతమ్మ కూతుర్ని ఓదార్చి వెళ్లిపోయింది. నిద్ర పట్టని రాధ మనశ్శాంతికి తోటలో పందిరి క్రింద నున్న సోఫామీద కూర్చుని గత సంఘటనలను నెమరు వేసుకో సాగింది

గేటు తలుపు తీసుకుని లోపలికి వస్తున్న కాంత్ ఆమెను చూసి ఆగిపోయాడు రాధ గభాల్న లేచి అక్కడ నుండి కదలబోయింది

"రాధా, ఒక్కమాట విను ఆ తర్వాత జీవితాంతం నీ కంట బడను త

అతని దీనకంఠం ఆమెపాదాలకు సంకెళ్ళువేసింది.

రాధా, చాలాకాలంనుంచీ నెరవేరని నీ కోర్కె సఫలం చెయ్యడానికి ప్రమాణం చేసిన నా మనస్సు ప్రమాణోల్లంఘన చేసింది నిజానికి పరిస్థితులు నన్ను ప్రోద్బలం చేశాయి నా కా బుద్ధి కలుగజేశాయి బజారులో ఒంటరిగా వెళుతున్నపుడు కంటికి ఒక పర్సు గానీ, విలువ గల వస్తువు గానీ కనబడినపుడు ఎవ్వరైనా సరే .. అటూ యిటూ చూసి ఆ వస్తువును చటుక్కున తీసుకుని చకచకా వెళ్లిపోతాడు నేనేకాదు నువ్వైనా అంతే మీ నాన్నగారైనా అంతే ఇదే మానవ నైజం. పట్టుబడితేనే దొంగ, లేకపోతే దొర. నేనూ అదేపని చేశాను కానీ నా కోసం కాదు నీ కోర్కె తీర్చడానికి ప్రమాణం కూడా మీరాను. అది తెలుసుకునే మీ నాన్నగారివద్దకు వచ్చాను. రక్షించమని అర్థించడానికి కాదు, నీ మెడలో మాంగల్యం కడదామనుకున్న, అనర్హమైన నా చేతులకు మీ నాన్నగారిచేత కడియాలు వేయించుకుందామని వచ్చాను. అంతే .. కానీ ఒక్కమాట గుర్తుంచుకో .. కాంత్ . అతను దొంగ కాదు,

మొమ్మాటికి కాదు. అతను మారిపోయాడు. అంతే. యిక నిమనసు కష్టపెట్టను. వెళ్లి మీ నాన్న గారిని పిలు" అతను ఆవేశంతో చెప్పాడు రాధ అతని ముఖంకేసి చూసింది కళ్ళు ఎర్రగా వాచి పోయి ఉన్నాయి. కన్నీరు చొక్కాని కూడా తడిపే సింది ఆమె మనస్సు కుతకుత లాడిపోయింది

"విచక్షణ లేకుండా, నాకు మీరు చేసిన ప్రమాణాన్ని ధిక్కరించి ఆ నీచమైన పని చేశారు. నా మనస్సు ఎంత బాధపడిందో తెలుసుకోగల శక్తి ఉంటే మీ రా పని చేసేవారా .... స్త్రీ జీవితంలో తెలియక అయినా, తెలిసి అయినా ఒక్క పురుషునికే తన మనస్సుయిస్తుంది అదినఫలం కాకపోతే విచారసాగరమే . ఆమె జీవనయాత్ర."

రాధ దుఃఖాన్ని దిగమ్రింగి చరచరా లోపలికి వెళ్లిపోయింది. కాంత్ అటూ యిటూ పచార్లుచేసి ఖట్టు బాధగా రేపుకుంటూ ఆ సిమెంటు సోఫాలో కూర్చున్నాడు

మల్లెపందిరి వెనక నిలబడి యీ మాటలు సంపూర్ణంగా విన్న భుజంగరావుకళ్ళు చెమ్మగిల్లకుండా ఉండలేకపోయాయి

"ప్రేమ ఎన్నివిధాలైనది ? ప్రతీ ప్రేమ ... అసలాపదమే ఎంత పవిత్రమైనది. ప్రేమ .... అది దాటరానిది .. "

భుజంగరావు కాంత్ వెనక్కు వెళ్లి అతని భుజంమీద చెయ్యివేశాడు అదిరిపడిన కాంత్ లేచి నించుని భుజంగరావుని చూస్తూ, "నేను దొంగను నన్ను బంధించండి నేను దొంగను నన్ను బంధించండి" అని ఆవేశంతో అరుస్తూ రెండుచేతులూ ఆయనకేసి జాపాడు.

భుజంగరావు స్మితవదనుడై అతని భుజం తడుముతూ "మిష్టర్‌కాంత్, ఆవేశపడక"అన్నాడు.

"ఆవేశం కాదు నేను దొంగని, నేను దొంగని చట్టరీత్యా నే చేసింది నేరం నా అంతట నేనే వచ్చి పట్టుబడుతున్నాను దొంగిలించిన వస్తువులు అమ్మేశాను కనుక ఆ వస్తువులు కూడా నావద్ద లేవు .. నన్ను బంధించి మీ కర్తవ్యం మీరు నెరవేర్చుకోండి" అతను అరిచాడు

"కానీ, నిన్ను బంధించే అధికారం నాకు లేదు. నీమీద ఎవరూ నాకు రిపోర్టు చెయ్యలేదు. పోయిన వస్తువులు పట్టుకుని, విడిపించి ఆ యజమానికి అందజేశాము" ఆయన ఆగాడు

కాంత్ కొయ్యబారిపోయాడు వస్తువులు అతనికి అందజేసారా ? ఎవరు విడిపించారు ?" ఆమాటలు ఆశ్చర్యంతోఅతని నోటివెంటవచ్చాయి.

"నేనే . . " భుజంగరావు చిన్నగా నవ్వాడు కాంత్ మాట్లాడలేకపోయాడు

మిష్టర్ కాంత్, రాధను నువ్వు ప్రేమించి ఉండవచ్చు కానీ ఆమెకోర్కె తీర్చడానికి యిలాంటి చట్టవిరుద్ధమైన పని చేయకూడదు ఆ వస్తువుల యజమాని నీమీద కేసుపెట్టలేదు. తన వస్తువులను తీసుకుని సంతోషించాడు లేకపోతే యీపాటికి కటకటాల అవతల నువ్వూ, యివతల నేనూ ఉండాల్సింది వివాహం చేసుకుని మీ నాన్న గారి ఆశయం ప్రకారం నీ ఆస్థి నువ్వు అనుభవించవచ్చు ఇలాంటి నీచమార్గాలు, కులప్రతిష్టలకు భంగం చేకూరుస్తాయి యింతకన్నా నేను నీకేమీ చెప్పక్కర్లేదు "

కాంత్ నిశ్చేష్టుడై పోయాడు, అతని హృదయం ద్రవీభవించింది. భుజంగరావు రెండు చేతులూ పట్టుకుని "మీ మేలు జన్మలో మర్చిపోలేను, నే నింకెన్నడూ యిలాంటిపని చెయ్యను. ఆ వస్తువులకు ధరగా యీ స్కూటరు కొన్నాను ఇది మీకు చెందుతుంది. నన్ను మన్నించండి. నేను వస్తాను"అంటూ నమస్కరించి వెనక్కు తిరిగాడు.

"మిష్టర్ కాంత్, ఒక్కమాట ....అలా కూర్చో" కాంత్‌మారుమాట్లాడకుండాబల్లమీద కూర్చున్నాడు

నీలోని దోషాల్ని తెలియకుండా రాధ నిన్ను ప్రేమించింది కన్నకూతురు గనుక మా ప్రేమను, ఆమె చెడ్డతనాన్ని చూసి, మేము మానుకోలేము, నిన్ను ప్రేమించింది కనుక నీలో చెడ్డతనానికి, ఆమె నీమీది ప్రేమను మానుకోలేదు. ఇదే ప్రేమకు నిజమైన అర్థం ఎవరి ప్రేమ వాళ్లని ఆపాశం నుండి విముక్తులను అవ్వనివ్వదు భుజంగరావు చెప్పటం మాని కాంత్‌వైపు చూశాడు. కాంత్ లేచి నించున్నాడు.

"కానీ ... కానీ నేను దొంగను. మీ అమ్మాయికి తగను" అతని పెదిమలు ఒణికాయి భుజంగరావు చిన్నగా నవ్వాడు.

అందుకనే, నిన్ను నావద్ద ఉంచుకుని తర్ఫీజు యివ్వా లనుకుంటున్నాను.

కాంత్ ముఖం కళకళ లాడింది. ఆ మాటకు 'ఇల్లరికం' అన్న అర్థం స్ఫుటంగా వినిపించినా అతనికి ఈసారి బాధ అనిపించలేదు.

"నీకు అభ్యంతరం లేదనుకుంటాను "

"లేదు ఇల్లరికం ఉండడానికి నేను సిద్ధంగా ఉన్నాను" ఆ మాటలు అతని హృదయంలోంచి చీల్చుకువచ్చాయి భుజంగరావు అతని భుజం తట్టుతూ నవ్వాడు.

"పిచ్చివాడా, ఏ పదానికైనా మనం అర్థం చెప్పుకోవడంలోనే ఉంటుంది కానీ, ఆ పదంలో ఎన్నడూ దోషం ఉండదు

కాంత్ ఆనందపరవశత్వంతో కళ్లు మూసుకుని భుజంగరావు 'ప్రేమ' కు నమస్కరించాడు

కళ్ళువిప్పి చూసేసరికి వరండాలో వెలుగుతున్న లైటు వెల్తుర్లో యింట్లోకి వెళ్లిపోతున్న భుజంగరావు అతనికి కనుపించాడు.

చాటున పొంచి వింటున్న రాధ తండ్రి .... ప్రేమకు జోహార్లు అర్పించింది. ఆమె మనస్సు ఆనందపరవశత్వం పొందింది. 'ప్రేమ !!' ఆపదం ఆమెను పులకితురాలిగాజేసింది ఆనందంతో ఆమె కాంత్‌ను సమీపించింది.

'రాధా' నన్ను క్షమించినట్లేనా' అన్నాడు కాంత్ ఆమెను స్పృశించడానికి సందేహిస్తూ.

'క్షమించింది నేను కాదు మా నాన్నగారు' అందామె నవ్వుతూ.

"క్షమించడం కాదు రాధా—నాలో జీవం పోశారు . ప్రాణం పోశారు "

'ఒప్పుకున్నట్లేగా మీరు' అందామె దెప్పుతున్నట్లు

ఆహా ! నీ ప్రేమ నా నిశ్చయాన్ని మార్చలేక పోయినా, మీ నాన్నగారి వాత్సల్యం నా నిశ్చయాన్ని దులిపేసింది నిశ్చయంగా నేను ఒప్పుకున్నాను. నీ తండ్రి నాకూ తండ్రి . ఇలాంటి తలిదండ్రుల్ని వదిలి మనం ఒంటరిగా ఉండలేము అన్నాడు అతను, ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుంటూ. రాధ మనస్సు తేలిక అయిపోయింది. ★


# మీ అందానికి



గ్లోరియా అనే సౌందర్యపోషక ద్రవం, ముదిరూపును పోగొట్టి మీ ముఖానికి, చక్కని లేతదనాన్ని కాంతిని తెచ్చును మొటిమలు, మచ్చలు, ముడుతలు, ఎండకువచ్చిననలుపును పోగొట్టి, ముఖాన్ని తెలుపుచేసి మీఅందాన్ని రోజు రోజుకీ ఎక్కువ చేయును మొదటి పూతలోనే కొంత అందము వచ్చును వాడిచూస్తే విడువరు అన్నిషాపులలోను దొరకును

జనితా ప్రాడక్ట్సు, ఏలూరు, (ఆంధ్ర).

దుర్గా ప్రాసెస్



# హోమ్ సినీప్రొజకర్ 15రు/లకే



అద్భుతమైన గృహవినోద సాధనము, కల్పన, సాహసము, అద్భుతముగల సన్నివేశము లెన్నో యీ ప్రొజక్టరతో మీ యింటియందే చూడండి. ఇది టార్చితో లేక ఎసి/డిసి ఎలెక్ట్రిసిటితో పనిచేయును. ఉపయోగించదగు ఫిల్ము 35 ఎం.ఎం. బొమ్మలు తెరపై సజీవముగా పలురంగులలో నటించును. మీకు ఆశ్చర్యము కలుగును అనేకులు ఆకర్షింపబడుదురు. ధర రు 15/- 40 అ॥ ఫిలిం 4' × 3' సైజు స్క్రీను. దాని పనిచేయించే విధము, ఫిలిములపట్టీ ఉచితం. పోస్టేజి రు 4-50 అదనం. డీలక్స్ స్పెషల్ ప్రొజక్టర్ ధర రు 25/- 60 అ॥ ఫిలిం & 4' × '3 సైజు స్క్రీను. దాని పనిచేయించే విధము, ఫిలిములపటీ ఉచితం. పోస్టేజి రు 5 అదనం. అందరు కోరుచున్నారు! నేడే ఆర్డరు పంపండి.

HOLLYWOOD CINEMA CORP. (Regd.)
2194 Kalyanpura, Turkman Gate (12
DELHI-6



# అబలసుధ

స్త్రీలసమస్తవ్యాధులకుగ్యారంటి. ప్రదరము, ఋతుశూల, అకాల బహిష్టు, అత్యుష్ణము, గుండెదడ, నడుము నొప్పులు మొ॥ హరించి బలము నిచ్చును, ధర రు 3

ఇండియన్ మెడిసిన్ హౌస్
విజయవాడ - 2

# మీరు

# ఉబ్బసం

# వల్ల బాధపడుతుంటే

ఎఫజోన్ బిళ్లలు మరల భారతదేశంలో దొరుకుచున్నవి. ఉబ్బసం, రొమ్ముపడిశెం, గుండెనంజు, గుండెలలో కఫం, హె జ్వరం, తత్సంబంధమైన వ్యాధుల వల్ల బాధపడు వారికి ఎఫజోన్ గుణకారి. ఎఫజోన్ సేవించుటకు సులభమైనది. సురక్షితమైనది, రూడిగా గుణమిచ్చునది శీఘ్రనివారణ గలిగించునది

ఎఫజోన్ సూత్రమందలి వైద్య శాస్త్రీయమైన ఔషధ పదార్థముల గుణములు దిగువ వివరింపబడినవి :—

1. ఎఫజోన్ శ్వాసనాళములయొక్క కండరముల ఈడుపును పోగొట్టే శక్తివంతమైన గుణమును గలిగియున్నది.

2. ఎఫజోన్ శ్వాసనాళములు మరియు గొంతులోగల గట్టి శ్లేష్మమును పలుచన పరచును. అందువల్ల అది సులభంగా దగ్గు మూలకంగా తొలగింపబడగలదు

3. ఎఫజోన్ ఊపిరితిత్తులందలి రక్తనాళములలో అధికకూడికయైన ఒత్తిడిని నివారించును

4. ఎఫజోన్ గుండెలలోని అత్యాయాసకారక ఒత్తిడిని తగ్గించిపనిచేసేశక్తిని హెచ్చించును

5. ఎఫజోన్ నరములను శమనపరచే గుణమును గలిగియున్నది ఇందు మూలకంగా ముమ్మరమైన ఉబ్బసంయొక్క ముఖ్యగుణమైన దశతో గూడిన ఒగర్పును తొలగించును మరియు రొమ్ము పడిసెపు బాధైన ఎడతెగని దగ్గును తగ్గించును.

ఉబ్బసం వేగముగా తాకి విజృంభించును. కాని అది తాకిన స్వల్పమాత్రపు చిహ్నం కనిపించగానే ఒక ఎఫజోన్ బిళ్లను మ్రింగినయడల మీకు రూడియైన శీఘ్రనివారణకలుగును.

ఎఫజోన్ యొక్క యోగ్యమైన ప్రశంసనీయ గుణములు, దానిని వాడినట్టి అనేక వ్యాదిపీడితుల వల్లను, దానిని నిర్ణయించిన అనేక మంది డాక్టర్ల వల్లను, ఋజువు పరచబడినవి ఎఫజోన్ లో అలవాటు కాగల ఓషధులు లేవు. ఇది 15, 45, 100 మాత్రలుగల ప్యాకెట్ లలో కెమిస్టులందరి వద్దను. మందుల షాపులన్నిటిలోను దొరుకుచున్నది.




# EPHAZONE

ఎఫజోన్ నిర్మాతలు మరియు పంపిణీ దారులు:

జె.ఎల్. మారిసన్, సన్ అండ్ జోన్స్,

(ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్

బొంబాయి కలకత్తా మద్రాస్ ఢిల్లీ

# ఆడవారు- ఐకమత్యం

## జయశ్రీ

'మూ'డు కొప్పులు చేరితే నిప్పే అవుసరం లేదనే' మనపెద్దవారి సామెత ఏ మాత్రం అసత్యం కాదనిపిస్తుంది కొందరు స్త్రీలను చూస్తే. ఎక్కడో నూటికి, కోటికి ఒక్క రుంటారు కలహాలు పెంచుకోకుండా, పొరబా ట్లను సమర్థించుకొని ఐకమత్యంగాఉండే ఆడు వారు మిగతా విషయాల సంగతి నాకు తెలీదు గాని కలహాలు, అసూయలు, ఈర్ష్యలు, ద్వేషాలు ఓర్వలేనితనం వంటి సుగుణాల విష యంలో మటుకు మనం పురుషుల ముందు సిగ్గుతో తల వంచాల్సిందే. మన (అంటే అంద రనుకొనేరు—కాదు) వయస్సుతో పాటే యీ దుర్గుణాలు గూడా పెరుగుతూ వస్తవి దైవాను గ్రహం వలన ఏ కొందరు అదృష్టవంతులలోనో యీ గుణాలు పోయను మరచిపోతాడు సృష్టి కర్త కాని ఆ లోటును మరికొందరిలో పూరిస్తాడు

స్వాతంత్ర్యము లేకనో లేక రోజంతా నాలుగు గోడల మధ్య నలిగిపోతూండడంచేత నలుగురిలో తిరగనేర్చి, ప్రపంచాన్ని అర్థం చేసుకునే అవకాశం లేకనో లేక దురదృష్టం వల్లనో గాని కొందరి స్త్రీల మనస్తత్వాలు చాల సంకుచితంగా ఉంటయ్. కేవలం ఇండ్లలో ఉండేవాళ్లే గాదు—ఎం. ఎ. లు, బి. ఏ లు పాస్ అయి సోషల్‌గా తిరిగేవాళ్లలో గూడా కొందరిలో పై లక్షణాలు కనిపిస్తవి. ప్రక్కవాళ్లు పచ్చగా ఉంటే చూచి సంతోషించే వాళ్లు, ప్రక్కవాళ్ల పొరబాట్లను నవ్వుతూ 'ఫరవాలే' దంటూ త్రోసిపుచ్చే స్త్రీరత్నాలు గూడ కొల్లలు.

స్త్రీలకన్నా పురుషులలోనే ఉదార స్వభావులు ఎక్కువగా కన్పిస్తారు. పురుషులు సర్వ స్వతంత్రులు. ధనం సంపాదించేవారు కావలసిన విధంగా వాడుకుంటారు కాని స్త్రీలకు దానం చేద్దామనే ఆశ ఉన్నా అవకాశం ఉండదు కొందరికి. కాని అవకాశం ఉండీ దానం చేయరుగదా—పైగా భర్త ఎవరికన్నా సహాయం చేస్తున్నా చూచి ఓర్చుకోలేరు కొందరు. స్త్రీలలో ఐకమత్యం చాలా తక్కువని ముందే చెప్పానుగదూ ?

ఇక రెండు కుటుంబాలు గుట్టుగా, సన్నిహితంగా ఉన్నాయంటే చూచి సహించలేని కొందరు ఇక్కడి కబుర్లు అక్కడా, అక్కడి కబుర్లిక్కడా అందజేసి, ఆవిడమీద నేరాలు మోపి ఈవిడ దగ్గర ఒకసేరు బియ్యం, ఈవిడమీద నేరాలు చెప్పి ఆవిడ దగ్గర అంత కాఫీపొడి—ఇలా కాలం వెళ్లమార్చుతారు కొందరు. 'చెప్పుడుమాటలు ఎంతైనా పనిచేస్తవి వ్యక్తుల పట్ల. వా రెంత సన్నిహితంగా ఉన్నా ఈ మధ్యవచ్చినవారివలన లేనిపోని కలహాలు, కలతలు పెంచుకొని పోట్లాడుకుంటూంటే చూచి ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ హాయిగా గాలి పీల్చుకొంటారు కొందరు వీళ్ళ ప్రత్యేక కలతలు పెంచడమే తమ జీవిత లక్ష్యంగా పెట్టుకొంటారు.

అసలు స్త్రీకి తనకంటె మరో స్త్రీ గొప్పగా, అందంగా ఉండడం సహించరాని విషయం. పైకి ఎవరూ ఒప్పుకోకపోయినా ఇది సామాన్యంగా అందరిలో ఉండే అసూయే. ఎక్కడో ఉంటారు ఇటువంటి గుణాలకు అతీతులయిన దేవతలు. పక్కింటావిడ క్రొత్తచీర కట్టిందంటే (అదీ విరోధి అయిందా) ఇక ఈవిడగారి ఒంటిమీద తేళ్ళు, జెర్రులూ ప్రాకినట్లుంటయ్ అనడంలో అసత్యత ఏమీ లేదనుకొంటాను. ఇక ఆవిడ భర్తముందు తన భర్తని ఒక అసమర్థుడి క్రింద జమకట్టి సూటిపోటి మాటలతో అతన్ని బాధపెడుతుంది. ప్రక్కవాళ్ళు విశేషించి ఏ పేదింటి యిల్లాలో లేకలేక ఒక చీరకొన్నా, లేక నగ చేయించినా, లేక ఏ యితర వస్తువు కొన్నా, పాపం ఇక ఆవిడ మీద ఈరకం సోదరీమణులు సానుభూతి చూపుతారు చూడండి—ఒకరి బుగ్గలు ఒకరు నొక్కుకుంటూ 'అయినా ఇంత మిడిసిపాటేంటమ్మా! ఆమె మొగుడు ఎంత ధర్మాత్ముడైతే మాత్రం అంత మిడిసిపాటా అంట. ఈ మొఖానికి యాభై రూపాయల చీర కావలసొచ్చిందా ? కొన్నాళ్ళు జరగాలా అసలు ? ఎన్నాళ్ళు జరుగుతుందిలే! లేనినాడు ముష్టికి ఊరిమీద పడాల్సిందే గదా! వెనకా ముందా ? ఏమన్నానా ?' అంటూ తమ దూర దృష్టిని ప్రదర్శిస్తారు. తమకు లేవనే కొరతను, లోటును తీర్చుకోవడం— ఆమె తనకన్నా ఘనంగాఉంటే చూచి ఓర్చుకోనే ఓపిక లేకపోవడమే ఇటువంటి మాటలను అనిపిస్తుంది. ఎంత లేనిదైనా పాపం ఆవిడా మనిషే. ఆమెకూ ఉంటయ్ కోరికలు—ఒక చీర కొనిందే అనుకోండి వీళ్లకెందుకీ ఆరాటం ? మరి వీళ్లకు లేదనే లోటును, అవిధంగా ఆవిడని, నానా మాటలని, తీర్చుకొని తృప్తిపడడం కాదంటారా ?

ఇటువంటి సాధ్వీమణులు లున్న వీధిలో ఖర్మ చాలక ఏ ఉద్యోగస్థురాలో, లేక ఇటువంటి వాతావరణానికి అలవాటుపడిన ఏ సరదా ఐన క్రొత్త జంటో దిగే రనుకోండి—ఇక వాళ్ల పాపం పండిందన్నమాటే. మన అమ్మలక్కలకు నోటినిండా పని—ఏ రావమ్మో, ఏ సీతమ్మింటికో ఏదైనా పని మీద వెళ్లిం దనుకోండి— అసలా పని మాటే మర్చిపోయి ఇక ఆ జంటను గూర్చి మాట్లాడుతారు. 'అయినా అంత సిగ్గు లేదేంటి వాళ్లకు ? మగవాడైతే పోనీ అనుకొందాం. (ఏదో వీళ్ళ దయ తలచి) ఆడది దానికైనా సిగ్గు ఉండొద్దూ? ఆ ఫేషన్లేంటి, ఆ షికార్లేంటి, ఆ కార్లలో తిరగడమేంటి ? అయినా మా ఆయన నా ముప్ఫయి ఏళ్ల కాపరంలో ఏనాడన్నా నన్ను వెంటబెట్టుకుని గుడికన్నా పోయాడా అని ? అయినా ఏం కలికాలం అమ్మా! ఇంత మితిమీరిపోయారు ?' అంటూ నెత్తి నోరు బాదుకుని వాపోతారు. వాళ్లేంటో ఏ దిగుడు బావిలోనో దిగిపోతున్నట్లు. సరే ఇక ఏ ఉద్యోగస్తురాలో ఉందనుకోండి పెళ్లి అయున్నా తంటే, కాకపోయినా తంటే. పెళ్లి అయుంటే 'ఆ మొగుడితో సమానంగా ఈవిడేమిటి ఉద్యోగం వెలగపెట్టా? పిల్ల లనుకొంటుందా, మొగు డనుకొంటుందా? సంసారమా చట్టుబండలా? ఆ ఉద్యోగ మేంటో, ఆ గొడవేంటో తప్పె? మరలా మనం ఎవరన్నా కనపడ్తే సొక్కువిషయాలు ఒలకపోస్తుంది చూశారు ? అంత పూళ్లేలే తల్లి పెళ్లెందుకు చేసుకోవడం?'' అంటారు.

పోనీ పెళ్లికాని పిల్లయితే 'పెళ్లికాని పిల్ల. అంత సిగ్గు లేదేమిటి ? మొగాడితో సమానంగా ఉద్యోగం చేయడం. మావారితో ఎంత బాగా మాట్లాడుతుంది ఇంగ్లీషు స్వతంత్రంగా నవ్వుతుంది. భయం, సిగ్గు అనేవి లేకుండా. భయం భక్తి లేకుండా ఎంతెంత దూరా లొస్తున్నారు ఉద్యోగా లంటూ ? ఎంత బరితెగించిపోయారమ్మా ఈ కాలం వాళ్ళు ఈ ఈడుకి నాకు నలుగురు బిడ్డలు. ఏం

---

ఒక ఊళ్లో నాటక ప్రదర్శనం జరుగబోతుంది. అందులో ఒక నటుడు రానందున ఆ ఊళ్లో ఉన్న ఒకవర్తకుని ఆ పాత్ర నిర్వహించమన్నారు. ఆ వర్తకుడు పూర్వం నాటకా లాడాడు. నాటకం బాగా సాగిపోతోంది. వర్తకుని పాత్ర ఏంలేదు ప్రతిదానికి, నీయిష్టం అనడం. ఒకసారివచ్చి నీ సందేశం ఏమిటి అనడిగాడు మరో పాత్రధారి. పాపం! నిద్రపోతున్నాడు కాబోలు వర్తకుడు మేల్కొని మిరపకాయలు సవాశేరు 30 న. పై. లు. బెల్లం 25 న. పై. అన్నాడు. ప్రేక్షకులు గొల్లున నవ్వారు. అప్పటిగాని అతనికి తెలియ లేదు తను నిర్వహిస్తున్నది నాటకంలోని పాత్ర అని.

—ఎస్. అంజనేయులు (రావినూతల)

---

వనితాలోకం వ్యాసం

# శిరోజాలంకరణ

## బొమ్మలు: దేవిక

(1)



(1) పాపిట తీయకుండా జుట్టును ఎగదువ్వి, పైకెత్తి మొత్తం అంతా ఒక ప్రక్కకు తీసుకురావాలి. తర్వాత చిన్న తాడుతో జుట్టును మొదట్లో కట్టాలి. ఆపైన రింగుచుట్టూరా జుట్టు గట్టి మెలిద్రిప్పి, చివర తాడుతో ముడివేసి గుండ్రంగా నిలబడేట్టు కట్టుకోవాలి

(2) ఈ పద్ధతికి 'పోనీ టెయిల్' అని పేరు. దీనికి పై విధంగానే పాపిట లేకుండా జుట్టు ఎగదువ్వి, మెడ దగ్గర భాగంలో పైకి దువ్వి, వడి నెత్తిని గుత్తుగా బాగా ఎత్తి కట్టుకోవాలి. బజార్లలో 'పోనీక్లిప్స్' అమ్ముతున్నారు. ఒక క్లిప్ అక్కడ తగిలిస్తే ఊడి పోకుండా నిలబడుతుంది.

(3) ఈ సిగ వేసుకోటానికిముందు మామూలుగా జడ అల్లుకోవాలి. తర్వాత జడను వదులుగా తలమీద పడుకోబెట్టకుండా ఒక అంచుమీద నిలబెట్టి గుండ్రంగా చుట్టుకు రావాలి. తర్వాత చివరకొన పైకి కనపడకుండా జాగ్రత్తగా లోపలకు తాడుతో కుట్టెయ్యాలి. సిగ నిలబడటానికి అక్కడక్కడ పిన్నులు తలలో దూర్చాలి

(2)



(3)






చేస్తాం కలికాలం ?' అని సరిపెట్టుకుంటారు సంసారాలు వదులుకొని ఉద్యోగాలు చేయాలని గాని, తల్లిదండ్రుల చాటున ఉండకుండా ఉద్యోగాల కోసం వూళ్లమీద పడాలని గాని ఎవరికీ ఉండదు ఎన్నో పరిస్థితులకు కట్టుబడి ఉద్యోగాల కొస్తారు అటువంటి వారిమీద సాటి సోదరీమణులు చూపే సానుభూతి, వారితో మసలే ఐకమత్యం చూడండి. ఆడపిల్ల ఒక్కతే ఉంటే, మగదిక్కు లేదే ఆ పిల్లకు కాస్త మాటసాయం చేస్తే ఉంటాం— అని గాని, ఏం కావాలో కనుక్కుందాం అని గాని తోచదు వాళ్లకు ఈవాళ ఈ చీర కట్టిందే, ఈ గాజు వేసిందే, కార్లో వచ్చిందే, రాత్రి పదింటికి వచ్చిందే, ఈ ధోరణి తప్ప మరో ధోరణి లేదు

ఇక ఈ పిల్ల 'ఖర్మం' కాలి ఏ ప్రేమ వ్యవహారంలోకి దిగిందో—ఇక వీళ్లను పట్టను పగ్గాలే ఉండవు. మరీ వాళ్లవాళ్ళు పనిచేసే ఆఫీసే ఐతే సాయంత్రం ఐదింటికి అతి కుతూహలంతో ఎదురు చూస్తుంటారు ఆనాటి తాజావార్తల కొరకు మగవారికి (కొందరికి) ఆడువారంటేనే అలుసు—ప్రత్యేకించి ఉద్యోగస్తురాళ్లంటే మరీను —ఇక ఆ మహాశయులు ఉన్నవీ, లేనివీ కల్పించి కథ అల్లుతే—ఈ స్త్రీలు వాటికి మరో పది చేర్చి పలుగురిలో ప్రచారం సాగిస్తారు అవమానం ఎవరికో వాళ్లకు స్ఫురించదు ఆ అమ్మాయిని నాలుగు దుయ్యబట్టేకన్నా మంచిగా పోయి ఆమెను గూర్చి నలుగురేమనుకొంటుందీ చెప్పి, చేతనైతే ఆమెను మంచి మార్గంలో పెట్టవచ్చుగదా ? ఆ ఆలోచనే రాదు — పరిహాసం చేసి నవ్వమంటే చాలు పురుషుల దృష్టిలో మన ఈ కలహాలు, కలతలవలన మనం సునాయాసంగా అలుసై పోతాం. ఈ విషయం ఎందరు ఆలోచిస్తారు ?

అసలు ప్రపంచంలోనే ఒకరిని గూర్చి చెడుగా చెప్పడం అంటే మహా సరదా మనుష్యులకు. చెడుగా చెప్పను అయిష్టపడేవాళ్ళు చాలా రేర్‌గా ఉంటారు. అటువంటిది ఈ రకం వ్యక్తుల సంగతి మరి వేరే చెప్పాలా ? చదువులేని అజ్ఞానుల్లోనే కాదు ఈ రకం స్త్రీలు ఉండేది చదువుకొని, నాగరికులం అంటూ చెలామణి అయ్యే వారిలో గూడా ఉంటారు. నలుగురు పెద్ద ఆఫీసర్ల భార్యలు క్లబ్బుకి వెళ్తే అందులో ఒకావిడ ఆరోజు ప్రత్యేకంగా అలంకరించుకొంటే ఇంక ఈ ముగ్గురు అవమానంతో, అసూయతో ఉడికిపోతారు హైస్కూల్సు, కాలేజీలు, ట్రెయినింగ్ సెంటర్లు, ఆఫీసులు—ఇలా పదిమంది ఆడవాళ్ళు కలిసి ఉండే స్థలాల్లో ఐకమత్యంగా, సామాన్యంగా ఉండరు ఇద్దరూ అయితే అంత బాధ లేదనుకోండి. ముగ్గురయితేనే ఇద్దరిటూ ఒకరటూ చీలిపోతారు. అవసరాల్ని బట్టి వాళ్ళ జట్లు మారుతారు. ఇక వారిక్రింద పనిచేసే ఉద్యోగస్తులు గాని, లేక చదువుకునే పిల్లలు గాని వాళ్ల అదృష్టానుసారం ఈ పార్టీలోను, ఆ పార్టీలోను చేరిపోతారు ఇక స్కూలు, హాస్టల్—ఏదైనా కావచ్చు, నరకలోకం కంటే భయంకరంగుంటుంది. మొగవారు, ఆడువారు కలిసిన ఆఫీసయితే ఇక మగవారికి కాలక్షేపమంత సరంజామా వాళ్ళను పోషణ చేసేందుకు. ఎవరైనా వచ్చితే అలా ఒకరిని ఒకరు ఆరోపించుకుంటూ ఇద్దరి మధ్యా చిచ్చుగట్టి పోట్లాడుకునేట్టుగా తయారవుతారు. పెళ్లికాని అమ్మాయిలంటూ ఉంటే వాళ్లమీద చేతనైనంత పెద్ద పెద్ద నిందలు వేసి నలుగురిలో ప్రచారంచేసి సంతోషిస్తారు కొందరు పెద్దమనుషులు. ఈ కలహాలను, పార్టీలను ఆసరాగా తీసుకొని మొగవారు వెటకారం చేసే హేళనగామూ అంతా ఇంతా ఉండదు. చులకన ఎక్కువ అవుతుంది. 'ఎన్ని అవమానాలన్నా భరిస్తాం.ఎన్ని చులకనలన్నా సహిస్తాం.కాని,మేం మట్టుకు ఐకమత్యంగా ఉండేది కల్ల' అని రుజువు చేస్తారు ఈ చదువున్న సోదరీమణులు.

నలుగురు మొగ ఆఫీసర్లు కలిసికుంటే ఎంతో సర్దాగా, సంతోషంగా ఉంటారు. వెయ్యిమందున్న బాయిస్ హాస్టల్సులో కన్నా వంద మందున్న 'గరల్స్ హాస్టల్సు' లోనే గొడవలు ఎక్కువగా జరుగుతుంటవి.

పురుషులు కలిసిపోయినంత త్వరగా స్త్రీలు కలవ లేరు చదువుకున్నవారు, ఒకరికి ఆదర్శంగా ఉండ వలసిన ఉద్యోగాలు చేసేవాళ్ళు అయినా వీళ్లే ఐకమత్యంగా ఉండలేకపోతే ఇక సామాన్య స్త్రీల సంగతి చెప్పాలా ?

అందరు స్త్రీలు ఐకమత్యంగా ఉండరనీ గాదు నే ననేది. పురుషులముందు సగర్వంగా నిల

## ఆడవారి ఐకమత్యం

బడగలిగే ఐకమత్యం మనలో లేదనే నా విచారం. సరదాగా, సంతోషంగా ఉండాలంటే అది ఒక్క నాటితో వచ్చేది గాదు. కాని అలవాటు చేసు కొంటే రానంత కష్టమైందీ గాదు కలహాలు పెంచుకోకుండా, ఐకమత్యంగా ఉండడం వలన వచ్చే నష్టం గాని, కష్టం గాని ఏమీ ఉండబోవనుకుం టాను అందరిని గురించి నేను రాయలేదు కాబట్టి నా మీద ఆగ్రహించరనుకొంటాను

★






'బెన్‌హర్' తీయడానికి సుమారు 1 4 కోట్ల డాలర్లు వ్యయమయింది

# హాలీవుడ్ ఫిలిం పరిశ్రమ

టెలివిజన్ రావడంతో అమెరికాలో సినిమా పరిశ్రమకు పెద్ద దెబ్బ తగిలింది అంతవరకూ నష్టమంటే ఏమిటో ఎరుగని ఈ పరిశ్రమకు చాలా ప్రమాదపరిస్థితి ఏర్పడింది ఈ విషయాన్ని చర్చిస్తూ, శ్రీ ఆర్థర్ మేయర్ 'సెటర్డే రివ్యూ' అనే పత్రికలో కొన్ని వివరాలు ఇచ్చారు

ఇంతకుముందు, అంటే 1947—48 వరకూ సుమారు ప్రతి చిత్రమూ లాభదాయకంగా ఉండేది అమెరికాలో మొత్తం 22,000 పైన సినిమా 'హాలు' లుండేవి ప్రతివారం ఏడెనిమిది కోట్ల మంది సినిమాలు చూస్తూ ఉండేవారు పెద్ద ప్రొడ్యూసర్లకు సంవత్సరానికి 20 కోట్ల డాలర్ల పైగా లాభాలు వస్తూ ఉండేవని ప్రతిఏటా కనీసం, 400 చిత్రాలు తయారవుతూ ఉండేవి

కాని టెలివిజన్‌తో అసలు పరిస్థితే మారిపోయింది ఇంచు మించు 10,000 సినిమా థియేటర్లు మూసివేశారు ఈ రోజు నాటికి దెబ్బయి అయిదు చిత్రాలకు నష్టం వస్తూ ఉన్నది క్రమేణ స్టుడియోలు మూసివేస్తున్నారు ప్రస్తుతం ప్రతివారం ఇరవై కోట్లమంది సినిమాలు చూస్తున్నా వీరందరూ ఈ సినిమాలను వాళ్ళ ఇళ్ళలో టెలివిజన్ ద్వారా చూస్తున్నారు దర్శకులు టెలివిజన్ పోటీకి ఆగలేక టెలివిజన్‌కే తమ పాతచిత్రాలను అమ్మడం మొదలుపెట్టారు ఇది చాలక ప్రస్తుతం తీస్తున్న చిత్రాలను కూడా వారికే అమ్మివేస్తున్నారు

ఇక టెలివిజన్‌తో నేరుగా పోటీ చేయడానికి నిర్మాతలు అనూహ్యమైన ఖర్చులతో పెద్ద చిత్రాలు తీయడం ప్రారంభించారు. 1960 లో మళ్ళీ సినిమా హాళ్ళలో టికెట్ల అమ్మకంవల్ల 137 5 కోట్ల డాలర్ల ఆదాయం వచ్చింది

హాలీవుడ్‌లో స్వతంత్రులైన నిర్మాతలు ఎక్కువ మంది ఉండేవారుకాదు అంటే ఇంచు మించు అన్ని చిత్రాలూ పెద్ద పెద్ద కంపెనీలే తీసేవి కాని యునైటెడ్ ఆర్టిస్ట్స్ అనే కంపెనీ మాత్రం ఈ పద్ధతి నవలంబించి లాభాలు ఆర్జించడంతో తక్కిన కంపెనీలు కూడా, తక్కిన నిర్మాతలతో పెట్టుబడి, డిస్ట్రిబ్యూషన్ ఏర్పాట్లు మొదలు పెట్టారు పెట్టుబడి పెట్టినందుకు వీరు వచ్చిన లాభాలలో 10—75% వరకూ తీసుకుంటారు డిస్ట్రిబ్యూషన్‌కోసం 30% దాకా వసూలు చేస్తారు

ఈమధ్య ఎన్నో హాలివుడ్ సినిమాలకు అమెరికాలోకాక, విదేశాలలో 'షూటింగ్'లు జరిగాయి ఇది వీరికి చవుకగా ఉండటంవల్లనేకాని, వేరెందువల్లా కాదని ప్రతీతి

## కథలూ-తారలూ-డైరక్టర్లూ

మిచెనర్ అనే రచయిత పుస్తకం సినిమాగా తీశారు. దీనిపేరు "హవాయ్" చిత్రంగా తీసినందుకు ఇతనికి హాలీవుడ్‌వారు 6 లక్షల డాలర్లు ఇచ్చారు "సౌండ్ ఆఫ్ మ్యూజిక్" అనే గ్రంథానికి 12 5 లక్షల డాలర్లు ఇచ్చారు అంతేకాక చిత్రానికి వచ్చిన మొత్తం ఆదాయంలో 10% పుచ్చుకునేట్లు నిర్ణయించుకున్నారు ఈ 12 5 లక్షలూ అంతకంటే తక్కువయినట్లయితే మిగతా తర్వాత చెల్లించుకోవాలి

విలియం హోల్డెన్ "ది బ్రిడ్జ్ ఆన్ ది రివర్ క్వాయ్"లో నటించినందుకు మొత్తం ఆదాయంలో 10% పుచ్చుకున్నాడు ఈ చిత్రం 2 కోట్ల డాలర్లు సంపాదించుకున్నది

ఆల్‌ఫ్రెడ్ హిచ్‌కాక్ 'సైకో' అన్న చిత్రం డైరెక్ట్ చేసినందుకు లాభంలో 75% తీసుకుంటున్నాడు దాని మూలంగా ఇతనికి కనీసం 50 లక్షల డాలర్లు వచ్చేట్లున్నది

తన స్వంత సినిమా కానప్పుడు మార్లన్ బ్రాండోకి లాభాలలో 50% ఇవ్వాలి—ముందు 7 5 లక్షల డాలర్ల గారంటీ ఇచ్చిన తర్వాత

మారిలిన్ మన్రో పది లక్షల డాలర్లు ఇస్తేగాని చిత్రంలో నటించదు ప్రతి రోజూ షూటింగ్‌కు ఆలస్యంగా వస్తుందని శ్రీ మేయర్ వ్రాశారు.

ఆల్బర్ట్ మాల్ట్జ్ అనే రచయితను ఒకప్పుడు కమ్యూనిస్టు అని ఎందరో నిర్మాతలు పని ఇచ్చేవారు కాదు ఇటీవల ఫ్రాంక్ సినాత్రా ఒక చిత్రానికి ఇతన్ని కుదుర్చుకున్నాడు కాని హెరాల్డ్ పత్రికలు 'లీగ్ ఆఫ్ డీసెన్సీ' అనే మత సంస్థతో చేరి పెద్ద

'ఉద్యమం, ఒకటి ప్రారంభించింది దీనికి తట్టు కోలేక సినాత్రా మాల్ట్జ్ ను తీసివేశాడు.

### "ఫిలిం బడ్జెట్ లు"

1960 లో అమెరికా మొత్తంమీద విడుద అయిన చిత్రాల సంఖ్య 224 1941 లో 368 విడుదల చేశారు కాని, ఈ 224 చిత్రాలకూ 1941 లో 368 సినిమాలకు ఖర్చయిన దానికి మూడు రెట్లకుపైన అయింది ఈ రోజు ఒక్కొక్క చిత్రానికి 12 నుంచి 15 కోట్ల డాలర్లవరకూ ఖర్చవుతోంది వాటికి వచ్చే ఆదాయాలు కూడా అధికంగానే ఉన్నాయి. 6—7 కోట్ల డాలర్ల వసూ లవుతున్నాయని శ్రీ మేయర్ చెప్పన్నారు. ★




ఆరోగ్యము మొదట లెక్కలోకి వస్తుంది

'ఆరోగ్యము ఎల్లప్పుడూ మొదట లెక్కలోకి వస్తుంది. ప్రతి నిత్యమూ పనిపాటలలో పడే దుమ్ము మరియు ధూళి నుండి మీ కుటుంబము లోని వారి చర్మమునకు రక్షణ కలుగ చేయండి. ఉత్తమ్ నీమ్ సబ్బు యొక్క ఆరోగ్యరక్షక గుణము సాటిలేనిది. అది సూక్ష్మక్రిముల నుండి మరియు అంటు రోగముల నుండి రక్షణనిచ్చి చర్మమును అందముగా ఉండేలా ఉంచుతుంది.




సంపూర్ణమైన చర్మ ఆరోగ్యమునకు సాటిలేని సబ్బు

ఉత్తమ్ నీమ్ సబ్బు

IS 284 ISI SIKRI PRODUCT

మోడల్ సోప్ కంపెనీ, పి. బి. నెం. 2287, కలకత్తా

TLU

SISTA'S MSC-19

శీనుకి ఎదురుగా బొద్దుగా, లావుగాఉండే శ్రీనివాస రావుకి ఉన్న వ్యత్యాసాన్ని పరిశీలించుకుంటూ.

నీ దర్శనభాగ్యం సాధారణంగా దొరకుతుందోయ్! ఏదో రైలు ఇక్కడ ఆగిపోబట్టి అకస్మాత్తుగా కలుసుకున్నాం కొంచెం కాఫీ త్రాగివద్దాం పద'' అంటూ రెస్టారెంటు వైపుకి దారి తీశాడు శ్రీనివాసరావు

కాఫీ త్రాగుతూ శ్రీనివాసరావుని అడిగి ఎన్నో విషయాలు తెలుసుకుందామనుకున్నాను కాని అతని తీరుచూసి కొంచెం భయపడ్డాను

నువ్వు ఇప్పుడు ఏం చేస్తున్నావోయ్, అని అడిగాను చివరకు ఏదో ఒకటి అడగాలని.

"ఆ వూర్లోనే ఒక మందుల కంపెనీకి రిప్రెజెంటేటివ్‌గా ఉంటున్నాను దాని పనిమీదే నెల్లూరుదాకా వెళ్తున్నాను ఏదో ఇలా వూర్లు తిరుగుతూ ఉండటమే నా పని'' అన్నాడు తన మామూలు ధోరణిలో

"మా మామయ్యని ఎప్పుడేనా కలుసుకున్నావా? అని అడిగాను. కదిపితే అన్ని విషయాలు చెప్పే శీను స్వభావం తెలిసి

"ఆ కలవకేం ముసలితనం బాగా వచ్చింది. రాధ విషయంలో కొంచెం ఇద్దరూ బెంగపెట్టుకున్నారు. రాధ కూడా. అని ఆగిపోయాడు మధ్యలో.

"రాధ 'విషయం' అంటున్నావు కొంచెం వివరంగా చెప్పవోయి ఆదుర్దాగా అడిగాను మరో రెండు కప్పుల కాఫీకి ఆర్డరిస్తూ శ్రీనివాసరావు ఓసారి కళ్ళు మూసి ఏదో ఆలోచిస్తున్నట్టుగా జుట్టు వొకసారి సవరించుకొని చెప్పడం ప్రారంభించాడు.

"అనుకూలుడైన భర్త, ఆదరించే అత్తమామలు రాధ కాపురం సుఖంగానే గడచిపోయింది మొదట్లో; సంతానభాగ్యం లేదన్న ఒక్క కొరత తప్ప ఆ కొరత కూడా తీరిందన్న సంతోషంతో కాన్పుకి వచ్చిన కొద్ది నెలలు గడవకుండానే ఏదో వాతం వచ్చి భర్త మరణించాడు అత్తమామలు రాధ దుఃఖంలో ఏదైనా అఘాయిత్యం చేస్తుందేమోనని భయపడి మీ మామయ్యగారింటికే వచ్చిఉన్నారు, పురుడు పోసుకొనేవరకూ ఈ దుర్ఘటనకి రాధ ఎంతగా కుమిలిపోయినా పైకి ధైర్యంగానే మసలింది

"పిల్లాడుపుట్టి మూడు నెలలు నిండకుండానే తల్లీ తండ్రీ ఎంత చెప్పినా వినక అత్తమామలతో పాటు తిరిగి వెళ్ళిపోయింది, వాళ్ళకి ఆ ముసలితనంలో ఆసరాగా ఉందామని భర్త గతించేటప్పటికే ఆదాయం చాలా మట్టుకు తగ్గిపోయిందని తెలుసుకుందిరాధ ఇంటిలో ఒక భాగం అద్దెకు ఇప్పించి తీరిక సమయాల్లో టీచరు ట్రెయినింగ్ పరీక్షకి చదివి పూర్తిచేసింది కూడా కాని పిల్లాడికి మూడేళ్ళు రాకముందే అత్తమామలు మరణించారు; కొద్ది నెలల తేడాలో ఇంక ఆ ఇంట్లో ఎవరున్నారని అక్కడే దేవుల్లాడుతావు ?'' ఇంటికి రమ్మని మీ మామయ్య ఎన్నోసార్లు అడిగి చూశాడు కాని రాధ ఒప్పుకోలేదు ఎందుచేతనో నిన్ను గురించి కూడా ఓసారి అడిగింది నీ అడ్రసు నాకు తెలుసేమో అని నువ్వు మద్రాసులో వుంటున్నట్టు చెప్పానుకాని అడ్రసు తెలీక చెప్పలేదు

"ఒంటరిగా మగదిక్కులేక ఆ ఇంట్లో ఉండటం ఇష్టంలేక ఇల్లు అమ్మేసి గుంతకల్లులో చిన్నప్పుడు

# సినిమా కథ

(27 వ పేజీ తరువాయి)

తనతో చదువుకున్న స్నేహితురాలు ఉంటే ఆమె సలహామీదే అక్కడే స్కూల్లో టీచరుగా పనిచేస్తోందని మీ మామయ్య చెప్పగా విన్నాను. ఇక మామయ్యని రాధ తమని గుంతకల్లుకే వచ్చి ఉండమని కోరింది కాని వృద్ధాప్యంలో ఉన్న వూరు విడిచి వెళ్ళిపోవటం ఇష్టంలేక హైస్కూల్ తెలుగు మాష్టారు పిల్లాణ్ణి దత్తత చేసుకున్నాడని కూడా విన్నాను ఇదీ సంగతి'' అంటూ పూర్తి చేశాడు శ్రీనివాసరావు ఇక లేద్దామా అంటూ బరువుగాలేచి నిల్చున్నాను.

శ్రీనివాసరావు వెంట వస్తూ, ఏదో సినిమా విషయాలను గురించి అడుగుతూఉంటే, ఏదో పరధ్యానంగానే జవాబులు చెప్తూ నా కంపార్టుమెంటుకి చేరుకునే సరికి రైలు వెనక్కి తిరిగి బెజవాడకే వెళ్తుందని తెలిసింది. రైలు బయలుదేరడానికి పది హేను నిముషాలుందనగా శ్రీనివాసరావు తనకు ఈ వూర్లో తెలిసినవాళ్ళున్నారని వాళ్ళనిచూసి మర్నాడు బయలు దేరివెళ్తానని అంటూ వెళ్ళిపోబోతుండగా రాధతెలిస్తే ఇమ్మని అడిగాను

"నీ కెందుకోయ్ అక్కడికి నువ్వేమేనా వెళ్తావా పెడ్తావా'' అంటూ పరిహాసంగా అన్నాడు కాని నేను కొంచెం వేడుకోగా ఒక చీటిమీదరాసి ఇచ్చాడు తను తరచు టూర్లు తిరుగుతూ ఉండడటంవల్ల గుంతకల్లుకి వెళ్ళడం తటస్థించినప్పుడు రాధని చూడమని మామయ్య చెప్పాడని కూడా కొంచెం గర్వంగా చెప్పాడు నేను చీటిని అందుకుంటూ రాధను గురించి ఏదో అడగాలనుకుంటుండగా రైలు కదిలింది

"రైలు బెజవాడలోనే ఆగిపోతుందాండీ''అంటూ తోటి ప్రయాణికుడు అడుగుతుండగా నేను బెర్తుమీద కూర్చుంటూ, "లేదు చుట్టు తిరిగి మద్రాసుకి చేరుకోవచ్చు అన్నాను అతను వేసే ప్రశ్నకు కొంచెం చికాకు కలిగినా ఇకచేసేదేమీలేనట్టుగా అతను మళ్ళీ ముసుగుతన్ని పడుకున్నాడు నిద్రపోదామని ప్రయత్నించినా శ్రీనివాసరావు రాధను గురించి చెప్పిన విషయాలే మళ్ళీ గుర్తుకు రాసాగినవి మామయ్య దత్తత చేసుకున్నాడని శ్రీనివాసరావు చెప్పడంలో అర్థం నాకు బోధపడలేదు అది తలచుకున్నప్పుడు ఎందుకో నా కళ్ళు చెమర్చాయి అర్థంలేని ఆలోచనలు బుర్రలో ఇంకా తిరుగుతూ ఉండగానే ఎప్పుడుపట్టిందో గట్టిగా నిద్రపోయాను

రైలు తిరిగి బెజవాడ చేరుకునేసరికి రాత్రి పదకొండుగంటలు దాటింది నేను అనుకున్నట్టుగానే రైలుచుట్టుదారినే మద్రాస్‌కి వెళ్తుందని తెలిసింది ఎక్కువసేపు ఆగకుండానే కొద్ది నిముషాలలోనే రైలు కదిలింది తోటి ప్రయాణికుడు ఇంకా పడుకునే ఉన్నాడు నిద్ర పట్టడంలేదని సిగరెట్టు వెలిగించి మళ్ళీ ఆలోచించడం మొదలు పెట్టాను

రాధకి ఆనాడు నేను చేసిన వాగ్దానం గుర్తుకి వచ్చింది. రైలు ఎలాగా గుంతకల్లు మీదుగా వెళ్తుంది


"మోహిని" ఎడిటర్ : డా॥ రాజా చౌదరి
విజ్ఞానం-వినోదం-ఉల్లాసం-కల్గించేయువజన మనోరంజని ప్రేమకథల మాసపత్రిక వస్తోంది! ఏజెంట్లకై రూపొందించబడిన బహుమతుల ప్రణాళికలో ఈస్టర్న్‌స్టార్ సైకిళ్లు, ఫేవర్ లూబా వాచీలను, ఏప్రిల్ 30 లోగా ఏజన్సీ తీసుకొని ప్రతీఏజంటూ పొందండి.
మోహిని. స్టేడియంరోడ్, రాజమండ్రి.



## శ్రీబాలాంజనేయప్రశ్న
మీరు కోరిన 5 ప్రశ్నలకు వెంటనే వ్రాసి పంపగలము. 2 రూ॥ M. O. చేయండి. నెలలువారీగా 12 నెలలకు 1 సంవత్సరం జాతకము 2 రూ॥ పూర్తి పేరు, జాబు వ్రాసిన టైము తెలిపిన చాలును. హనుమాన్ జ్యోతిషాలయము, 10వ లైను, అరండల్ పేట, గుంటూరు-2.



RATNAM'S N-OIL
అంగసరములు బలహీనత చెంది, చిన్న దనచో తిరిగి యథాప్రకారం అయి పూర్తి సౌఖ్య మనుభవించుటకు 50 సం॥ ప్రఖ్యాతి కలది. 1 సీసా రూ. 10 లు వి. పి. 1-4-0 కావలసినవారు ముందుగా 1-4-0 పంపేది. ఇంగులో స్పెషల్ రకం [illegible] రూ. 25-0 0 లు
డాక్టర్ రత్నం సన్స్, (Estd 1904) సులక పేటబిల్డింగ్స్, ఆజంపూరా మార్కెట్ దగ్గర, హైదరాబాద్-24 (ఆంధ్రప్రదేశ్)



## కావలెను
టెలిగ్రాఫిస్టులుగను, సిగ్నలర్సుగను, అసిస్టెంటు స్టేషనుమాష్టర్లుగను, వైర్ లెస్ ఆపరేటర్లుగను, టెలిఫోన్ ఆపరేటర్లుగను శిక్షణ పొందుటకు, విద్యార్థి, విద్యార్థినులు కావలయును. పూర్తివివరములకు 50 న. పై. పంపవలయును
A. I. & W. T. College,
Pothurivarithota, Guntur-1



## మీరు చదవాలి
జీవిత రహస్యాలు - మీ దాంపత్యసుఖానికి అనేక కామ సూత్రాలు - ... రూ 3-50
యువతి - స్త్రీలను గురించి అనేక కుతూహల విషయాలు.. ... రూ 3 50
సంతానము:- గర్భనిరోధానికి 60 నవీన సులభ మార్గాలు ... ......... రూ 3 50
పోష్టు ఖర్చులుచితం క్రింది ఎడ్రస్సుకు వ్రాస్తే వి పి పోష్టుద్వారా మీయింటికి పంప బడును
దేశసేవ ప్రచురణలు, ఏలూరు, (ఆంధ్ర)
దుర్గా క్లానప

## మీ గుండెను కాపాడుకోనండి

లబ్ డబ్ అను గుండె మెదతెరపి లేక ధ్వనించుచుండును.

- ఆగుచూ ధ్వనించే నాడి
- మూర్ఛ వచ్చేట్లుండుట
- భారము, బడలిక కలుగుట
- ఊపిరి ఆడకుండుట
- వివర్ణమైన ముఖము
- ఎడమచేతియందు నొప్పి
- కాళ్ళ వాపులు
- గుండె దడదడ కొట్టుకొనుట

ఇవి గుండె జబ్బులకు చిహ్నములు.

ఆరోగ్యము పూర్తిగా పొందుటకు స్వయంగా లేక ఉత్తరాలద్వారా



విరాజ్ పండిట్ ఠాకూర్‌దత్తశర్మ విద్యావాచస్పతి గారిని సంప్రదించండి.

**Navratna Kalpa Pharmacy**
**Jullundur City (India)**


# సినిమా కథ

కనుక శ్రీనివాసరావుని నన్ను గురించి రాధ అడిగిన విషయం జ్ఞాపకంవచ్చి ఓసారి కలుసుకుంటే బాగుంటుందన్న ఆలోచన వచ్చింది ఎందుకనో ఎటూ నిర్ణయించుకోలేక కొంచెంసేపు తటపటాయించాను చివరికి నా మెదడులో మెరపులాంటి ఆలోచన మెదలింది ఆ ఆలోచన వచ్చినందుకు నాలో నేనే అభినందించుకున్నాను సంతోషంతో ఎప్పుడు నిద్రపోయానో నాకే తెలియలేదు

* * *

"అరే మీరు ఇక్కడే దిగిపోతున్నారా? మరి మదరాసుకు వెళ్ళరా? అంటూ అప్పుడేలేచి కూర్చున్న తోటి ప్రయాణీకుని ప్రశ్నకు "అవునూ! ఇక్కడ గుంతకల్లులో ఒక ముఖ్యమైన పని తగిలింది అంటూ బెడ్డింగును కట్టేసి తలుపు దగ్గరగా నిల్చున్నాను రైలు ప్లాట్‌ఫారం మీదికి వెళ్తుండగా అప్పటికి ఇంకా బాగా తెల్లవారలేదు చలికూడాకొంచెం వేస్తోంది రైలులోంచి దిగి, కూలీకి బెడ్డింగును అప్పగించి టెలిగ్రాం ఆఫీసుకు త్వరగా దారి తీశాను అద్రుష్ట వశాత్తు అది తెరచే ఉంచారు

సినిమా కథ సుఖాంతం చేయడానికి నిశ్చయించ్చుకున్నాను "ఈవార్త సేట్‌కి అందచెయ్" అని సుబ్బారావుకి టెలిగ్రాం ఇచ్చిన తర్వాత బయటికివచ్చి శ్రీనివాసరావు ఇచ్చిన అడ్రసుని ఒకసారి తృప్తిగా చూసి, వడి వడిగా స్టేషన్ బయటికి వచ్చేశాను ★

# మనము—మనదేహస్థితి

(23-వ పేజీ తరువాయి)

తగిలిన దెబ్బ మెదడుకు తగలకుండా తలలో బొమికలు కాపాడినట్లే యీ నీరూ, ఒక నీటి దిండు లాగా పనిచేసి మెదడుకు ఆ ఆఘాతము తగలకుండా కాపాడతవి మెదడుమీది పొరలలో లోపలి పొర యీ నీటిని స్యందిస్తుంది ఒక్కప్పుడు—ముఖ్యంగా చిన్న పిల్లలలో యీ నీరు విశేషంగా ఉత్పత్తిఅయి తలపెద్దదై పోతుంది ఆస్థితిని 'హైడ్రో కెఫాలస్' (Hydro Capalus) అంటారు హైడ్రో అంటే నీటితో కూడుకున్న, కెఫాలస్ అంటే శిరస్సు అని ఆ మాటకర్థము మెదడుమీది పొరలను మెనింజస్ అంటారు ఇవి ఇన్‌ప్లేం అయితే ఆ స్థితిని మెనింజైటిస్ అంటారు

వయస్కుల్లో మెదడు 3 పౌను లుంటుంది పురుషుల మెదడు స్త్రీల మెదడుకంటె కొంచెం ఎక్కువగా వుంటుంది పుట్టినప్పుడు మెదడులో కేంద్రములు వృద్ధిచెందివుండవు వాటిలో వివరణ శక్తి వృద్ధిపొందదు ఇతర శరీర భాగములలాగే మెదడు వయస్సుతో పెరుగుతుంది ఈ పెరగడం 5 వ సంవత్సరంవరకు అత్యధికంగా వుంటుంది 20 సంవత్సరముల తరవాత యీ పెరగడం ఆగిపోతుంది వృద్ధులలో ఇతర శరీర భాగములలాగే మెదడు శుష్కించిపోతుంది మనస్సు, బుద్ధి, ప్రతిభ అని మనం చెప్పుకునే శక్తుల కన్నిటికీ మెదడే స్థానం ఈ శక్తులు కేవలం మానవజాతికి మాత్రమే విశిష్టమైనవి జంతువుల్లో జ్ఞాపకశక్తి కొంత వుండవచ్చు ఈ శక్తులవల్లనే మనం మాటలను ఏర్పరుచుకుని, భాషను సృష్టించుకొని వాటితో జీవిత కార్యక్రమమును ఒక రకంగా నడుపుకొంటున్నాము. సెరిబ్రం గౌరభాగంలో ఒక్కొక్క విషయానికి సృష్టిం ఒక్కొక్క కేంద్రము వున్నదని చెప్పేను మాటలు, దృష్టి, శ్రవణం, స్పర్శ, జ్ఞాపకం వీటన్నింటికీ ఫలితంగా ఏర్పడ్డవి అందుకని మాటలకు సంబంధించిన కేంద్రములు మెదడులో మూడున్నవి వాటిని చిత్రంలో చూడవచ్చును (2 వ చిత్రము)? రోలాండు గాడికి వెనుకప్రక్కవున్న ప్రదేశం సెన్సరీభాగం అంటే స్పర్శాది ఇంద్రియములకు సంబంధించిన భాగం ముచ్చెలగుంటకు ముందున్న భాగమును విజియో—సైకిల్ కేంద్రము అంటారు, విషన్ అంటే దృష్టి సైకిల్ అంటే దూరదృష్టి దూరశ్రవణం, ఇతరులు చూడని, చూడలేనివి చూడడం ఇటువంటి మానసిక లక్షణములు, కలలు భీతులు, ఇటువంటివి ఈ భాగంలో మార్పులవల్ల కలుగుతవి

సెరిబ్రములో గౌరభాగంలో మోటారు కేంద్రములూ, సెన్సరీ కేంద్రములు కూడా శరీరంలో అధోభాగములయిన పాదములకుసంబంధించినవి పైన, శిరస్సుకు సంబంధించినవి క్రింద వుండడం గమనించదగ్గది ఎందుకిల్లావున్నదో అంటే సమాధానం చెప్పడం కష్టం ఊర్ధ్వ మూల మధ శ్శాఖా" అన్న సంస్కృత వాక్యం యిందువల్లనే యేర్పడిందా? కొద్దికాలం క్రిందనే పాశ్చాత్య శాస్త్రజ్ఞులు తెలుసుకొన్న యీ వైజ్ఞానిక సత్యము ఋషులకు తెలుసునా? తెలుసుననే అనుకోవాలి. లేకపోతే శరీరమును వేళ్ళపైనా, కొమ్మలుక్రిందా వున్న చెట్టుతో ఎందుకుపోలుస్తారు?

ఇంతేకాదు సెరిబ్రములో ఎడమ భాగములో వున్న న్యూరానులనుండి బయలుదేరిన ప్రోగులు కుడివైపుకూ, కుడివైపునుండి పోయే పోగులు ఎడమవైపుకీ తిరిగి శరీర పార్శ్వములకు వెన్నుపాము ద్వారా పోతవి

శరీరంలో కుడిభాగము దేవభాగమనీ, ఎడమ భాగము పితృభాగమనీ మనవారి భావన కాని కుడివైపుకు సంబంధించిన, మెదడు భాగము ఎడమ వైపు, ఎడమ వైపుకు సంబంధించినది కుడివైపున శిరఃపేటికలో వున్నది పితృకర్మలు చేసేటప్పుడు దేవపూజా సంబంధమయిన తతంగంలో జంధ్యం, ఎడమ భుజంమీదా పితృదేవతలకు సంబంధించిన తతంగంలో కుడిభుజంమీద వేయడంలో అర్థం దేవపూజలో మెదడులో దేవభాగాన్నీ, పితృదేవ పూజలో పితృభాగాన్నీ, జంధ్యం ద్వారా సంబంధించడమేనా వారి ఉద్దేశ్యం? అప్పుడు పితృకర్మ యేర్పడ్డనాటికే వారికి వైజ్ఞానిక సత్యం తెలిసివుండాలి గదా? (పశేషము)



శ్రీ నాగేశ్వరరావుకు ఉపరాష్ట్రపతి బహుమతి అందిస్తున్నారు

సినిమా

# ఉత్తమచిత్రాలకు రాష్ట్రపతి బహుమతులు
# "మహాకవి కాళిదాసు"కు రజతపతకం

1960 లో ఉత్తమ తెలుగు చిత్రంగా ఎన్నికైన "మహాకవి కాళిదాసు" చిత్రానికి రాష్ట్రపతి రజతపతకం, "సీతారామకల్యాణా"నికి యోగ్యతా పత్రం లభించాయి ఉపరాష్ట్రపతి డా ఎస్ రాధాకృష్ణన్ బహుమతులు అందజేశారు

బహుమతిప్రదానోత్సవం ఇటీవల న్యూఢిల్లీ విజ్ఞాన భవనంలో జరిగింది దేశం మొత్తంమీద తయారైన చిత్రాలలో ఆరు ఫీచర్ చిత్రాలకు, మూడు డాక్యుమెంటరీ చిత్రాలకు రాష్ట్రపతి బహుమతులు లభించాయి హిందీ చిత్రం "అనూరాధ" అత్యుత్తమ ఫీచర్ చిత్రంగా ఎన్నికైంది ఈ చిత్రానికి రాష్ట్రపతి స్వర్ణపతకం, ఉత్తమ బాలల చిత్రం "ఘోల్ అవుర్ కల్యాణ్" చిత్రానికి ప్రధాని స్వర్ణపతకం లభించాయి బెంగాలీ చిత్రం 'క్షుదిత పాషాణ్' తమిళ చిత్రం "దైవపిరవి", మరాఠీ చిత్రం "కన్యాదాన్", ఒరియా చిత్రం "శ్రీ లోకనాథ్"లు కూడా బహుమతులు గెలుచుకున్నాయి

సభకు వి శాంతారామ్, పృథ్వీరాజ్ కపూర్, హృషీకేశ్ ముఖర్జీ, ఎ భీమసింగ్, బాలరాజ్ సహానీ, రాజేంద్రకుమార్, లీలానాయుడు, ఉషాకిరణ్, అరుంధతీ ముఖర్జీ, నిరంజన్‌రాయ్, శివాజీ గణేశన్, పద్మిని, జెమినీగణేశన్, సావిత్రి మొదలైన ప్రముఖ నటీనటులు, దర్శకులు వచ్చారు

"మహాకవి కాళిదాసు" నిర్మాత శ్రీ పి. సూరిబాబు, దర్శకుడు శ్రీ కమలాకర కామేశ్వరరావు, నటుడు శ్రీ అక్కినేని నాగేశ్వరరావు, నటి జూనియర్ శ్రీరంజని స్వయంగా వచ్చి బహుమతులు పుచ్చుకున్నారు

దేశంలో విచ్ఛిన్నకర శక్తులను నిరోధించేందుకు, జాతి ఐక్యతను వృద్ధి పరచేందుకు చలన చిత్ర పరిశ్రమ తోడ్పడాలని ఉపరాష్ట్రపతి బహుమతులు పంచిపెడుతూ సూచించారు చిత్ర నిర్మాతలు నైతిక, ఆధ్యాత్మిక, విలువల ప్రాధాన్యం గుర్తించాలని ఉద్బోధించారు

ఈ ఏడు బహుమతులు అందుకున్నవారిలో చాలామంది ఇంతకు మునుపు కూడా బహుమతులు గెలుచుకున్నవారు అయిఉండటం తమకు సంతోషం కలిగించిందన్నారు ఒకసారి బహుమతులు పొందినవారు సంతృప్తి చెంది ఊరుకోక, ఉత్తమ

చిత్రాలు తీసేందుకు శాయశక్తులా పాటుపడుతున్నట్లు దీనివల్ల ఋజువు అవుతోందని చెప్పారు

బహుమతులు పొందినవారిలో పిల్లలు కూడా ఉన్నందుకు డా రాధాకృష్ణన్ సంతోషం వెల్లడించారు "కొన్ని దేశాలలో సినిమాలు చూసి పిల్లలు చెడిపోతున్నారన్న భావం కలిగింది అప్పుడప్పుడు మన దేశంలో కూడా ఇలాంటిమాటే విన వస్తూ ఉంటుంది దీక్షతో కృషిచేసినట్లయితే, మనం మన చిత్రాల నైతిక ప్రమాణాన్ని పెంచగల మనటంలో సందేహంలేదు' అని ఆయన వివరించారు

ఫిలిం పరిశ్రమ తరఫున శ్రీ బి నాగిరెడ్డి మాట్లాడుతూ ప్రభుత్వం ఇస్తున్న బహుమతులు కళాకారులకు, చిత్రనిర్మాతలకు ప్రోత్సాహకరంగా ఉన్నాయని తెలిపారు ఈ పరిశ్రమ అంటే లోగడ ఉన్న అపోహలు ఇప్పుడు క్రమేపి తగ్గిపోతున్నాయనీ, సమాజంమీద సినిమాల ప్రభావాన్ని అంతా గుర్తిస్తున్నందుకు సంతోషంగా ఉన్నదనీ అన్నారు ★

## "భట్టి విక్రమార్క" శతదినోత్సవం

విజయోద్యానవనంలో ఇటీవల "భట్టి విక్రమార్క' చిత్రం శతదినోత్సవం వైభవోపేతంగా జరిగింది ఈ సందర్భంలో చిత్ర నిర్మాతలు పి. వి. వి. ఎస్ ఎం ప్రొడక్షన్స్ వారికి, కళాకారులకు, సాంకేతిక నిపుణులకు, డిస్ట్రిబ్యూటర్లకు ఎగ్జిబిటర్లకు సన్మానం జరిగింది మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి వి రాజమన్నారు బహుమతులు పంచిపెట్టారు ఎన్ టి రామారావు, రేలంగి, కాంతారావు, అంజలీదేవి, గిరిజ, కుచలకుమారి, మొదలైన నటీనటులు, పెండ్యాల నాగేశ్వరరావు, వెంకటసత్యం, సి. వి. వేణు వంటి సాంకేతిక నిపుణులు, దర్శకుడు శ్రీ జంపన స్వయంగా వచ్చి బహుమతులు స్వీకరించారు

## ముడిఫిలిమ్ కోత

ఈ నెల ప్రారంభం నుంచి సెప్టెంబరు ఆఖరు వరకు (అర్థ సంవత్సరంలో) ముడి ఫిలిమ్ దిగుమతి కోటాలను 26 శాతం తగ్గిస్తూ కేంద్ర ప్రభుత్వం ఇటీవల ఒక ప్రకటన చేసింది ఫోటోలకు ఉపయోగించే సున్నితమైన ద్రవ్యాలకు కూడా ఈ కోతను వర్తింపజేశారు

అయితే, రూపాయిలలో మూల్యం చెల్లించే పద్ధతిన జర్మనీ, యుగోస్లావియా దేశాల నుంచి ఈ సరుకులు దిగుమతి చేసుకోవచ్చునని ప్రభుత్వ ప్రతినిధి ఒకరు తెల్పారు

## హైదరాబాదు ఫిలిం వాణిజ్య సంఘ కార్యవర్గం

హైదరాబాద్ రాష్ట్ర ఫిలిమ్ వాణిజ్య సంఘం సర్వసభ్య సమావేశం ఇటీవల జరిగింది 1969—61 సంవత్సరానికి దిగువ సభ్యులతో కార్యవర్గాన్ని ఎన్నుకున్నారు అధ్యక్షుడు—శ్రీ మహమ్మద్ఆలీ కర్మానిలి నధానీ ఉపాధ్యక్షులు—శ్రీయుతులు శ్రీ చంద్‌జైన్, ఎస్ ఎల్ గుప్త, గౌరవ కార్యదర్శి—శ్రీ డి పి శ్యాల్ సంయుక్త గౌరవ కార్యదర్శి — ఎస్ ఎస్ లక్ష్మీనారాయన్, నిర్వహణ సంఘ సభ్యులు శ్రీయుతులు నాగేందర్ నాయుడు, టి సి సంఘీ, టి వి రాఘవరావు, జి డి దేశపాండే, రతీలాల్, పి పటేల్, వి ఎస్ దేశపాండే, భగవాన్‌దాస్ వర్మానీ టి ఎస్ నాగరాజన్

*   *   *

ఎలిజబెత్ రాణి భారతదేశ పర్యటన సందర్భంలో ఫిలిమ్స్ డివిజన్‌వారు తీసిన ఆగురీళ్ల చిత్రాన్ని మద్రాసు, కలకత్తా నగరాలలో ప్రదర్శించలేదు ఈ రెండు నగరాలలో రాణిగారి పర్యటనను సమగ్రంగా చూపకపోవటమే ఇందుకు కారణమని అనుకుంటున్నారు

ఈ చిత్రం ప్రీ-వ్యూ చూచిన మద్రాసు మంత్రులు శ్రీయుతులు సి సుబ్రహ్మణ్యం, భక్తవత్సలం కూడా ఈ లోపాన్ని గమనించినట్లు తెలుస్తున్నది ★



జూనియర్ శ్రీరంజని రజతపతకం అందుకొంటున్న దృశ్యం



ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌వారి 'భార్యాభర్తలు'లో గిరిజ, నాగేశ్వరరావు

# వార్తా భరణం

స్వర్ణశ్రీ ప్రొడక్షన్సువారు "ముగ్గురు మరాటీలు" చిత్రం తీయదలచారు ఈ చిత్రానికి శ్రీ ఎస్ రజనీకాంత్ దర్శకత్వం నిర్వహిస్తారు. ఛాయాగ్రహణం శ్రీ పి నాగేశ్వరరావు శ్రీ విశ్వప్రసాద్ మాటలు వ్రాస్తారు.

*　*　*

ఎస్ ఎల్ ఎస్ ప్రొడక్షన్సువారు "సతీ అహల్య" చిత్రం తీసేందుకు సన్నాహాలు చేస్తున్నారు నటీనటుల ఎన్నిక పూర్తి అయిందనీ, కృష్ణకుమారి కాంతారావు ప్రధాన భూమికలు నిర్వహిస్తారనీ తెలిసింది శ్రీ కృష్ణారావు దర్శకత్వం వహించనున్న ఈ చిత్రానికి సముద్రాల కథ, మాటలు సమకూర్చారు

*　*　*

శ్రీశ్రీ వ్రాసిన ఒక రేడియో నాటిక (వత్స కల్పం?) ఆధారంగా ఉషశ్రీ ప్రొడక్షన్సువారు చిత్రం తీయదలచినట్లు తెలిసింది చిత్రంపేరు ఇంకా వెల్లడి కాలేదు

*　*　*

శ్రీ రాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీవారు "మదన కామరాజు కథ" వలవచిత్రంగా తీయ సంకల్పించారని తెలిసింది చిత్రంలో ప్రధాన పాత్రలను ఎవరు నిర్వహిస్తారో ఇంకా తెలియలేదు.

*　*　*

"పట్టిందల్లా బంగారం" అన్న మకుటంతో సుచిత్రా ఆర్ట్ ప్రొడక్షన్సువారు ఒక చిత్రం తీసే ఏర్పాట్లు చేస్తున్నారు శ్రీ సదాశివబ్రహ్మ ఈ చిత్రానికి కథ వ్రాస్తున్నారు

*　*　*

జయరాం ప్రొడక్షన్సు అనే కొత్త సంస్థ సాంఘిక చిత్రం నిర్మించేందుకు పూనుకున్నది ఈ చిత్రానికి శ్రీ ఎ రంగారావు దర్శకత్వం వహిస్తున్నారు రామారావు, గుమ్మడి, పి ఎస్ ఆర్, రేలంగి, వంగర, చదలవాడ, జానకి, గిరిజ, హేమలత మొదలైనవారు నటిస్తున్నారు శ్రీ జానకిరాం ఛాయాగ్రహణం, శ్రీ జయరామరెడ్డి కళ, శ్రీ టి వి. రాజా సంగీతం, నిర్వహిస్తున్నారు చిత్రానికి ఇటీవల వాహినీ స్టూడియోస్‌లో శ్రీ కె వి రెడ్డి ప్రారంభోత్సవం జరిపారు

*　*　*

బి ఎ ఎస్ పిక్చర్స్‌వారి 'భీష్మ' చిత్రం విజయా, వాహినీ స్టూడియోలలో చురుగ్గా సాగుతోంది పోయినవారం, 'దుపదుడి మంది'రానికి సంబంధించిన దృశ్యాలు కొన్నిటిని చిత్రీకరించారు నారదుడు ద్రుపదుని కలుసుకుని శిఖండికి ఒక కన్యతో వివాహం ఏర్పాటు చేయాలని చెప్పే సంఘటన ఇది శిఖండిగా అంజలీదేవి, ద్రుపదుడుగా ముల్లాడి సత్యనారాయణ నటించారు రేలంగి నారద పాత్రధారి ఇక శిఖండిభార్యగా మీనాకుమారి నటించింది

ఈ చిత్రంలో ఎన్ టి రామారావు, నాగేశ్వరరావులు కూడా వేస్తున్నారు

'భీష్మ' చిత్రనిర్మాత బి ఎ సుబ్బారావుగారే దర్శకత్వం కూడా వహిస్తున్నారు

*　*　*

ప్రఖ్యాత సితార్ విద్వాంసుడు శ్రీ రవి

శేఖర్ స్వయంగా చిత్రం తీస్తున్నారు ఇది బెంగాలీ భాషలో ఉంటుంది దీని పేరు, 'ఘాగునే అషి, చెఫేరి', ఛాయాశాధ్ ప్రొడక్షన్ వారు దీని నిర్మాతలు

* * *

గీతా పిక్చర్స్ వారు తెలుగు, తమిళ భాషలలో నిర్మిస్తున్న "ఋష్యశృంగ" చిత్రం దాదాపు పూర్తి కావచ్చింది విజయ, వాహిని స్టూడియోస్‌లో ఈ చిత్రం షూటింగ్ జరుగుతోంది గతవారంలో గిరిజ, రేలంగి పాల్గొన్న హాస్య సన్నివేశం ఒకటి చిత్రీకరించారు దీనితోపాటు, యుగళ గీతానికి సంబంధించిన బృందనాట్యం ఒకటి కూడా తీశారు

తెలుగు చిత్రంలో రాజసులోచన, కాంతారావు, రేలంగి, గిరిజ, ఆశాలత, కుమ్మడి, నాగయ్య, కుచలకుమారి, సూరిబాబు, రఘురామయ్య, కాంతరావు, మాలతి నటిస్తున్నారు

* * *

బహు జనాదరణ పొందిన "ఉజాలా", "సింగపూర్" చిత్రాలు నిర్మించిన ఎఫ్ సి మెహరా ఇప్పుడు "ప్రొఫెసర్", "షికారి" అనే ముకుటాలతో మరో రెండు చిత్రాలు తీస్తున్నారు "ప్రొఫెసర్" చిత్రానికి లేఖ్ టాండన్ దర్శకత్వం వహిస్తున్నారు శంకర్, జైకిషన్ సంగీతం సమకూరుస్తున్న ఈ చిత్రంలో షమ్మీకపూర్ ప్రధాన భూమిక నిర్వహిస్తాడు నూతన తార కల్పన నాయికపాత్ర ధరిస్తుంది "షికారి" చిత్రంలో మహిపాల్ ప్రధాన నటుడు కె ఎల్ సింగ్, మదన్‌పురి మొదలైనవారు కూడా నటిస్తున్నారు దర్శకుడు మహమ్మద్ హుస్సేన్

* * *

గురుదత్ ఫిలింస్ వారు నిర్మిస్తున్న సాహెబ్ బీబీ గులామ్" చిత్రం తాలూకు రెండు పాటలను సంగీత దర్శకుడు హేమంత్‌కుమార్ ఇటీవల రికార్డు చేశారు గాయకురాలు ఆశాభోస్లే

* * *

సి ఎల్ సంతోషి దర్శకత్వాన యుగ్ ఛాయా వారు నిర్మిస్తున్న "హాలిడే ఇన్ బాంబే" చిత్రంలో శశికపూర్, విజయ చౌదరి, బిపిన్‌గుప్త, రాజేంద్రనాథ్, నూతన నటి షకీలాబాను నటిస్తున్నారు

* * *

దర్శకుడు ప్రమోద చక్రవర్తి, సి ఎం భక్కర్‌తో కలిసి నిర్మిస్తున్న "పాస్‌పోర్టు" చిత్రం దాదాపు పూర్తి కావచ్చింది మధుబాలా, ప్రదీప్ కుమార్, ప్రధానపాత్రలు నిర్వహిస్తున్న ఈ చిత్రంలో కె ఎన్ సింగ్ ప్రభృతులు కూడా నటిస్తున్నారు దక్షిణభారత నటి మాధురి నాట్యం ఈ చిత్రానికి ప్రత్యేకాకర్షణ



లలితకళానికేతన్ వారి 'భక్తజయదేవ'లో అంజలీదేవి, నాగేశ్వరరావు



వాహినీవారి 'బండరాముడు' చిత్రంలో సావిత్రి, రామారావు



శాంతికళా ఫిలిమ్స్‌వారి "శాంత"లో గుమ్మడి, అంజలీదేవి

# వార్తాభరణం

"అనూరాధ" చిత్రం నిర్మించి, ఈ ఏడు రాష్ట్రపతి స్వర్ణపతకం గెలుచుకున్న దర్శకుడు హృషికేష్ ముఖర్జీ ప్రస్తుతం రూబెన్, దూబే ప్రొడక్షన్స్ వారి "ఆషిక్" చిత్రానికి దర్శకత్వం వహిస్తున్నారు రాజకపూర్, పద్మిని, అభి భట్టాచార్య, అచలా సచ్‌దేవ్ మొదలైనవారు నటిస్తున్నారు

* * *

గుజరాతీ నవల "జనమ్‌టీప్" ఆధారంగా ఆనంద్ ఫిల్మ్స్ వారు నిర్మిస్తున్న "ఆగ్ అవుర్ పానీ" చిత్రంలో బాలరాజ్ సహానీ, నిరుపరాయ్ ప్రధాన భూమికలు నిర్వహిస్తున్నారు దర్శకుడు కుందన్‌కుమార్ నిర్మాత గోవర్ధన్ పటేల్

* * *

సుబోధ్ ముఖర్జీ నిర్మిస్తున్న వర్ణచిత్రం "జంగ్లీ" అవుట్‌డోర్ షూటింగ్ సందర్భంలో నాయకపాత్రధారి షమ్మీకపూర్‌కు స్వల్పమైన గాయాలు తగిలాయని తెలిసింది ఈ చిత్రంలో సయీరాభాను నాయికగా నటిస్తోంది

* * *

నిర్మాత – దర్శకుడు నాసిర్ హుస్సేన్ కమల్ స్టూడియోస్‌లో 'జబ్‌ప్యార్ కిసీసే హోతాహై" అనే చిత్రం తీస్తున్నారు దేవ్ ఆనంద్ నాయకుడు శంకర్, జయకిషన్ ఈ చిత్రానికి సంగీతం సమకూరుస్తున్నారు.

* * *

నిర్మాత సురేంద్రకపూర్ తీస్తున్న "ఇంతెజార్" చిత్రం త్వరితగతిని పూర్తి అవుతోంది ప్రదీప్‌కుమార్, గీతాబాలి, ప్రధాన పాత్రలు ధరిస్తున్న ఈ చిత్రంలో సులోచన, సుందర్ విజయలక్ష్మి మొదలైనవారు కూడా నటిస్తున్నారు దర్శకుడు కేదార్‌కపూర్

* * *

ఝాన్సీ ప్రొడక్షన్సువారు నిర్మిస్తున్న "జన్మహక్కు" చిత్రం తొమ్మిది రీళ్లు పూర్తి అయింది ఈ చిత్రం ఇతివృత్తం పశుప్రవృత్తి సమస్య సంస్థ మేనేజింగ్ డైరెక్టరు శ్రీ రాజగోపాలరెడ్డి చిత్రంలో విలన్‌పాత్ర ధరిస్తున్నారు సి ఎస్ ఆర్ హరనాథ్, బాలకృష్ణ, నల్లరామమూర్తి, హేమలత మొదలైనవారు కూడా నటిస్తున్నారు రాజగోపాలరెడ్డి, చంద్రశేఖరరెడ్డి కలిసి నిర్మిస్తున్న ఈ చిత్రానికి దర్శకుడు మహతి స్టూడియో వాహిని

* * *

రాజ్‌కపూర్ క్రొత్త వర్ణచిత్రం 'సంగం' లో వైజయంతిమాల నటిస్తుందని తెలుస్తోంది. దీని షూటింగ్ కాశ్మీర్‌లో ప్రారంభిస్తారు 'సంగం' దర్శకత్వం కూడా రాజ్‌కపూర్‌దేనని వేరే చెప్పనక్కరలేదు కథ ఇందర్‌రాజ్ ఆనంద్ వ్రాశారు సంగీతం శంకర్ జయకిషన్ సినిమటోగ్రఫీ రాధూ కర్మాకర్

ఇదే చిత్రంలో మరో 'హీరో' ఉన్నా ఆపాత్ర ఎవరు వేసేదీ చెప్పలేదు ★



# వనితా వాణి

## మానవతీ-మధులిప్స

మానవతి మధులిప్స అనే వ్యాసం చదువు తుంటే ఒళ్ళు పులకరించినది ఎంతో మృదు మధురంగా ఉందీవ్యాసం ఇక ముందు కూడా ఇటువంటి వ్యాసాలు పిల్లల పెంపకం గురించి, గృహిణికి సంబంధించిన వ్యాసాలు వ్రాసి మా వంటి చదువరులకు అందింతురని ఆశిస్తున్నాము. రచయిత్రికి నా ధన్యవాదాలు

ఆర్. సుప్రియాదేవి, విశాఖపట్నం.

*　　*　　*

బి కామేశ్వరీ కృష్ణగారు వ్రాసిన మానవతీ—మధులిప్స అన్న వ్యాసం చాలా బాగుంది వారన్నట్టు స్త్రీత్వానికి చిహ్నమే మాతృత్వం మాతృత్వం స్త్రీ జీవితంలో అనుభవించవలసినదేగాని, దాని అనుభూతు లిటువంటివని మనం వ్రాయలేము అన్న దాంట్లో సత్యం లేకపోలేదు ఇంత చక్కటి వ్యాసము వ్రాసినందులకు రచయిత్రికి నా హృదయపూర్వక ధన్యవాదాలు

పి నళినిప్రభ (గుంటూరు)

*　　*　　*

ఆంధ్ర సచిత్ర వార పత్రిక 5—4—61 సంచిక వనితాలోకం శీర్షికలో బి కామేశ్వరి కృష్ణ వ్రాసిన మానవతీ—మధులిప్స చదివాను సంతానవతిగా స్త్రీకి మనలోఉన్న ప్రత్యేకత, గౌరవం, సంతానహీనకులేదు అని వ్రాశారు ఇది ప్రస్తుత కాల పరిస్థితికి అనుగుణంగాలేదు మరల భార్యాభర్తలు దాంపత్య జీవితంలో ఒకరి నొకరు విడిచి బ్రతకలేకపోవడానికి పిల్లలే కారణం అని కూడా అన్నారు దీనితో నేనేకీభవించను

వి సుజాతశర్మ (కర్నూలు)

*　　*　　*

## వేసవి కాలం

5—4—61 తేదీ ఆంధ్ర సచిత్ర వార పత్రికలో (సి రాధ) గారు వ్రాసిన వ్యాసం 'వేసవికాలం వచ్చింది' అన్నది ఎంతో బాగుంది వారు అన్నట్లు ఎక్కువ పౌడరు రాసుకోవటము అంతమంచిది కాదేమోనని నాకు తోస్తోంది స్నానం చేసేటప్పుడు శుభ్రంగా ఒళ్ళు రుద్దుకోవాలి ఎందుచేతనంటే మన శరీరాలు బట్టలతో నిండివుంటాయి. చమటలో స్నానమ్మైపోతూ ఉంటవి

కల్పన (బద్వేలు)

*　　*　　*

## చదువుకున్న స్త్రీ బాధ్యత

స్త్రీ ధర్మం,స్వాతంత్ర్యం అనే వ్యాసంలో సుశీల గారు వ్రాసినట్లుచదువుకొన్న స్త్రీల గురించి కొన్ని చెడ్డఅభిప్రాయాలుకొంతమందిలో ఉన్నాయన్నమాట యధార్థమే అది పొరపాటే అయినా అజ్ఞానమువల్ల జరుగుతున్నదని అనుకోవాలి. కులోక అనుమానమేమంటే విజ్ఞానవంతులనబడే స్త్రీలు విద్యా విహీనులైన తోటి స్త్రీలయందు ప్రదర్శిస్తున్న అంటరాని తనాన్ని వారిలో సంస్కారానికి చిహ్నంగా భావించవలసి వుంటుందా? అని. అయితే మొదటి పొరపాటు అజ్ఞానమువల్ల జరుగుతుంటే రెండవ పొరపాటు విజ్ఞానముయొక్క ఫలితమేమో అని నాలాంటి ఇంగ్లీషురాని విద్యావిహీనలైన స్త్రీలు ఒక్కొక్కప్పుడు బాధతో భావించవలసి వస్తున్నది ఏది ఎలావున్నా స్త్రీకి చదువుకంటే సంస్కారము ముఖ్యము చదువుకున్న భార్య, భర్త ఇంటికి రాగానే రాజకీయాల గురించి ఇంగ్లీషులో మాట్లాడినంతలో అతన్ని స్వర్గసీమలో విహరింపచేయనూలేదు. అలాగే బజ్జీలూ, పిండివంటలూ గురించిచెప్పే ఇంగ్లీషురాని భార్య అతన్ని నరకకూపంలోకి తొయ్యనూలేదు సంస్కారంలేని భార్య డిగ్రీ సంపాదించినప్పటికీ వైవాహిక జీవితం పునాదులకు ప్రమాదమే కావున చదువుకున్న స్త్రీలు చక్కని సంస్కారాన్ని అలవరచుకొని సంఘంలో ఇతర స్త్రీలకంటే బాధ్యతాయుతంగా తమ కర్తవ్యాన్ని నిర్వర్తించవలసి వుంటుంది. అంటరానితనంలాంటి చీడనుండి సంఘాన్ని కాపాడి సర్వ మానవ కల్యాణానికి మంగళతోరణం కట్టాలి.

డి. వి. రమణ (ఏలూరు)

*　　*　　*

## పేరు చెపితే తప్పా?

29—3—61 తేది పత్రికలో పి హెచ్. సుభద్రగారు సిగ్గు ఎందుకు అన్న విషయంపై రాసిన వ్యాఖ్యానం చదివి నాకు నిజంగా సిగ్గు వేసింది "బి ఏ ప్యాసయిన అమ్మాయిలు భర్త పేరు చెప్పడానికి సిగ్గు పడటంలేదూ?" అని రాసారు. అయినా నాకు తెలీకడుగుతాను మన భర్త పేరే మన యింటిలో తమ్ముడికో అన్నయ్యకో ఉంటే ఏం చేస్తారు

అయినా భర్త పేరు చెప్పడానికి సిగ్గెందుకు? మన జీవితభాగస్వామిపేరు మనం గర్వంగా చెప్పగలగాలిగాని? అవును, స్త్రీకి అలంకారం సిగ్గే! దాన్ని నేను కాదనటంలేదు కాని అది అన్ని సమయాల్లోనూ రాణించదు ఉదాహరణకి ఏదో అర్జంటుపనికలిగి మీ ఆయన ఆఫీసుకు ఫోనుచేశారనుకోండి మీ ఆయనకాక మరెవరో రిసీవ్‌చేసి "మీరెవరు? ఎవరు కావాలి?'' అని అడిగితే ఏంచెప్తారు? నేను మా



# వనితా వాణి

ఆయన భార్యని. మా ఆయనతో మాట్లాడా అంటారా? తప్పనిసరిగా మీ ఆయనపేరు చెప్పాలికదా? గుళ్లో "ఆయన" పేరుతో అర్చనచేయించే దగ్గర నుండీ....పెన్షన్ ఆఫీసరుగారితో చెప్పడంవరకూ ఎన్నిసార్లు తప్పనిసరి అవుతుందో! నిజానికి యిలాటివి అందరికీ అనుభవమే! పబ్లిక్‌గా చెప్పేటప్పటికి అందరికీ కోపాలు! ఇలాటి నిజాల్ని పబ్లిక్‌గా మెచ్చుకుని బ్రతికిపోగలమా?

ఆధునికయుగంలో ఆడవాళ్ళపేర్లకు ప్రాముఖ్యం తగ్గిపోయింది పెళ్ళికిముందు నాన్నగారిపేరు, తరువాత భర్తపేరుతోటే పిలువబడుతున్నారు ఇలాటప్పుడు సుభద్రగారు ఈ విషయం వ్రాయటం విచారకరం

శ్రీమతి ప్రభంజనరావు (బళ్ళారి) ★



# గళ్లనుడికట్టు-48



## అడ్డం

2. పేరాశలోని కోర్కె!
3 రామాయణంలో నిజం కానిది ఏది?
6 అంగడి యిప్పుడు కప్పినా పోయినా కాలమానం దొరకుతుంది.
7. సోము—(మూడక్షరాలు)
8 చేతులు, క్షేత్రాలుగా మార్చండి!
9 వినయంలోనే మంచిగుణం ఉందని వేరే చెప్పాలా?
11 4 నిలువులో దాక్కున్న సన్యాసి
12 ఆగవయ్యా! నీవిడుపేమిటి మధ్యలో.
14. మూడు ఒక మాటలో.
15 ఈ యువిమిషసమూహములో దాక్కున్న ముని హంసలాగ ఉంటాడు.
17 వ్యాయామము — కత్తి, కర్ర, మొదలైన వాటితో-
18 మనుష్యకి విశేషణము.
20 కా బహువచనంలో ఒకటే అంగము!
21 ఇటునుంచి అటునుంచి కూడా చిన్న కుండ సాగర గర్భంలో ఉందేమో చూడండి
22 సాధువు జీవితములో కదిలింపబడినదాన్ని చూస్తాడు
23 ఈ చెట్టు నీడలో తేలుట!
24. ఎద్దు వేసేది.
26 ఉవము, అంటే తినేదాన్నికాదు కాని పేరు వెదకండి.
27 అటునుంచి మిక్కిలి
29 విజరహితమ్మైనదానిలోనే రాత్రి కూడా తల క్రిందులుగా ఉంది
30. "శ్రీరాము—"
32 బొమ్మని అవడంలో కష్టంలేదు.
33. తిరగబడిన ఏకాకి పక్షి?
35 నేరేడు పువ్వుకు దళమా?
36. తేమకల అడ్డమా? అల్లుతారా?
37. పగడమునే విప్పారేట్టు చేయండి.
38 తిరగబడిన వృక్షవిశేషం మర్రిచెట్టుక్రింద కనుపిస్తుంది
39 అటునుంచి నీళ్ళనాపే తలుపు పేకులాట మధ్యనే ఉంది.

## నిలువు

1 ద్వేషాలు రాత్రి తర్వాతనే!
2. ఈయన కానివాడు
4 శర్మిష్ఠ కథలో వచ్చేవాడు.
5 మేకలు వస్తే చాలదు! చంద్రుడు రావాలి విచ్చడానికి
8 వడియాలు చేయని వనితలోనే ఉన్నది!
10 మెషీన్ (ఇంగ్లీషు పదం)కు తెలుగు.
11 ఇంకా నయము! నది ఉన్నదన్నారు.
13 ఒక గది కాదు.
16 మిగిలినది
17 సారంగమృగాన్ని ద్రవంగా మార్చండి
19 క్రిందనుంచి పైకి మద్రాసు రాష్ట్రంలో తియ్యనివట్నం
20 మునుకాడుకాని, ద్వితీయ విభక్తి ప్రత్యయ లోపంతో మన్మథుడయ్యాడు ఇప్పుడు!
23 ఈ దగ్గిర పెద్ద గాలికి సంబంధించినదేదైనా ఉందా?
25 అల.
26 నిన్ను ఉతికి, ఉండే తోటు కనిపెట్టేస్తే!
28. కఠినం
31 తక్షణము ఒక అక్షరముకోసి పారెయ్యండి! అదేమిగుల్తుంది
32 చిందర వందరయిపోయిన పక్కా. కడపట పరీక్షించండి
34 కాలాపకుండా రక్షించండి!
35 వల్లని మట్టి.

## 47-వ గళ్లనుడికట్టుకు జవాబు



ఒకరొకమిత్రునితో: సైకిలు త్రొక్కటం నేర్చుకోటానికి ఎంతకాలం పడుతుందంటారు నాకు?

మిత్రుడు—అదొక బ్రహ్మ విద్యటండీ? మీరు నాలు రోజుల్లో నేర్చుకోవచ్చు. పోతే, మీరు సైకిలు త్రొక్కుకు వెడుతూంటే రోడ్డు మీద నడవటం నేర్చుకోవటానికి—దారే పోయే మనుషులకి పడుతుందెంతైనా కాలం!

వి. ఎస్. మూర్తి (హైదరాబాద్)




జి. గణేష్ (కాకినాడ)

## యుక్తి

అనగా అనగా ఒకరాజు. ఆరాజు తన రాజ్యంలో జీవహింస చేయరాదు అని శాసించాడు.

కొన్నాళ్లకు ఒక గొల్లవాడు దొంగతనంగా మేకను చంపితినవలెనని బుద్ధి పుట్టి మేకను చంపాడు. ఇంతలో రాజభటులు వచ్చి వానిని మేకతో రాజుముందరపెట్టారు. రాజు గొల్లనిచూచి కోపించి ఈ మేకను ఎందుకు చంపావు అని అడిగాడు. గొల్లవాడు నిరుత్తరుడైనాడు.

రాజు:- ఓరీ నాముందే జవాబు చెప్పలేకపోతున్నావు. రేపు దేవునిముందేమిచెప్తావు?

గొల్లడు:- నేను చచ్చిపోయినతరువాత నన్నేమి అడుగుతాడా దేవుడు?

రాజు - నిన్ను బ్రతికించి అడుగుతాడు.

గొల్లడు:- అయ్యా ఈ మేక వుంటేగదా నన్ను అడిగేది.

రాజు:- ఓరీ మూర్ఖుడా, దానిని గూడ బ్రతికించి నీ ఎదుట నిలబెట్తాడు.

గొల్ల:- అట్లయితే నామేక బ్రతికుంటే నన్నెందుకు దండిస్తావయ్యా అని దేవుడినే అడగనా?

—టి. తాతయ్య (తిరటూరు పేటం)

# పొట్టికథలు

ఒకబ్బాయి కలకన్నాడు

బళ్ళో మేష్టారు లడ్డూలు పంచిపెడుతున్నారు. అయితే సగం లడ్డూ మాత్రమే ఇస్తున్నారు. అబ్బాయి నోటిలో జల ఊరుకొచ్చింది! మేష్టారు దగ్గరకు వచ్చేటప్పటికి "నాకు పూర్తి లడ్డూ కావాలి, మాష్టారూ" అన్నాడు.

"సగమే ఇస్తారోయ్" అన్నారు మేష్టారు. తెలివివచ్చేసింది అబ్బాయికి.

మేష్టారు లేరు. లడ్డూలు లేవు.

"సరే మాష్టారూ, సగమే ఇవ్వండి" అన్నాడు, అబ్బాయి కళ్లు మూసుకొని.

మృగశిర (కాకినాడ)

Edited, Printed and Published by S Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street, Madras-1. Chief Editor. S. Sambhu Prasad.

పీచ్‌ఫలంతో 

విందు 

యెడారియందు 

ఎంతో ఆలోచన  అక్కర్లేదు

మిడ్‌లాండ్స్ 

అంతే ఎచ్చటైనా,

ఏసమయంలో నైనా దివ్యమైనది. 

రుచికరం అలాగే  లేక

 క్రీమ్‌తో చాలా భోగ్యమైనది

 ఐస్‌క్రీమ్‌తో

**Midland**

మిడ్‌లాండ్ — రుచికరమైన 28 రకముల, పళ్లు, కాయగూరలు, జామ్‌లు, జెల్లీస్, అండ్ కెచప్.

తయారు చేయువారు, మిడ్‌లాండ్ ఫ్రూట్ అండ్ వెజిటబుల్ ప్రాడక్ట్స్ (ఇండియా) మధురా

MIDLAND

సోల్ డిస్ట్రిబ్యూటర్లు • కార్న్ ప్రోడక్ట్స్ కొ (ఇండియా) ప్రైవేట్ లి, బొంబాయి

భారతదేశంలో ఏజెంట్లు • ప్యారి అండ్ కంపెనీ లిమిటెడ్

